శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల

హంపిహాపురం పుష్పము—28

శ్రీ

# రాయలసీమ రచయితల చరిత్ర-3

మూడవ సంపుటి

— స్వర్ణోత్సవ విశేష ప్రచురణ —

ఈ సంపుటితో చేరి. 20వ శతాబ్దపు రాయలసీమ కవిరత్న

ముల చరిత్రలు ఏర్చి, కూర్చి, తీర్చబడి నూటొక్క

రత్నహారముగా తెలుగు తల్లి కంఠసీమ సలంకరింపబడినది

గ్రంథకర్త

కవిభూషణ, కవితిలక, కల్లూరు అహోబలరావు

❋ Ist Edition
Copies 1100
1981 August.

❋ **Rayala Seema Rachayithala Charitra-3**

❋ Kavi Bhushana Kavi Thilaka
KALLUR AHOBALA RAO

❋ Book Publishers & Distributors
**Sree Krishna Devaraya Grandha Mala**
Hindupur-515 201.

❋ Cover Design
Babu Arts & Kallur Rao, Hindupur (A P)

❋ PRINTERS
Lapakshi Art Printers - Hindupur
&
Bharath Printing Press, Railway Road,
Hindupur



❋ PRICE Rs. 8-00

# పీఠిక



—శ్రీ ఘట్టమరాజు అశ్వత్థనారాయణ, M. A.,

రాష్ట్ర, దేశ సరిహద్దులను దాటి ప్రపంచ సాహిత్యాన్ని అధ్యయనం చేస్తున్న ఈ రోజులలో తెలుగులోని రాయలసీమ రచయితల చరిత్రకే పరిమితంకావడం భిన్నభిన్న ప్రతిక్రియలను కలిగించవచ్చును. నానాటికీ సాహిత్యము శాఖోపశాఖలుగా తామరతంపరగా వర్ధిల్లుతున్న ఈ కాలంలో ఏ భాషలో ఐనా సాహిత్య, చరిత్రకారుడు, రచయితలందరిని సమీక్షింపలేడు. అందువల్ల ఒకభాషలోని వివిధ ప్రాంతాలలోని రచయితలను జిల్లాల వారీగా పట్టీచేసి, పరిశీలించటం చారిత్రిక అవసరం. ఇందువల్ల ఏ కవి చేసిన సాధన, పొందిన సిద్ధి విమర్శకుల, సాహిత్య చరిత్రకారుల దృష్టినుండి తప్పటం జరగదు. సాహిత్య ప్రపంచంలో ఇట్లా ప్రాంతీయ, మాండలిక వర్గీకరణ తమ ప్రాంతానికి, జిల్లాకు చెందిన రచయితలను అర్థం చేసుకొని, తద్వారా

సమగ్ర సాహిత్య అవగాహనను పెంపొందించు కొవేందుకు దోహదం కావాలే కాని, పరస్పర దూషణ తిరస్కారాలకు ఆస్పదం కారాదన్న సంగతిని సాహిత్య ప్రియులందరు గమనించాలి.

తమ రచనలను ప్రచురించు కోవటం పట్ల విరాసక్తి, లౌక్యం తెలియకపోవటం, అతిశయించిన ఆత్మాభిమానం, విమర్శకుల విపరీత ధోరణులు — ఇంకా ఎన్నో కారణాలుగా రాయలసీమ రచయితలు ప్రతిభావంతులై వుండీ పైకి రానివారు చాలామంది వున్నారు. అధికార స్థానాలను ఆక్రమించుకొన్న రాజకీయ నాయకులు, విశ్వవిద్యాలయాలను, అకాడమీలను అలంకరించిన సాహిత్యాచార్యులు సృజనాత్మక రచయితలను, పండితులను పలకరించే పుణ్యాన్ని వొడిగట్టు కోలేదు. అందువల్లనే—

"కాంక్షలే వేఱు, నా మనోగతులె వేఱు
పూరి గుడిసెల లోనైన బుత్తుగాని
గీత మల్లిక ద్రంకు సాధింప లేను
భావ గానంబె నాదు సర్వస్వమనని"

అని 'మధురకవి' బెళ్లారి శ్రీనివాసమూర్తిగారు ఆలపించి నట్లుగా భావాంబర వీథులలో దేదీప్యమానంగా వెలుగవలసిన కవులు దివ్వెలవలె మిణుకు మిణుకు మంటూ ఏ మూలల లోనో వొదిగి పోయినారు. రాజకీయ, సాహిత్య అధినాయకుల ప్రాపు, ప్రచార సాధనాల పోషు, ఇంకా చిల్లర మార్గాల ద్వారా కీర్తికిరీటాలను అలంకరింప చేసుకొంటున్న ఈ రోజులలో ఏకాంతవాసులైన కవి పండితుల పేరు కూడ పదిమంది నోట పడకుండ పోతున్నది. చాలామంది రాయలసీమ రచయితలకు ఈ ఏకాంతవాసమే తప్పనిసరి అయింది. ఆధునిక తెలుగు సాహిత్య ప్రపంచంలో అగ్ర పంక్తిని అలంకరించిన పుణ్యశాలురు—కట్టమంచి, రాళ్ళపల్లి, గడియారం, పుట్టపర్తి — వంటి కొద్దిమందే. చేవ వుండీ చొరవలేక, శక్తివున్నాయుక్తి

కటిన్నై ఎంతోమంది రాయలసీమ రచయితలు ఇంకా అజ్ఞాత వాసాన్ని అనుభ విస్తున్నారు.

లోగడ శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారు 'నా సీమ కవులు' అనే గ్రంథంలో రాయలసీమకు చెందిన పెక్కుమంది కవి, పండితుల ప్రతిభా విశేషాలను వెల్లడించినారు. చిత్తూరు జిల్లా రచయితలను గూర్చి సింహ సోదరకవులు, మధురాంతకం రాజారాంగారు పుస్తకాలు వెలువరించి ప్రశంస నీయమైన కృషిచేసినారు. 'అనంతపుర మండల తెలుగు రచయితలు-రచ యిత్రులు అనే గ్రంథం ద్వారా శ్రీ అవ్వారి నారాయణ చేసిన ప్రయత్నం కూడ శ్లాఘనీయమే. అయితే ఈ గ్రంథాలేవీ బహుళ ప్రచారానికి నోచు కొనక పోవటం దురదృష్టం.

రాయలసీమ రచయితల రచనలను వెలుగులోనికి తెచ్చే సత్సం కల్పంతో 1931 లో బళ్ళారిలో, శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల స్థాపించ బడింది. నమారు మున్నై పుస్తకాలు ప్రచురించిన ఈ సాహితీసంస్థ ప్రచురణలలో 'రాయలసీమ రచయితల చరిత్ర' సంపుటాలు అమూల్యమై నవి. శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల కర్ణధారి అయిన, శ్రీ కల్లూరు అహో బలరావుగారు రాయలసీమ రచయితల చరిత్ర' మొదటి భాగంలో (1975) 20 మంది రచయితలను, రెండవ భాగంలో (1977) 31 రచయితలను (ఒక రచయిత్రితో సహా) వారి జీవిత సంగ్రహములతో పాటు, రచనా విశేషాలను కూడ క్రోడీకరించినారు. నేడు శ్రీ కల్లూరు అహోబలరావుగారు యాభై మంది రచయితల జీవిత రచనా వైశిష్ట్యాన్ని సంతరించుకొన్న' రాయల సీమ రచయితల చరిత్ర' మూడో భాగాన్ని తెలుగుతల్లికి సమర్పిస్తున్నారు.

'రాయలసీమ రచయితల చరిత్ర' ఒకటవ, రెండవ భాగాల్లో చాలా మంది ప్రసిద్ధ రచయితలు పరిచయం చేయబడినారు కాని ఈ మూడో భాగంలో సాక్షాత్కరించేరచయితలలో ముక్కాలుమువ్వీసము అజ్ఞాతంగాఅల్పజ్ఞాతంగా వున్నవారే, లేపాక్షి రామాయణము, లేపాక్షి కృష్ణనాటకము, లేపాక్షి భార

తము మొదలగు యక్షగానాలను రచించిన లేపాక్షి కవులను ఇంతవిస్తారంగా తెలియ జేసే ప్రథమ గ్రంథము ఇదే ననుకొంటా. 'తొలకరి చినుకులు' 'క్రొక్కారు మెఱుగు' అనే కవితా సంపుటాలను భావకవితా యుగంలో వెలువరించిన 'కవికుమారసమితి' (అనంతపురము) కి చెందిన శ్రీ వెల్లాల ఉమామహేశ్వరరావు, పాళ్లూరు సుబ్రహ్మణ్యాచార్యుడు, మరం వాసుదేవమూర్తి గారలను పరిచయం చేసిన తొలిగ్రంధం కూడ ఇదేకాబోలు. రాయలసీమ రైతు కడగండ్లను హృదయానికి హత్తుకొనేలా చిత్రించిన భైరపురెడ్డి రెడ్డి నారాయణరెడ్డి, 'ఆత్మరామాయణము' వంటి మధుర కావ్యాన్ని అందించిన లలితకవి మలుగూరు టి. గురుమూర్తి, వాఙ్మయ వీథుల్లో అచంచల ఆత్మ విశ్వాసంతో యథేచ్ఛగా విహరించే సర్దేశాయి తిరుమలరావు, సర్కారు ప్రాంతంలో పుట్టి, ఉద్యోగరీత్యా రాయలసీమలో స్థిరపడి, ఈగడ్డను ఆత్మీయంగా అల్లుకొనిపోయి, ఇక్కడి కవిపండితులను త్రికరణశుద్ధిగా ప్రోత్సహిస్తున్న రావినూతల శ్రీరాములు వ్రాసింది, తక్కువైనా, ఇతరులచే వ్రాయించిందే ఎక్కువ. అందులోనే మక్కువను కనబరచే 'సాహితీ బంధువు' తూముకుంట భీమసేనరావు ఇత్యాది రచయితల వర్ణచిత్రాల కెలిడియో స్కోపు — ఈ మూడోభాగం; కల్లూరు అహోబలరావుగారు రచయితల జీవిత విశేషాలతో పాటు, వారి రచనల వైశిష్ట్యాన్ని కూడ క్లుప్తంగా పొందు పరచినారు. కొన్నిచోట్ల రచయితల రచనల పరిచయం స్థూలంగా వుంది. మరికొన్నిచోట్ల రచనల జాబితా మాత్రమే కూర్చబడివుంది. కల్లూరి వారు భగీరథప్రయత్నం ద్వారా "రాయలసీమ రచయితల చరిత్ర" సంపుటాల్లో భావి తెలుగు సాహిత్య చరిత్రకారులకు కావలసినంత ముడిసరుకు అందించినారు. ఈ ఉపకారం గోరంతదైనా కొండంత విలువైనది.

లబ్ధ ప్రతిష్ఠితులైన రాయలసీమ రచయిత లెందరో ఈపాటికే ఈ మూడుభాగాల్లో అవతరించి వుండవలసింది. కర్నూలు, చిత్తూరు జిల్లాలకు చెందిన రచయితలు తగినంత ప్రాధాన్యం పొందలేదు వీటిని గ్రంథకర్త మలి సంపుటాల్లో రూపొందింప చేయగలరని ఆశిస్తున్నాను. రాయలసీమ రచయితల చరిత్ర' ఇంకెన్ని సంపుటాలుగా వెలువడ గలదో నేనువూహింప

లేకున్నా, మరికొన్ని సంపుటాలు వెలుగు చూసేందుకు తెలుగు సాహిత్యాభిమానులు అందరు వారితో సహకరించవలెనని నేను కోరుతున్నాను.

ఎనభై ఏళ్ళు నిండి, జీవిత సమరంలో ఎన్నో ఆటుపోట్లకు గురియైకూడ 'రాయలసీమ రచయితల చరిత్ర' మూడోసంపుటాన్ని వ్యయప్రయాసల కోర్చి వెలువరించిన శ్రీకల్లూరి అహోబలరావుగారిని అభినందిస్తున్నాను. తండ్రికి చేదోడు వాదోడై నిలిచిన చి॥ రాఘవేంద్రరావుగారు ఈసత్సంప్రదాయాన్ని కొనసాగించవలెనని మనసారా అభిలషిస్తున్నాను.

24—7—81
బెంగళూరు

ఇట్లు,
ఘట్టమరాజు అశ్వత్థనారాయణ M A.

# సంపాదకీయము



రాయలసీమ రచయితల చరిత్ర, మూడవ సంపుటితో చేర్చి, 101 మంది, రచయితల చరిత్రలను వెలువరించినాము. 1, 2 సంపుటములకు, పీఠికలు వ్రాసిన కీ॥ శే॥ కల్లూరు వేంకటనారాయణరావు (కవిత్వవేది)మఱియు శ్రీ పైడి లక్ష్మయ్యగార్ల, సూచనలను మన్నించి మఱుగువఁబడియున్న కవిరత్నముల, చరిత్రల నన్నింటిని, సాధ్యమైనంత వఱకు సేకరించి ఈ సంపుటిలో చేర్చగలిగితిని. ఈ సంపుటిలో - లేపాక్షి కవులు - కొండఱు నాటక కర్తలు - ప్రబంధ కవులు - కర్షక కవులు-అనబడు శీర్షికల క్రింద కవులను పేర్కొంటిని.

పోలికి నరస చిదంబర రాయకవి, వంకాయలపాటి, సుబ్రహ్మణ్య కవి, కవికుమార సమితి కవులు, ఈ తృతీయ సంపుటిలో వచ్చినారు. ఇంకెందరో రత్నముల వంటి కవిపండితులు రాయలసీమలో మిగిలి యున్నారు.

ఈ సీమకవులకు కాణాచి. పండితులకు పుట్టు. పలువురు స్త్రీ రచయితలుకూడ ఉన్నారు.

ఈ కార్యము బృహత్తరమైనది. నా వంటి వయోవృద్ధులు చేపట్ట వలసిన పనికాదు ,విశ్వవిద్యాలయముల లోని, పరిశోధక కర్తలు చేపట్టవల సిన పని యయ్యది. వారుచేబట్టిన 'డాక్టరేటు' బిరుదములు, బహుమాన ములు పొందగలరు నావంటి వృద్ధులకు డాక్టరుగారి బిల్లులు తప్పక రాగలవు. వృద్ధాప్యమున మీకీ కష్టమేల ? హాయిగా కుదిచి కూర్చుండి విశ్రాంతి తీసు కొవరాదా ? అని ప్రశ్నించిన వారు లేకపోలేదు, ఏమి చేయవలెనో, నాకు తోచకున్నది. ప్రారంభించిన కార్యము తుది ముట్ట జేయవలదా ? అని నా మనస్సాక్షి నన్ను హెచ్చరించు చున్నది. ఆ ఆత్మారాముడే, నన్నీ పనికి పురి గొల్పుచున్నాడు కాన, కన్నులు, కాళ్లు. ఓపిక ఉన్నన్ని నాళ్ళు, చేతనై నంతగా, సాహితీ సేవచేయ నడుకట్టితిని.

రెండు సంపుటములు చక్కగా చదివినవారు, ఈబృహత్కార్యము మీరు ముగింప వలయునని నాకుత్సాహ మొసగినవారు పలువురు కలరు. అందులో ఉన్నతాదర్శములు గల సహృదయులు, శ్రీ ఘట్టమురాజు అశ్వత్థనారాయణ గారు, బెంగళూరు, వారుమన రాయలసీమవారే. వారు బెంగళూరులో ఆంధ్ర సాహిత్యసేవ సలుపుచున్నారు. వారీ పుస్తకమునకు పీఠిక వ్రాసినారు.

ఈ చరిత్రలు, కవుల పేర్లు సూచించు క్యాటలాగు కాదు. 'Who is who of Rayala Seema Poets and Pundits'అను విష యములు విపులముగా, నుండిన తప్పక భావీ తరముల వారికి కవి చరిత్రల, పరిశోధించువారికి, చక్కగా నుపయోగపడునట్టి 'యన్ సైక్లోపీడియా' (Encyclo Paedia) వలెనుండవలయునని మా ఆకాంక్ష. ఈవచన రచనము వ్రాయుటలో, చిరంజీవి నా కనిష్ఠ పుత్రుడైన, కె. రాఘవేంద్రరావు, సెక్రెటరీ' గా పనిచేయుచు కొంతపరిశ్రమతో, కవుల గ్రంథములు చక్కగా చదివి, విషయములు, బాగుగా గ్రహించి, చక్కగా దిద్ది తీర్చినాడు నాపని అతని రచనముల లోని భాషాదోషములను పరిష్కరించుట మాత్రమే. ఈ

పరికారము, అతని సాయము లేకున్న, ఈ వృద్ధాప్యములో నేనీ పనిచేసి యుండెడివాడను కాను.

విఘ్నేశ్వరుని పెండ్లికి వేయి విఘ్నము లన్నట్లు, ఈ తృతీయ సంపుటి ముగించుటకు కొన్ని అడ్డంకులు మాకు కల్గినవి.

1) ఈ సంపుటిని రెండు ప్రెస్సులవారు ముద్రించిరి. అకస్మాత్తుగా, ప్రెస్సులవారికి, మధ్యలో మీరరాని, అర్జెంటు అచ్చుపనులు రావడము ప్రెస్సులలో సిబ్బంది స్ట్రైకు. మొ॥అనివార్యమైన తొందరలు గల్గినవి. ఎట్లో ఈ నాటికి 'భారత్ ప్రెస్సువారు మాపుస్తకములను, సుందరముగా ముద్రించి ఇచ్చిరి. వారికి మా జోహారు లర్పించు చున్నాము.

2) నా జ్యేష్ఠకుమారుడు చి॥ కె శేషగిరిరావు ఆదోనిలో 26—5—1981 దివంగతుడాయెను. వయస్సు 55. రెండు సంవత్సరముల నుండి, దీర్ఘ ఖాయిలా అనుభవించెను. బళ్ళారి, బెంగళూరు, రాయవేలూరు ఆస్పత్రులలో చికిత్స పొందెను. సుమారు 30 వేల రూప్యములు ఖర్చాయెను, గుణము కాలేదు. ఈ పుత్ర దుఃఖముతో, నాకు మనశ్శాంతి లేకపోయెను. అతనికి భార్యయు, ఐదు మంది పుత్రులు, ఒక పెండ్లియైన కుమార్తెయు గలరు. వారిని శ్రీ పరమేశ్వరుడు రక్షించుగాత !

నా జ్యేష్ఠ పుత్రుని జ్ఞాపకార్థముగా, ఈ తృతీయ సంపుటిని అతని కంకిత మొనర్చినాను.

## క డ ప టి మా ట లు

గ్రంథమాల జననము 1931. ఈ 1981 వ సంవత్సరమునకు 50 ఏండ్లు నిండినవి. స్వర్ణోత్సవము చేయ నాలోచించినాము. ఈ 1981 దుర్మతి నామ సంవత్సరము, దేశములో దుర్మతితో వీర విహారము చేయు చున్నది. ఉత్తర దేశములో, అతివృష్టితో నదులు విజృంభించి, పరిసరముల

మన్న పల్లెలను ముంచెత్తు చున్నవి. దక్షిణదేశములో, అందులో రాయల సీమలో, అనావృష్టి తాండవమాడు చున్నది. త్రాగుటకు కూడా నీరు దొర కుటలేదు. పశువులకు గడ్డిలేదు. ప్రజల కన్నము లేదు. ఎందరో రైతులు వలస పోవుచున్నారు. పశువులు కటిక వారి కమ్ముచున్నారు.

"క్షామము లెన్నివచ్చిన, రసజ్ఞతయించుక చావలేదు. మాసీమలో" అని యొక కవి అన్నాడు.

ఈ స్థితిలో, మేము ప్రజలను దర్శించుటెట్లు? విరాళము లడుగు టెట్లు? అని జంకు చున్నాము. రాయలసీమలోని, కాలేజి ప్రిన్సిపాలురకు, అన్ని హైస్కూళ్ళ హెడ్డు మాష్టరులకు మా వినతి పత్ర మేమనగా మహా శయులారా! మేము తలపెట్టిన, స్వర్ణోత్సవము సాంగోపాంగముగా జరు గుటకు, మీరుదారమనస్సు గలిగి, మా గ్రంథమాల, ప్రచురణములను, మీ స్కూళ్ళ లైబ్రరీలకు ధారాళముగాకొని ద్రవ్య సహాయము చేయండి. స్వర్ణోత్సవ సంచిక ముద్రణమునకు, స్వర్ణోత్సవ సభలు జరుగుట కీరీతిగా మీరు సహాయ మొనర్పవలయునని మా వేడికోలు. దాతలు, సాహితీ మిత్రులు, సారస్వతాభిమానులు తమకు తోచిన విరాళములు పంప ప్రార్థన. స్వర్ణోత్సవ సంచికలో, ప్రకటించుటకు, వ్యాపారస్థులు తమ ప్రకటన లొసంగి సహకరింప వేడికోలు.

దాతలై, పోషకులై, తమ విరాళముల నింకను చెల్లించనివారు, ఈ పుస్తకము వారికందిన వెంటనే, తమ బాకీమొత్తముల M.O. చేయ ప్రార్థన.

ఈ సంవత్సరము మా గ్రంథమాలకు మహారాజ, రాజపోషకులై ఈ రాయలసీమ రచయితల చరిత్ర 3వ సంపుటిని వెలువరించుటకు రూ॥ 1116/- విరాళములు సమర్పించిన ఈ క్రిందివారికి మా హృదయపూర్వ కాభివందనములు, సమర్పించి వారిని, వారి కుటుంబ సభ్యులను శ్రీ సర్వే శ్వరు డాయురారోగ్య భాగ్యములతో సదా సంరక్షించు గాత అని కోరు చున్నాము.

1) కడప, మల్లెమాల శ్రీ వేణుగోపాలరెడ్డిగారు. డాక్టరు సారస్వతాభిమానులు. వీరు కీ॥ శే॥ తమ తండ్రి శ్రీ మల్లెమాల రామస్వామిరెడ్డిగారి జ్ఞాపకార్థము రూ॥ 1116/– చెల్లించిరి.

2) అనంతపురం ఎక్సైజ్ డిపార్టుమెంటు యం. రామిరెడ్డిగారు. మఱి కొందఱు రూ॥ 116/– చెల్లించి సహాయపడినారు. వారి చిత్రపటము లిందు ప్రచురించినాము.

4వ సంపుటి త్వరలో విడుదలగుటకు శ్రీ పరమేశ్వరుడు మాకు తోడ్పడు గాక !

గీ॥ తనిపిరే ? వేల్పు లుదధి రత్నముల చేత
వెఱచిరే ? ఘోర కాకోల విషము చేత
విడిచిరే ? యత్న మమృతంబు–వొడము దనుక
నిశ్చితార్థంబు వదలరు–నిపుణమతులు.

ఇట్లు విన్నవించు
సుధీజన విధేయుడు, కవిభూషణ-కవితిలక
శ్రీ కల్లూరు అహోబలరావు
రచయిత – సంపాదకుడు

హిందూపురం
1–8–1981



## అంకితము



### కీ॥ శే॥ కల్లూరు శేషగిరిరావు

జననము 9_7_1926 నిర్యాణము 26_5_1981

సీ॥ తల్లిదండ్రుల యందు దయగలవాడు, సోదరుల మన్నించెడు
కరుణగలడు, బంధు వర్గముపైన, పరమ విశ్వాసంబు, సోదరీ
మణులపై యాదరంబు, తనదు, యుద్యోగ, పెత్తనముజూపక
క్రింది వారల మన్నించువాడు, సుగుణు, డార్యుండు బాధ్యత
కార్యముల్, పైవారు మెచ్చంగ సలిపెడు మేటి సుగుణి

గీ॥ "శేషగిరి" జ్యేష్ఠ కొమరుండు శ్రీనివాసు
పాద కమలాల మకరంద పానరక్తు
డగుచు, వైకుంఠమును జేరె, నతనియాత్మ
కంకితమొనర్తు_నీకృతి నధిక ప్రేమ _కె అహోబలరావు



శ్రీ కల్లూరు అహోబలరావుగారు గ్రంథకర్త

శ్రీమతి సీతమ్మ గ్రంథకర్తగారి ధర్మపత్ని

# వి ష య సూ చి క.

అభినవోదయ కవిమిత్ర-కవిభూషణ-కవికోకిల-కవితా విశారద-శతావధాని

# బ్రహ్మశ్రీ ఉప్పల వేంకటశాస్త్రి

తల్లి - శ్రీమతి ఈశ్వరాంబ తండ్రి - సింహాద్రి నృసింహకవి

జన్మస్థలము - ముడివేముల, మార్కాపురం తా కర్నూలు జిల్లా

కులము, మతము - హిందూ-బ్రాహ్మణ-భారద్వాజస గోత్రులు

విద్వత్కవిచంద్రుల వంశమున జన్మించిన శ్రీ ఉప్పల వేంకట శాస్త్రిగారు శ్రీ బాలాత్రిపురసుందరీ, త్రిపురాంతకేశ్వరుల కరుణా కటాక్షములతో సద్గ్రంథ ముల రచించిరి వీరి తండ్రిగారు శ్రీ సింహాద్రి నృసింహ కవీశ్వరులు, శివపూజా ఘనదీక్షా తత్పరులు, పితామహులైన శ్రీ కోటయ్యకవి 'శ్రీ పార్వతీ శంకర పరిణయ' కావ్యమును, వీరి పూర్వీకులైన వేంకటేంద్రకవి, శేషకవి, 'సత్యభామా విజయం' 'ధ్రువోపాఖ్యానము'లను రచించిన మహనీయులు. కవిగారి పెద్ద తండ్రి నన్నయ సమస్త శాస్త్రములను నేర్చినవాడు. వీరి పెద్దన్న పూర్ణయ్య శాస్త్రి తమ్మునకు చిన్నప్పుడే వసుచరిత్రాది గ్రంధములను పాఠములుగా బోధించినారు. శ్రీ ఉప్పల పిచ్చయ్య, శ్రీ చెళ్ళపిళ్ళ వెంకటశాస్త్రిగార్లు, వీరికి విద్యాగురువులైరి.

వీరి శ్రీకృష్ణగీత-ఖండ భారతము-ఉత్తర కావ్యములు, మహాభారత కథకు సంబంధించినవి. శ్రీకృష్ణగీత భగవద్గీతకు తెనుగు పద్యసేత. మూలానుసరణము విషయమున కవి యంతగా నియమము పెట్టుకొనకున్నను, విరుద్ధార్థములు లేవు. అని శ్రీ చెళ్ళపిళ్ళవారు దీనిపై అభిప్రాయము వ్యక్తము చేసిరి. అందుకే కవిగారు

'అందరు దీనిమెచ్చి, సుమ హారము లిచ్చెదరన్న వాన్కి, నా
డెందమునన్ దలంచుచు, గడింద రచించిన వాడగాను, గో
విందుని నమ్మి వ్రాసితి, నవీనుడ

అని కృష్ణ గీతలో తమ మాటలుగా చెప్పుకొన్నారు. ఇదియే వారి తొలి రచనగా తోచుచున్నది భగవద్గీతలోని ఆత్మ సంయమ యోగము లోని ఒక శ్లోకము నకు వీరి తెనుగు అనువాద మిట్లున్నది,

గీ॥ వినుము నిశ్చల చిత్తుడై వెలసియున్న
యోగి ఆత్మను, సంధాన భోగ మహిమ
దెలియగా గోరి, గాడుపు మెలగ నట్టి
కడల నుండిన, దీపము కరణి నుండు.

మహాభారతములోని ఒక ఘట్టమే 'ఖండభారతము'. కురుక్షేత్ర యుద్ధములో భీష్మాచార్యులవారి యుద్ధ విజృంభణకు పాండవులతోబాటు మాధవుడు కూడా అలసి నాడు. ఇక ఓర్వలేని మాధవుడు,

కూల్చెద, నిన్నుయోధనుని, గూల్చెద, గూల్చెద వానితమ్ములన్
గూల్చెద, సౌబలు న్నిదప, గూల్చెద కర్ణుని, మాటలేటికిన్

అంటూ కనులెఱ్ఱజేసి, సుదర్శనముతో అరదము డిగ్గినాడు అప్పుడు కురు పితామహు డీరీతి మాధవుని ప్రార్థించినాడు

రారమ్మబ్జభవాండ భూతనిచయారాధ్యా! రమానాయకా!
రారమ్మాగమవేద్య భక్తసులభా! రాజీవ పత్రాక్ష! రా
రారమ్మచ్యుత! చక్రధారికి శరీరంబిచ్చెద న్నిన్ను నే
జేరన్వచ్చెద పూర్వపుణ్య ఫల సంసిద్ధిన్ బ్రహ్మర్షించెదన్

ఈ ఖండ భారతమందు ఎక్కువగా నాటకీయత కన్పించును. ఇదొక పద్ధతి శ్రీ వెళ్ళపిళ్ళవారి శిష్యుడగుటచే కవిగారి కవితాధార అనర్గళముగా సాగినదని వేరుగా చెప్పపనిలేదు అందుకే కవిగారి బావగారైన శ్రీ మేడవరం రామబ్రహ్మ శాస్త్రిగారు " మా వెంకన్న నన్ను చిన్నప్పటినుండీ 'బావా' అని భక్తితో, బాంధవంతో పిలిచి, తలచిన తలంపు మొలచిన కైత తెల్పక మానడు. వాని వాగ్వైభవమో, నా మైమఱపోగాని, వినినప్పుడెల్ల వాని కావ్యముల తప్పుదారాడ దారిలెదో వున్నను మారాడ నోరులేదో అన్నట్లు, మిన్నక విన్నవేకాని ఇది తప్పన్న దెన్నడును లేదు . . . . తన కృతిలో ప్రతిచోట జీవితమైన రసానికి, తదనుగుణమైన భావానికి వాని కనువు పెట్టకయే మొలతెంచి నట్లు విలసిల్లె అలంకారాదులకు అడ్డుగాక, చంధోనియమముల కడ్డంకిలెక, వెందడి పదంబుల దంచడె గాక ఒకానొక అపూర్వ మధుధారాపూర్వము కలావిదుల కర్ణపూరంబగుట, గణనీయము." అంటూ కవిగారి కవిత్వధారాశక్తిని బాహాటముగా చాటిరి.

భారతాంతర్గత కధావస్తువుగల రెండవ కావ్యము 'ఉత్తర' ఇందు ఉత్తర పాత్రపోషణ అత్యద్భుతముగా స్త్రీలక్షణములకు దర్పణము పట్టి నట్లున్నది. ఒక్కొక్క సంఘటనము నందామె పలికిన పలుకులెంతో సత్యములుగా తోచును. ఆమె మనోభావములే వేరు అభిమన్యుని మరణమునకు కారకులై తనకు కడుపు విచ్చు

తెచ్చిపెట్టిన వీరులందరినీ యామె దుయ్యబట్టినది. తుదకు ద్రోణుని కూడ వదల లేదామె. ఆడుదాని కడుపుమంట ముందాత డెంత? ఆ విధాత ఎంత? దుర్బుద్ధితో అధర్మములకు పాల్పడిన వారినందరిని నిర్భయముగా దిట్టినది.

శా॥ ఆ వేళన్ వనసీమ సాధ్వియగు మా యత్తయ్యఁ బాంచాలిఁ గొం
పోవంగా నినుముట్టి పట్టుకొని నొప్పుల్ బుట్టగా దన్ని, దు
ర్భావా! చంపక వీడు పాండవుల నేరంబింతకుఁ దెచ్చె, రా
డా విర్పచ్చుఁడు? రేపు నిన్ను దునుమాడఁ దిక్కు మ్రొక్కున్నదే

ఆమె సైంధవునిగూర్చి పై మాటలన్నది. అందులో సత్యము లేకపోలేదు తన మామ అర్జునుడు లేని సమయము పొంచి, ద్రోణాచార్యుడు పద్మవ్యూహము పన్ని తన భర్త మరణమునకు హేతువైనందు కామె మిగుల వగచి.

". . విప్రోత్తముడంచు నీ కిడడు వాడే చిల్లిగవ్వేనియున్
భావంబో ఘటజన్మ! మార్చికొని చాపంబున్ విసర్జింపుమా"
అంటూ అతన్ని నిందిస్తుంది.

చక్కటి శైలితో, సహజ సుందరమైన భావములతో, చక్కని తెనుగు నుడికారములతో, స్త్రీల చిత్త ప్రవృత్తిని వ్యక్త పరచినారు కవిగారు 'ఇట్టి రసవత్తర పద్యకావ్యములను పాఠశాల, కళాశాల విద్యార్థులకు పాఠ్య గ్రంధములుగా వుంచ దగినవి' అని శ్రీ దివాకర్లవారు తమ అభిప్రాయమును తెలిపిరి.

తిదుపరి వీరి కావ్యములలో ఎన్నదగినది శ్రీ జయదేవ చరిత్రము ఇది గీత గోవింద కర్త జయదేవ మహాకవి చరిత్ర. కలలో ఒకసారి కృష్ణుడు జయదేవునకు కన్పించినాడు కన్నులు తెరిచిచూడ అతని జాడలేదు వెఱ్ఱిగా నాలుగు మూలల వెదకి వెదకిట్లు వాపోయినాడు.

సీ॥ కంబమా! కానవా? కాళియఫణి ఫణి
నాట్య రంగస్థల నటవతంసు
కుడ్యమా! చూపవా! గోగోప గోపికా
పాలకుడైన కుచేల వరదు
వేదికా! కంటివా! విమలేంద్ర నీల మ
ణిచ్ఛాయఁ దేరెడు నిర్మలాంగు
ద్వారమా! తిలకింపవా! వేణుగాన క
లా విశారదుని విలాసమూర్తి
గీ॥ యరయవా! దర్పణంబ! లీలావతార
ధారి మురవైరి కలుషవిదారి శౌరి
చిత్తరువు బొమ్మ నీవు వీక్షింపలేవె?
లోకనాయకు మా యశోదా కుమారు

పై పద్యమున కొంత ప్రాచీన కావ్యరీతి ద్యోతకమగుచున్నది జయదేవుని కథకు మాత్రమే యిందు ప్రాధాన్యత కలదు. అతని అష్టపదుల విషయమంతగా పట్టించు కొనలేదు ఎందులకో?

'వైదర్భి' వీరి మరొక కావ్యము దమయంతీ స్వయంవర, కల్యాణ ఘట్టములిందు ప్రధానములు. కలిపీడా దూరుడగుటకు మాత్రమే కవి దీనిని వ్రాసిరి ఇందు కూడా నాటకీయత పూర్తిగా సంతరించు కొన్నది నలదమయంతుల మధ్య జరిగిన సంభాషణ యిట్లున్నది

దమయంతి - కుక్కుట రూపధారియయి కొక్కొరోకో యని విట్టుగూసి, ము
న్నక్కట తిక్కబాపని వియద్ధుని కంపి, యహల్య తోడఁ, దా
మక్కువ గూడి కాపురము మాపిన దుర్విటు డింద్రు డిప్డు తా
నిక్కడికేల వచ్చె, దనయింతి యభాగ్యపు మాచకమ్మయే?

నలుడు -తరుణి నాతో వితండవాదమ్ము మాని
వజ్రపాణిని గాని పావకుని గాని
కాలునిన్‌గాని వరుణునింగాని పెండ్లి
యాడి దేవాంగనామణి వగుము నీవు

ప్రతి సంఘటనలోని పాత్రలన్నింటి చేతను కవిగారిట్లే సంభాషణలు పలికించిరి వర్ణనలు కానరావు.

కవిగారి 'హరిహరానందలహరి'కి సంస్కృతభాష యందలి హరిహరస్తవము ఆధారము ఇది సంస్కృతభాష యందుండుటవలన సామాన్యుల కిందుబాటులో నుండునట్లు తెనుగు సేసిరి. ఈపనిని సాహిత్య శిరోమణి శ్రీ రామకోటి శాస్త్రిగారు చేయించి, ఆకావ్యకవ్యకు కృతిభర్తలైరి శాస్త్రిగారి గ్రంథములన్నియు వివిధ కృతి పతులకు అంకితము చేయబడుట కొక ప్రధాన కారణమున్నది

అవని తలమున గావ్యమున్నంత వరకు
కావ్యకర్తయు భర్త నాకమున దివ్య
భోగముల పొందుచున్ సురపూజ్యు లగుదు
రనుచు దొల్లిట వచియించి రాది మునులు

గాన తనతోబాటు కావ్య భర్తలైన శ్రీ ఎద్దీరప్ప దంపతులు (ఉత్తర) వోల హర్వి హనుమంతరెడ్డి (విదర్భ) శ్రీ గద్వాల మహారాణి శ్రీ మదాది లక్ష్మాంబాదేవి (ఖండభారతము) శ్రీ కాశింశెట్టి రాధాకృష్ణయ్య (జయదేవ చరిత్రము) శ్రీ పాలవర్తి వేంకట నరసింహరావు (శ్రీకృష్ణగీత) లను ధన్యులగావించి, తాము సురపూజ్యులైరి

శ్రీ శాస్త్రిగారి చెంచులక్ష్మి నాటకము లభించవేదు అందు కోయజాతులవారి సంభాషణలు కడు రమ్యముగా వ్రాసిరి. పుష్ప విలాసమును గూర్చి ఒక కవి కొన్ని పద్యములు వ్రాయగా వీరు 'పుష్పాశయము' అను శీర్షికతో పూల ఔన్నత్యమును చాటిరి ఈ కవి సర్వస్వతంత్రుడు తనకిష్టములేని కావ్యమును, పాఠకుడు జదువ

సవసంము లేదంతియే కాని దానిని దూషించు అధికారము అతనికి లేదందురు. 'భారతములో దోషములున్నవని ప్రబుద్ధులు పల్కుచున్నారు. అయినను పండితులు ఔచిత్యము సంపాదింప జేయుచున్నారుగాని దూషింపరు'. ఇది శాస్త్రిగారి భావన. ఇది సమంజసమే మార్కాపురం తాలూకా కవులలో వీరు అగ్రశేణులై రాయల సీమకు వెన్నెయు వాసియు తెచ్చిరి. ఈ కవిగారు 1978లో స్వర్గస్థులైరి.

వాగ్గేయకారుడు

## శ్రీ వంకాయలపాటి సుబ్రహ్మణ్య కవి

జననము :- 1738

తల్లి - శ్రీమతి ఆదెమ్మ                    తండ్రి - శ్రీ వీరయ్య

జన్మస్థలము - కార్వేటినగరం-చిత్తూరు జిల్లా

మతము, కులము - హిందూ, బ్రాహ్మణ, అర్వేల నియోగులు

క్రీ. శ. 19వ శతాబ్దమున రాయలసీమయందలి కడప జిల్లా, ఒడుగుంట పల్లెలో శ్రీ వంకాయలపాటి సుబ్రహ్మణ్యకవి వాగ్గేయకారుడుగా వెలసిరి వీరు యాదవేంద్రోపాసకులు. వీరి పూర్వీకులు చిత్తూరు జిల్లాకు చెందిన కార్వేటి నగరమువారు కార్వేటినగరము నందు న్నప్పుడే కవిగారు శ్రీ యలమంతి పిచ్చాచార్యుల వారివద్ద సంస్కృతాంధ్రముల నభ్యసించి, శ్రీ యాదవేంద్రోపాసన, మహామంత్రము నుపదేశము పొందిరి అప్పటినుండి సుబ్రహ్మణ్యకవి శ్రీ యాదవేంద్రుని (శ్రీ వేణుగోపాలస్వామి) తమ ఉపాస్య దైవముగా ఎంచుకొనిరి

ఈ కవిగారికి కడప జిల్లా, బుడుగుంట పల్లెలోని రాచపూటివారి ఆడుబిడ్డయగు సుబ్బమ్మను వివాహ మాడిరి అప్పటినుండి వారు మామగారి గ్రామమగు బుడుగుంట పల్లెనే స్థిర నివాసముగా ఏర్పరుచుకొనిరి అపల్లెలో వారి యింటిముందే శ్రీ యాదవేంద్రులస్వామి మందిరము నిర్మించిరి. ఆ స్వామికి కవిగారె రథోత్సవాదులను నడిపిరి

ఈ కవిగారికి మైనంపాటి వంశీయులతో సంబంధ బాంధ్యవములు కలవు తన సోదరిని మైనంపాటి కేశవయ్యకిచ్చి పెండ్లి చేసెను. కేశవయ్య ఉద్యోగ విరమణానంతరం బుడుగుంటపల్లె చేరడంతో యిరువురు యాదవేంద్రుల సేవించిరి. మైనంపాటి వంశీకులు సంగీత, సాహిత్య, నాట్యాభినయములలో అభినివేశము కలవారు. దానితో ఇరువురి బాంధవ్యము స్వామిసేవకు మూడుపూవులు, ఆరుకాయలైనవి.

శ్రీ యాదవేంద్రునిపై సుబ్రహ్మణ్య కవిగారు అనేక కీర్తనలు రచించి గానము చేసిరి. కీర్తనలందు బుడుగుంట పల్లెకు వరయదుపురమని పేరుపెట్టి 'వర, యదుపురమున వెలయు కృష్ణా'' అని స్వామిని కీర్తించిరి వారి యాదవేంద్రుని కీర్తన లిట్లున్నవి.

కీర్తన నాదనామ క్రియ రాగం—ఆదితాళం

ప॥ అప్పా। నాదు తప్పు లొప్పుకొనుమా కృ
ష్ణప్పా। నీవాడ నన్నేలు కొనుమా ॥ అ ॥

అ. ప॥ ఉపవాస వ్రతములు సలుపలేను, ఒక్క
దీపారాధనమైన జేయలేను ॥ అ

చ॥ స్నాన సంధ్యా నియతి జరుపలేను, వి
జ్ఞానుల గనుగొని మ్రొక్కలేను
దాసుల గనుగొని వేడలేను, శ్రీని
వాసా। నీ సన్నిధికి నే జేరలేను ।అ
జన్మము లెత్తియెత్తి విసికినాను ఈ
జన్మముతో సరిచేయవలెను
వర, యదుపురమున వెలయు కృష్ణా। నే
మరువ నెప్పుడు నీ నామ భజన అ॥

వీరు కీర్తనలే కాకుండా కన్నడ బాషనుండి శ్రీ కనకదాసు చరిత్రమును

తెనుగు లోనికి అనువదించిరి వీరు కార్వేటినగరము నందున్నప్పుడే మధ్వ మతస్థులైన శ్రీ పోలూరు కృష్ణమాచార్యులవారికడ కన్నడ భాషయందు పాండిత్యము సంపాదించి, వారి ప్రోత్సాహముతో శ్రీ కనకదాసు చరిత్రము ననువదించెను.

ఈ కనకదాస చరిత్రమునుండి మచ్చునకీ పద్యము చూడుడు

ఉ॥ శ్రీకర సారస ప్రముఖ శీల నతార్చితజాల, సంవిదా
నేక భవాంధకారి పరి నిర్మల సంచిత యోగలబ్ధి, ప్రా
భాకర దీప్తి, యోగి జన భాసుర హృత్సరసీరుహా సమా
లోకనమై దనర్చు, కమలోదరు పాదము లాశ్రయించెదన్

అంతఃపుర కాంతల వనవిహార వర్ణన నిట్లు గావించిరి

కం అంగజ శరహిత, శుభకర
మంగళ, రంగత్ప్రసూన మహితోజ్జ్వలమై
సంగీత మత్త మధుకర
శృంగారి వనాంతర ప్రశస్త యుతంబై

అంతటి చక్కని రచన గల ఈ గ్రంథము అసంపూర్ణము గానే ఆగిపోయినది. తరువాత వీరు 'లక్షణా పరిణయము' అను నాటకమును రచించిరి జీవితాంతము యాదవేంద్రుని కీర్తనలతో గొలుచుచు తుదకు ఆ స్వామిని,

'కమలనయన బ్రోవరా — కరిరాజవరద'
'వర యాదవ పురవాస! కృష్ణ నిను
కరమరుదుగా నా కన్నుల గాంచెద,
కోరి కొలుతు నాదు కోర్కెలు దీర్పగ
సారసాక్ష! నీ సన్నిధి జేరితి ॥కమల॥

అంటూ స్వామి సన్నిధి చేరుకొన్న పుణ్యపురుషులు ఉన్న పాండిత్యములో ఉడుతాభక్తిగా యాదవేంద్రునిపై కీర్తనలు వ్రాసి, జీవితమును ధన్యము చేసికొన్న మహనీయుడు శ్రీ వంకాయలపాటి సుబ్రహ్మణ్యకవి



# లేపాక్షి కవులు

తెనుగు సాహిత్యమునందు యక్షగానములకొక విశిష్ట స్థానము కలదు ఇయ్యది పండిత పామర మనోరంజకమగు దృశ్య ప్రదర్శనము. కవులు సహితము 'కావ్యేషు నాటకం రమ్యం' అని తలచి ప్రదర్శనా యోగ్యమగు యక్షగానములను వ్రాసిరి. ఉత్తర రామాయణకర్త కంకంటి పాపరాజు సహితము 'విష్ణుమాయా విలాస' మను యక్షగానమును, వ్రాసినట్లు తెలియుచున్నది.

యక్షగానములన్నియూ 18వ శతాబ్దమందే పుట్టినవి వీటిని గ్రామ గ్రామములందును వినోదార్థమై ప్రజలు మూడు, నాలుగు రాత్రులు ప్రదర్శించెడి వారు బ్రహ్మోత్సవ సమయములందు వీటిని ప్రదర్శించుటకై వారికి భూములను ఇనాములుగా రాజులొసంగినారు

రాయలసీమయందలి యక్షగానములలో,చుక్కలూరు రామాయణము, మోక్షగుండ రామాయణము, లేపాక్షి రామాయణములు ప్రసిద్ధి కెక్కినవి. లెపాక్షి శిల్ప కళా ఖండముల కేగాక, యక్షగాన కవులకు నిలయమై, తత్కళా వ్యాప్తికి కేంద్రమై వెలిగినది. ఈ కుగ్రామమున శ్రీ లేపాక్షి వెంకటరాయ కవి-లేపాక్షి రామచంద్రప్ప-లేపాక్షి వేంకట నారాయణప్ప-లేపాక్షి వారి శ్రీనివాస కవులు యక్షగాన కవులుగా పేరు బడసినారు.

# శ్రీ లేపాక్షి వేంకటరాయ కవి

శ్రీ కవిగారు లేపాక్షి రామాయణమునేగాక, లేపాక్షి కృష్ణ నాటకము జలక్రీడలు, శివనాటకము, నాట్య ప్రదీపనము, అను ఇతర కృతులను కూడా రచించిరి తమ లేపాక్షి కృష్ణ నాటకమందు కవిగారిట్లు వ్రాసుకొన్నారు.

ద్విపద- వగగుల్కు లేపాక్షి-వాసుఁడై వెలయు
నగ ధరుండగు కృష్ణ—నాటక పూర్వ
భాగంబు ధరణిపై-ప్రబలి యలరగ
రాగుఁడై హరిదయా-రాశిచే వెలసి
కొమరొప్ప శిర్నాట-కులవార్ధి కుముద
రాముఁడౌ వేంకట—రమణార్యునకును
సుతుఁడ వేంకటరాయ-సుకవి యనువాఁడ
నతి ప్రీతి పరమేశు-నాజ్ఞచే చెప్పి
నాడను, యీకృష్ణ—నాటకం బుర్వి
నాడిన, పాడిన-నతి నిష్ఠతోడ
బాడిన, వినినను—బహుళ సంపదలు
గూడి వేడుకతోడ—గుల్కుదు రెపుడు
యెందాక కులగిరు-లెందాక ధరణి
యెందాక రవిచంద్రు-లెందాక గలరు
నందాక ఈ కృతి-నలరుచు సుజన
బృందాను మోదమై-బెంపొందు చుండు.

పై పద్యమును బట్టి కవిగారి తండ్రిగారు, శ్రీ వేంకట రమణయ్య గారనియు, శిర్నాడు కులమనియు, విదితమగు చున్నది. వీరు విశ్వామిత్ర

గోత్రులు కవిగారి భార్యపేరు పుట్టమ్మ వీరి కుమారుడు నంజుండ రాయడు.

వేంకటరాయ కవిగారి వంశావళి ఇట్లున్నది

1) శ్రీ వేంకట రమణయ్య-కుమారుడు- వేంకటరాయ కవి (రామాయణ యక్షగాన కర్త)

2) వేంకటరాయకవి-కుమారుడు-నంజుండరాయడు-

3) నంజుండరాయని-కుమారుడు-వేంకటరాయప్ప- (ముద్రారాక్షస కథాన్విత సాహస రత్నాకరమును 2వేల పద్య గ్రంధకర్త)

4) వేంకటరాయప్ప-కుమారుడు—శంకరరావుగారు—(కవిగారిమునిమనుమడు)

వీరి వంశీకులు ప్రస్తుత మెక్కడున్నారో తెలియుటలేదు

లేపాక్షి రామాయణ యక్షగానమును పి వి కృష్ణ బుక్ డిపో-1997 అమ్మర్ కోవిల్ వీధి వాల్ టాక్సు రోడ్డు, మద్రాసు-1 వారచ్చు వేసినారు ప్రస్తుతము లభించుట దుర్లభము. యక్షగానమును గూర్చి కీ. శే కవిత్వవేది కల్లూరు నారాయణరావుగారు తమ వీరేశలింగయుగమున యిట్లు వ్రాసినారు

' లేపాక్షీ రామాయణము మూడురాత్రుల నాటకమున కనుకూలించు నట్లు రచితమై ఆడబడుట నేను కన్నులారా జూచియున్నాను ఆహా, అందలి రసస్ఫోరక, పాత్రోక్తి, వచన రామణీయకత, నల్వాది యేంత్లో దాటినను నాకు మఱపునకు రాకున్నవి లేపాక్షికి దగ్గర మా మాతామహుడగు నాసెప్ప గారి యూరైన శిరివరములో పిల్లలతోకలసి ఈ రామాయణము ఆడినాను. నాది రావణపాత్ర. ప్రాచీన యక్షగానములలో నుత్తమోత్తమమని, ఖండవల్లి అచార్యులంతటి విమర్శకాగ్రేశ్వరులచే సన్నుతి నందు కొన్నది .

లేపాక్షి హరి సంకీర్తన ప్రతిదరువు కొనను గల్గి ఈ యక్షగానము, పాదుకా దానము, లంకా దండయాత్ర, రావణ సంహారము, అంత్యముగాగల మూడు భాగములతో మూడు దినములకు సరిపోవునట్లు రచితమైనది.

వర్ణనము తక్కువగను, ముఖ్యకథ విశదముగను, ప్రేక్షకజనుల కర్థ మగు వచనము లెక్కువగను దరువులు శబ్దాలంకారొచిత పదజాల ప్రపూర్ణముగను వెలసినవి. వీర కరుణాద్భుత రసములు విపులముగ నున్నవి శృంగారరసము సముచితముగా నున్నది హాస్యమరుదు ప్రదర్శన యోగ్యముగ ప్రశంసనీయ కౌశలము గలదిగ నున్నది. రంగ విభజన మొకటి దరువులేమి, తగిన వృత్త కల్పనమును తర్వాతివారు యోచించి ఈ యక్ష గానమును నాటకములుగ జేసిరన్న సత్యదూరము కాదు నేను రావణ పాత్రలో చెప్పుచుండి యానందించుచుండిన దరువు యిచట పాఠకుల కందించుచున్నాను

"అహహాహా చూడవే-అతివ నా పదితలల్
బహుబలోన్నతి నొప్పు-బాహువులను
స్ఫుటకోటి నవరత్న-ఖచిత మకుటంబులన్
చటుల ధీధితులొప్పు-కటకములును
సుర, గరుడ, గంధర్వ-గరుడోర గామరుల
సరిలెరు నాకు-ఎవ్వరును ధరలొన
జలజాక్షి లేపాక్షి-నిలయు డెదిరిన విడువ
బలిమి తోడనె నిన్ను-బట్టుకొనీ పోదు"

లేపాక్షి రామాయణమునుగూర్చి కొద్ది పరిచయమున్న వారెవరిని ప్రశ్నించినా పై దరువునే యుదాహరించుట పరిపాటైనది. మరియే యితర దరువుగాని, వచనముగాని, పద్యములుగాని స్ఫురించుట లేదు ఇందు వచనములు, కందములు, అధికముగా గలవు కొన్ని గీతపద్యము లచ్చటచ్చట కలవు. ఇందలి వచన రామణీయకత, రసస్ఫోరక పాత్రోక్తి, విమర్శకాగ్రేసరులచే సన్నుతి నందు కొన్నది

వేంకటరాయకవిగారి కృష్ణ నాటకము నందు సూడ అట్టి రామణీయ కతయే మనకు గోచరించును. అందు కంస దేవకీదేవుల సంవాదమును కవి గారిట్లు వ్రాసిరి.

దర్వు—ఆధితాళం—సావేరి రాగం

దేవకి ఓరన్నా' నీకిది కోడలురా! మన్నన శాయరా,
మున్నుగన్న యాచిన్ని బాలులవలె నెన్నగ తగదో ... ॥ఓరన్న
పున్నమ చంద్రుని బోలు-నీ కన్నుల పండువు గాను జూడరో॥ఓరన్న
మచ్చరించగా వచ్చునేరా'-ఈ ముచ్చట జూచి ముద్దు వచ్చునో
॥ఓరన్నా
నాపుణ్యమునను, లేపాక్షీశుండీ-పాపను దయ దోపగాను యిచ్చెనో
॥ఓరన్నా

కంసుడు . కం॥ వినవమ్మా దేవకి' యిటు
వనితను నీజాల ననుచు-వగచెద వెంతో
మును యిచ్చినట్టి బాసలు
దనరగ విడనాడ నీకు-ధర్మమె? అమ్మా'

దేవకి అన్నా యెన్నటికైనను మున్నాడిన మాట బొంక. మొదమొదపగ నా విన్నపము వినుము దయతో కన్నియ బుట్టిన యియ్యాగా మాట లేదు. ఊరకే క్రోధమెన్నగరాదు. చిన్ని కుమారుల నిత్తుమన్న యనుచు మేమన్నమాటలు కావి, కన్యక నిటు నియ్యాగా మాటలేదు.

కంసుడు మాటికి మాటికి నీవీ మాటలు పల్కెదవు. దీన మమత కల్గునా నాటికి యిచ్చిన మాటలు, నేటికి లేదనిన, యింక నే బో విడువా' లేపాక్షీశునికైన వెరవా. బోటీ నిక జంపెదను. విను ముమ్మాటికి ఈమాట నిజంబిది, నే బోవా

(ఈ నాటకము 1910వ సం॥ జూన్ నెలలో చెన్నపట్టణ వాస్తవ్యులైన శ్రీ వంకాయల కృష్ణస్వామి శెట్టి అండ్ సన్సువారి స్వకీయ, శ్రీరంగ విలాస ముద్రాక్షర శాలయందు ముద్రింపించి ప్రచురింప బడినది. ఈ ప్రతి ప్రస్తుతము శ్రీ కృష్ణదేవరాయ గ్రంథమాల పుస్తక భాండాగారమున కలదు

ఈ యక్షగానములనే పామరులు బయలు నాటకములని వ్యవహరించిరి లేపాక్షి చుట్టుముట్టు గ్రామము లందప్పుడప్పుడు వీటిని నేడుకూడా యువకులు ప్రదర్శించు చున్నారు.

లేపాక్షికి దగ్గరగా గల కల్లూరు గ్రామమందలి కీ। శే. కాశి రామప్పగారి భార్య కీ శే శ్రీమతి నంజమ్మగారు ఈ లేపాక్షి రామాయణమును గ్రామస్థులకు అభినయాదులతో నేర్పుచుండిరి. ఆమె పేరిట నాటకమున పొగడ్తలు (హేళికే) కూడా చెప్పెడివారట. ఆమె స్వయముగా కొన్ని పాటలను కట్టినదట. ఈమె లేపాక్షి శౌంరి శ్రీనివాసకవి (చంపకధామ శతక కర్త) గారి పుత్రిక వారి తండ్రిగారు కూడా యక్షగానములను వ్రాసినవారే

ఈ బయలునాటకములందు గంఘాడి వల్లట, దివ్వెలపై రాళము వల్లట, కిరీటములను భుజకీర్తులను ధరించుట, పాత్రల ప్రవేశ మప్పుడు తప్పెటలు వాయించుట స్త్రీ వేషములు వచ్చునపుడు తెర అడ్డముపట్టి నే పథ్యమునబాడుట, ముఖవీణె వాద్యము వాయించుట, ప్రతి స్త్రీ పాత్రయు కొంతమట్టుకైన తాళానుకూలముగా భరతాభినయ పూర్వక నృత్యము చేయుట, దాని కనుగుణముగా పురుష వేషధారులు చిందులు త్రొయుట, మొదలగునవి విశేషములు.

పాత్రధారి పాడు దరువుల రాగము గగనమునకు చుంబించెడిదట. ఉదయము రంగస్థలమును గమనించినవారికి ఇనుప తాళముల తాడనకు రాలిన

ఇనుప రేకులపై చిన్నచిన్న కుప్పలుగా కనబడెడివట వారి తాళవిన్యాస మంతటిది

ఈ బయలు నాటకములు 1915 సంవత్సరమువరకు విశేష ప్రచార ములో నుండినవి తదుపరి ఈ యక్షగానములె నాటకములుగా మారినవి ఈ యక్షగానములను నేడు లేపాక్షియందలి జిల్లాపరిషత్ ఉన్నతపాఠశాల ప్రధా నోపాధ్యాయులుగా పనిచేయుచున్న శ్రీ తిప్పరాజుగారు తమ పూర్వీకులవల్ల నేర్చుకొని మరల పునరుజ్జీవము గావించుటకై తమ కుమారులకు చెప్పి స్థానిక కళాకారుల సహాకారముతో అచ్చటచ్చట ప్రవర్తించుచున్నారు



## శ్రీ లేపాక్షి వేంకటనారాయణ కవి

శ్రీ వేంకటరాయ కవిగారి వారసునైన శ్రీ వేంకట నారాయణకవి కూడ యక్షగాన కవులుగా వాసికెక్కిరి వీరు శిర్నాడు బ్రాహ్మణులు వారి తస గోత్రులు వీరి వంశావళి ఇట్లున్నది

కృష్ణప్ప-వెంకమ్మ పుణ్యదంపతులకు నలుగురు కుమారులు
1 రామచంద్రప్ప 2 వెంకట నారాయణప్ప 3 సుబ్బరాయప్ప 4 నంజుం డప్ప

1 రామచంద్రప్ప - విరు దమయంతీ పరిణయ యక్షగాన కర్తలు వీరు దైవభక్తి పరాయణులు తండ్రి నిర్మించిన ఆలయమున సీతారాముల విగ్రహములను ప్రతిష్ఠింప జేసిరి వీరు సంగీత, సాహిత్య జ్ఞానములను కలిగి కవి పండితులను, కళాకారుల నాదరించెడి మహనీయులు చదరంగ నిపుణులు చిన్నసంస్థానాధిపతుల హోదాను కలిగి, మేనాలో ప్రయాణము చేసెడి వారు మేనా ప్రయాణమునందె 'దమయంతీ స్వయంవర' మను యక్షగానమును వ్రాసిన ఘటికులు. వంశ పారంపర్యముగా వచ్చుచున్న కరణీకమును

తన తమ్ముడైన వెంకటనారాయణప్పకె వదలెను ఈ దమయంతీ స్వయం వర యక్షగానము కూడ దొరుకుట లెదు

2. శ్రీ వేంకట నారాయణ కవి - వీరిని లేపాక్షి వెంకటనారాయణప్పగారని కూడా వ్యవహారించెడివారు వీరు లేపాక్షి గ్రామ కరణీకముతోబాటు కవిత్వ మునుగూడా చేబట్టిరి వీరి బాపగారైన శ్రీ వేంకటరాయకవిగారి రామాయణ యక్షగానము ప్రసిద్ధి పొంది, బహుళ ప్రచారములోకి వచ్చుటచే, తానును 'సంపూర్ణ లేపాక్షి భారత'మను నాలుగు రాత్రుల కథను యక్షగానముగా రచించిరి. ఉత్సాహవంతులైన యువక బృందమునకు శిక్షణ నిచ్చి ప్రదర్శింప జేయుచుండిరి. ఈయన సంగీత నృత్యములందు పాండిత్యము పొంది 'తాళ లయబ్రహ్మ' అని పేరుగాంచెను లయతాళములను ప్రతి పని యందును పాటించుట అతనికి పరిపాటి వీరి లేపాక్షి భారతము (యక్ష గానము) నుండి మొదటి రాత్రి కథలో ఒక సంవాదము (మూలము తప్పు కుండ వ్రాతప్రతిమూలము ననుసరించి వ్రాయబడినది)

''కుంతి। అయ్యా యిదియేమి యింత ఆయాస పడుచూ న్నారు ఆ సంగతి వివరింపవలెను స్వామి'

బ్రాహ్మడు॥ బకునకు యాహారంబు గొన యిలు వరుస మాకు వచ్చి యున్నది అందుకు ఈ రీతిగా వగచెద మమ్మా'

కుంతి। అయ్యా నీ కుమారుడు బాలుడు. బది గొనపోవ జాలడు. నాకు యేవురు తనయులు. అందులోవకని బంచెద నయ్యా విప్రోత్తమా'

వొరీ భీమా యీ బ్రాహ్మణుని ఉపకారార్థముగా బకుని జంపిరారా ఓరీ!

భీముడు - అట్లే ఆయెనమ్మా తల్లీ''

కం॥ కడుపుకు కూడును లేకను
బడలికచే డశ్శినాను_బలహీనుండై
గడువుగ బెట్టు సమృద్ధిగ
బడవైతును బకుని యిపుడు పౌరులు మెచ్చన్

వ॥ అయ్యా అన్నములేక చాలా ఆకలి గొన్నాను స్వామీ.

బ్రాహ్మడు॥ యిగో బోజనం చాయవయ్యా_యీశకటం మీద ఆహారం తీసుకొని పోవయ్యా భీమా॥

భీముడు - కం॥ శకటము నెక్కియు భీముడు
బకుని వధించియును యిచటి పౌరులకెల్లన్
సుకరంబు చాయ నెంచియు
ప్రకట పరాక్రమము తోడ భాళిల పొవ్చెన్

॥దరువు ఆదితాళము.

వీరారసము వుప్పొంగిల్లా_ఘోరా రూపుడై భీముడూ
మీరీనా పోతూలగట్టి-గంభీరుడై-శకటామునెక్కి-
పటపాటా_పొండ్లునూ కొరికీ బకునీ యిపుడే
దున్రింతూననియా_ర్భటమూతో_దిక్తటమూ
లద్రువ-పటువేగ-ప్రారంభూడయ్యె ''వీ''
సురులూ జూచి వెరగందా నా, సురులుజూచీ
తత్తరమొందా-ధర లేపాక్షీ పురీ వరునీ
మెఱయార-రభసమునా వోరి బకా 'వీ'
నీకై తెచ్చిన యాహారంబు నేను గుడచు చున్నాను
నీవు వీరుండవైతే యుద్ధానికి రారా వోరీ

బకుని వేషము-

చం॥ పటపట పండ్లు నూరుచును-బాహువులెత్తి బకుండు రో
షడై-చెటులతర విస్ఫులింగములు-చచ్చర కన్నుల ౯వాలు
చుండగా, తటతట పాదఘాతకును ధారుణి తత్తర
మొందు చుండ, యార్భటమున భీమువింగని శబాసని
మెచ్చును ఘోరరూపుడై

''దరువు ఏకతాళము''

పట రవార్భాటము తోడనూ। బకుడు నంత చటుల రోష మొప్ప వెడలెనూ।౧
ధడధడాయటంచు నడవగా-పుడమి యపుడు గడడడా యటంచు నడుగగా
మీసమపుడు దీడు కొనుచునూ శ్రీ లేపాక్షి వాసుడదర ॥౨।

భాసురముగనూ ।౩॥ అహోహోహో యెవ్వడురా-యెవ్వడురా-నాకు తెచ్చిన బలి
తినేవాడెవ్వడురా యిగో నిన్ను మ్రింగివేసెద చూడరా

భీముడు అయితే రారా బకా.

తాం-తతధణ——।బకుడు బడుటా।

భీముడు ఓతల్లీ' బకుని వధించి కళేబరంబు వాకిట సీడ్చినాను. ౯దుపదుడు తన పు౯త్రికకు స్వయంవరంబు చాటించినాడని మన గృహస్తులు ౯బాహ్మలు పోతూవున్నారు, గనుక మనము పోదాము పదండి తధి తాథాం.

ఇట్లీ కథ నడచినది.

ఆకాలములో వున్న వాడుక భాషనే కవిగారు వాడినారు. శ్రీకృష్ణుడు ధృతరాష్ట్రుని కొలువుకూటమునకు వెళ్ళి తన విశ్వరూపమునుచూపుటలో ఈ భారతము ముగిసినది

(ఈ లేపాక్షి భారతమును ము౯దించి వెలుగులోనికి తీసుకొని రావ లసిన అవసర మెంతేని కలదు. ఈ ౯వాత౯పతి శిధిలావస్థలోనున్నది .భాషా

భిమానులు, ఐదాస్యులు ముద్రింపదలచిన ఈ గ్రంథమాల మేనేజింగ్ ఎడి టరు గారితో సంప్రదించండి ఈ వ్రాతప్రతి వీరి వంశీకులైన శ్రీ ఎన్ ఎ నారాయణరావు, ప్రిన్సిపాల్, ఓరియంటల్ కళాశాల, లేపాక్షి. వారి వద్ద ఉన్నది )

ఈ కవిగారు రుక్మిణీ పరిణయ నాటకమును మాకం తిమ్మయ్యశెట్టి యక్షగానమును కూడా రచించెను.

రామచంద్రప్ప, వేంకట నారాయణప్పగార్లకు మగసంతానము లేదు దానితో మూడవ తమ్ముని కుమారులైన రామకృష్ణప్ప, నాగభూషణప్పలను వరుసగా దత్తత చేసుకొనిరి వెంకటనారాయణప్ప కుమారుడు నాగభూషణప్పకే కిరణీకము పని వచ్చినది నాగభూషణప్ప కుమారుడే ప్రస్తుత లేపాక్షి సర్పంచ్ శ్రీ వేంకట నారాయణప్పగారు

---

## బ్రహ్మశ్రీ లేపాక్షి శొంఠి శ్రీనివాసకవి

తల్లి శ్రీమతి గౌరవాంబ — తండ్రి వెంకయ్య

బ్రాహ్మణులు, గౌతమ గోత్రులు

ఈ కవిగారు పారిజాతాపహరణము యక్షగానమును, బాలభక్తపాల శతకమును, దుర్గా స్తోత్రమును రచించినారు 1913లో శ్రీ చంపకధామ శతకము యొక్క రెండవకూర్పు మైసూరు కె నరసింహయ్యా అండ్ కంపెనీ, ముద్రాక్షరశాలయందు రాజశ్రీ బి రామకృష్ణారావు ప్రచురించి నారు ఈ ప్రతి మాకు దొరికినది ఈ శతకము మత్తేభములు, శార్దూల ములు కలసి 102 పద్యములున్నవి మచ్చునకు రెండు పద్యములు వదపండి.

సంతాపంబును జెంది, దుర్దశలచే-సర్వంబునున్ బోలి
విభ్రాంతిన్ బెక్కులు దేశముల్ తిరిగి, నన్ బాటించి
మన్నించు, భూకాంతుం డెవ్వడు లేమి, నీ సముఖ

మెక్కంగాంచి యున్నాడ, నిశ్చింతన్ జంపకధామ
రామ శుభద శ్రీనామ దేవోత్తమా॥

ఈ పద్యమువలన కవిగారు వున్న ఆస్తిని పోగొట్టుకొని దేశాటన మొనర్చెననియు, మైసూరు ప్రాంతముల కేగెననియు, అచ్చటకూడా తా నాశించిన దాతలను గనరేక నిశ్చింతతో 'అన్యథా శరణంనాస్తి, త్వమేవ శరణం మమ' అని శ్రీరామచంద్రునే నమ్మి ఈశతకము వ్రాసినట్లు అర్థ మగుచున్నది

మరియు నీ కవిగారు కాళహస్తికివెళ్ళి అచటగల 'సువర్ణముఖి' నదిలో నిత్యము స్నానమొనరించి కాళహస్తీశ్వరుని సేవించినట్లును, ఒకనాడు నది గట్టున ఈతనికి శ్రీరామచంద్రుని విగ్రహము దొరికెననియు, అప్పటినుంచి శ్రీరామమూర్తిని ధ్యానించుచు, ఈ శతకమును వ్రాసినియు వీరి పద్యముల వలన తెలియుచున్నది వీరు శ్రీశైలమునకు కూడా వెళ్ళినారు 'పతిధాన వ్రతము' అను ద్విపద కావ్యమును కూడా వీరు మొట్టమొదట వ్రాసినారు ఆప్రతి దొరుకుటలేదు

ఈ కవిగారికి ఆంధ్రమునందేకాక, సంస్కృతములోకూడా చాలినంత జ్ఞానమున్నది. ఈ పద్యము చూడండి

దురితారణ్య కుఠార మూర్తశిఖి సందోహంబు
వాహంబు దుర్భర దౌర్భాగ్య లతాలవిత్రము,
భయగ్రావాళి దంభోళి, స త్పరమార్థంబున
కాలవాలము, భవత్పాదాంబుజ ధ్యానమే
స్థిరమౌ॥ చంపకధామ రామ॥ రామశుభద శ్రీనామ దేవోత్తమా

ఈ కవిగారు చంపకధామ శతకమును 1832వ సంవత్సరమునకు

సరియైన చిత్రభాను సంవత్సరము శరదృతువులో వ్రాసి ముగించి నారు అనగా వీరు 1830వ ప్రాంత్యములో జన్మించి యుండవచ్చును



## కొండరి శ్రీనివాసమూర్తి

జననము 15-6-1914

నిర్యాణము 1979

తల్లి శ్రీమతి వెంకమాంబ

తండ్రి శ్రీ కొండరిగుండప్ప

జన్మస్థలము లెపాక్షి, హిందూపురం తా,

మతము, కులము హిందూ, బ్రాహ్మణ వెలనాడు, గౌతమస గోత్రము

బాల్యమునుండి వీరికి భారత, భాగవత రామాయణ పద్యకావ్యము లను చదువుటలో శ్రద్ధ యేర్పడెను. విద్యార్థి దశలోనే వీరు పద్య ములను వ్రాయుట కారంభించిరి

సెకండరీ గ్రేడు ఉపాధ్యాయ శిక్షణ ముగించి జిల్లాపరిషత్ ఉన్నత పాఠశాలలలో పనిచేసిరి 1964వ సంవత్సరములో వీరు పదవీ విరమణ పొందిరి ఈకవిగారు తలవని తలంపుగా శ్రీశైలము వెళ్ళుట తటస్థించినది అచ్చట ముఖ్యమైన క్షేత్రములను, తీర్థములనుజూచి శ్రీ భ్రమరాంబ, మల్లి కార్జునులను దర్శించిరి అప్పుడే 'శ్రీశైల మల్లేశ్వరా' అను మకుటముతో ఒక శతకమును వ్రాయ సంకల్పము కలుగగా కొన్నిదినములలోనే శతక మును ముగించి, భక్తుల ద్రవ్యసాయముచే అచ్చొత్తించిరి. అందులో కొన్ని మాత్రము—

శా॥ శ్రీకారంబునుజుట్టి నే దొడగితిన్ జెప్పంగ నీ పైన సు
శ్లోకంబౌ శతకంబు పద్యచయ సంశోభాయ మానంబుగా
నాకున్ భావపరంపరల్ కలుగగా నాయందు నీవుండ వో
శ్రీకంఠా! భ్రమరాంబికార్చితపదా! శ్రీశైల మల్లేశ్వరా!

శా॥ శ్రీశైలంబు సనాతనంబు, ముని సంసేవ్యంబు, నీ దివ్య సం
వేశంబై తనరారు నిందు జనులెవ్వేళన్ నినున్ గొల్వగా
కాశీక్షేత్రముతోడ సాటియగు విఖ్యాతిన్ విరాజిల్లె గౌ
రీశా! విన్నిటగాంత్రు భక్తులు సదా శ్రీశైల మల్లేశ్వరా

ఈ కవిగారి కుమారులు శ్రీ శౌంరి వెంకటాచలంగారు హిందూపురం పట్టణమందలి నేతాజీ మునిసిపల్ ఉన్నత పాఠశాలలో ప్రధానోపాధ్యాయులుగా పనిచేయుచున్నారు



# పాలపాటి సరస చిదంబర రాయ కవి

తండ్రి శ్రీ భీమన్న　　　　　　　　　　పితామహుడు శ్రీరామన్న

జననము 1860　　　　　　మరణము 1942

జన్మస్థలము పొలికి

పొలికి గ్రామము, గుంతకల్లు జంక్షనుకు 10 మైళ్ళ దూరములో వున్నది ఈకవి రాయలచెరువు, క్రిష్టపాడు, తలిమెర్ల, చేబ్రాల గ్రామములందు విశేషకాలము వాసము చేసియున్నారు.

ఈకవి అనంతపుర మండలమునకేకాక కర్నూలు, బళ్ళారి మండలము లందంతటను సంచరించినాడు గడేహోతూరు నివాసులగు శ్రీనివృత్తి వేంకటరామశాస్త్రులు గారును, వారి తమ్ములు శ్రీ లక్ష్మణ శాస్త్రులు గారును ఈ కవివర్యుని విద్యాగురువులైనట్లు తెలియుచున్నది.

ఈకవిగారు 'వాసవీ విలాసము'' అను పద్యకావ్యమును వ్రాసినారు ఇందులో తొమ్మిది ఉల్లాసములు గలవు వైశ్య కులావతంసుల కులదేవత యగు కన్యకాపరమేశ్వరీ దేవి చరిత్ర ఇయ్యది

గీ॥ తలతు సతతంబు నాదు హృన్నళినమందు
ధరణి నిర్వృత్తికుల, సముద్భవులు నైన
ఘనుఁడు వేంకటరామ సత్కవిని, మఱియు
లలిత సాహితీ గురుఁడగు లక్ష్మణార్యు

'వాసవీ విలాసము' 1896వ సంవత్సరమునందు బళ్ళారి శారదా ముద్రాక్షరశాలయందు ముద్రింప బడినది ఈ కవి అనేకములగు శతకములు దండకములు, స్తోత్రములు, చాటువులు గూడ రచించియున్నాడు. వీటిలో కొన్ని ముద్రితములు మఱికొన్ని అముద్రితములు ఏవియు గూడ ఇపుడు లభింపవు.

వీరి కృతులలో వాసవీ విలాసమే ప్రధానమైనది కీ. శే గాళ్లదిన్నె సుబ్బరాయ కవిగారి ప్రతినొండు సంపాదించి చూడవలసినదిగా శ్రీ తొగి రైటి భాస్కర శాస్త్రిగారికి (ఆదోని) ఇచ్చినట్లున్నది శాస్త్రిగారు భారతీ మాసపత్రిక విక్రమ సంవత్సర జ్యేష్ఠమాస సంచికలో వ్రాసిన విషయము లాధారముగా తెలియుచున్నవి

ఈ కవికి సంస్కృతము నందును గూడ కవితాశక్తి గలదనుటకు నచ్చటచ్చట వనగ్రంథమునందలి తాను రచించిన శ్లోకములే సాక్షి

వీరి వంశీయులుకూడ చక్కని పాండిత్యముకల్గి వాక్సుద్ధి, తపశ్శక్తి గల్గియున్నట్లు తన వంశావళి వర్ణమున వర్ణించి యున్నాడు.

వీరి వంశీకులైన వేంకటపతిరాయలు పెద్ద చింతామణప్పలను గూర్చి ఈ క్రింది పద్యములద్వారా తెలియుచున్నది.

సీ తిట్టు పద్యముఁ జెప్పి-తెరలించె. రిపుగడే
 హోత్తూరు ముట్టడై-యున్నవేళ
విత్తన చేలెండ-విడపన కల్పురిం
 బర్జన్య శతకముఁబలుగఁజెప్పి
కురిపించెను, సువృష్టి, గుత్తిలో జేరిన
 యురగాద్రి పరగణ-వుంచి వేలు
ముద్దు మల్లపదొర-ముఖ్యపట్టపు, కవీ
 శ్వరుఁడన ధీర ప్రశస్తిగాంచె

గీ. పడపెఁ గొనకొండ్ల మొదలగు-పత్తనముల
 మాన్యములు పెక్కులితడు-సామాన్యుఁడవునే!
 ధీవిజిత, గీష్పతి నితాంత ధృతి గిరిపతి
 పాలపాటి వెంకటపతి భళి! పమమతి

సీ. తన మహా వైద్యశాస్త్ర, ప్రౌఢిమకు, నభి
 వ్యంజకంబుగ, మణి వలయమొప్ప
తన యష్టభాషా పద గ్రంథి కవితకు
 డాకాల, గండపెండారమొప్పఁ
తన గురుత్వమునకుఁ దగగఁ బండేయ దొర
 బంపిన పల్లకి పశ్రిభ దనర్ప
తన సువిద్యా విధిత్వమునకు నానాటి
 శిష్య ప్రశిష్యులు-చేరి యొప్ప

గీ. ధరణి శ్రీ గడేహోత్తూరు ధామమందు

సకల పండిత మండలి-సన్నుతింప
యాచకాళి చింతామణి-యనగ బరగి
పెద్ద చింతామణప్ప- దా( బెంపు(జెందె

"శ్రీ యలమేలుమంగ" అను గ్రంథాది పద్యమును బట్టి ఈ కవి కిష్ట దైవము శ్రీ తిరుపతి వేంకటేశ్వరులని తెలియుచున్నది మఱియు

కం. అసహాయ సరస కవితా
రసికు(డ వేంకట ధరాధర ప్రభు కరుణా
రస పరిపోషిత మృదువా
క్ప్రసవ మరందాప్త సకల కవి బంభరుడ౯

అను పద్యమువలనగూడా దెలియుచున్నది ఆశ్వాసాంత్య గద్యమునందు "సప్త కవిమిత్ర" అను విశేషణమును దన కన్వయించుకొన్నవాడు. దాని యభిప్రాయమేమో తెలియకున్నది.

(భారతి విక్రమ సంవత్సర జ్యేష్ఠమాస సంచికనుండి)

ఇట్టి కవుల చరిత్రలన్నియూ అజ్ఞాతముగా నిలిచిపోయినవి వారి విషయము లింత మాత్రమైనను మనకు లభించుట మన పుణ్య విశేషమే రాయలసీమ కవులను గూర్చిన విపులమైన పరిశోధన గావించు ఉద్దేశ్యము మన విశ్వవిద్యాలయము లెప్పుడు చేబట్ట గలవో వేచిచూతము



# కొందరు నాటక కర్తలు

19వ శతాబ్దపు చివరిభాగము (1875) నుండి కొంతమంది కవులు కావ్యములతోబాటు నాటకములను, ప్రహసనములను వ్రాసిరి. వీటికి యక్ష గానములే నాంది పల్కినవి. అవి కొంత సంస్కారముచెంది రంగస్థల నాటకములుగామారినవి రచనా విధానముననేకాక ప్రదర్శనలలోగూడ అనేక మార్పులు తేబడినవి. తోంతథయుణ, తై తయుణ'లు పోయి సొంపైన నృత్యములు, ఇంపైన పాటలు, గంభీరములైన మాటలు, హృదయమున ముద్రవేయు సన్నివేశములు చొప్పించబడినవి.

బయలు నాటకములు పరదాల నాటకములుగమారి మూడురాత్రుల కధ మూడుగంటలలో ముగించిరి వేషధారణలు మార్చిరి వట్టి దెంతుయి కాక అభినయమును చూపిరి తప్పెటలు, కొమ్ములు, తాళములు పోయి నేపథ్య వాద్యములగు తబల, హార్మనీ, ఫిడేలు చోటుచేసుకొన్నవి. రాను రాను ఈ దృశ్య కావ్యకధలలోగూడ అనేక వైవిధ్యములగు విషయములను కవులు చర్చించిరి.

ఇంతకుముందు రాయలసీమకు చెందినట్టి బళ్ళారి ప్రాంతము నాటక కళకు నిలయమైనది. క్రీ॥ శ॥ 1880 ప్రాంతమున అక్కడి పండితులు కన్నడ భాషయే నాటకములకు యోగ్యమైనదను దృఢ విశ్వాసముతో నుం డిరి మన 'ఆంధ్ర నాటక పితామహులు' శ్రీ ధర్మవరం రామకృష్ణమా చార్యులవారు 'చిత్రనళీయ' మను తొలి తెలుగు స్వతంత్ర ప్రతిభావం త నాటకమును రచించి 1886లో ప్రదర్శించి మెప్పు పొందిరి తదుపరి వారు శ్రీ కోలాచలంవారు వీరిరువురినిగూర్చి రాయలసీమ రచయితలచరిత్ర ప్రధమ సంపుటములందే వ్రాయబడినది ధర్మవరం, కోలాచలం వారలు పెంచిన విరితోటలోని సౌరభము విరువదపు శతాబ్దపు మధ్యకాలము వరకు గుబాళించినది ఆ సౌగంధము నాఘ్రాణించిన కవివరేణ్యులు కొందరు పద్య

కావ్యములకు తోడు నాటకములనుకూడ వ్రాయ సమకట్టిరి. నాటకకళ పుట్టి నేటికి శతాధిక వర్షములై జయంతుత్సవములు జరుపుకొను సందర్భమున అనంతపురం జిల్లా నాటకకర్తలైనట్టి । శ్రీ॥ రొద్దం హనుమంతరావు ధర్మవరం గోపాలాచార్యులు కస్తూరి సుబ్బారావు చక్రాల నృసింహకవి మొదలగు వారిని గూర్చి కొంత తెలిసికొందము



## శ్రీ రొద్దం హనుమంతరావు

నిర్యాణము 1904

తల్లి శ్రీమతి సాకమ్మ తండ్రి శ్రీ కృష్ణరావు

జన్మస్థలము పెనుకొండ అనంతపురం జిల్లా

కులము, మతము హిందూ, బ్రాహ్మణ, బడగనాడు, వశిష్ఠగోత్రులు

శ్రీ రొద్దం హనుమంతరావు గారు పెనుకొండ పట్టణమున న్యాయ వాదులుగా నివసించిరి. వీరు 1895 సం॥ ప్రాంతమున 'వాసవదత్త'ను లఘుటీకతో సహా వ్రాసిరి. శ్రీ వేదం వేంకటరాయశాస్త్రి గారిచే యిది పరిష్కరింపబడి 1899లో ముద్రింపబడినది. తరువాత 'వరూధినీ పరిణయ' మను నాటకమును రచించిరి. 1902లో 'భార్గవీ' అను మకుట ముతో 150 చంపక, ఉత్పలమాల పద్యములుగల 'భార్గవి మాలిక'ను ముద్రించిరి 'చంద్రికా నాటకము' (రెండంకములు) రాఘవశతకము (75 పద్యములుకలది] ఇవి అసంపూర్ణ గ్రంధములు. కవిగారి మరణానంతరం వారి తమ్ముని కుమారుడగు రొద్దం రామరావుగారు అసంపూర్ణ చంద్రికా నాటకమును దాని జతకు 'భార్గవీ మాలికను' చేర్చి ద్వితీయ ముద్రణగా 1939లో చెన్నపట్టణమున ముద్రించిరి.

శ్రీ హనుమంతరావుగారి కుమారులు శ్రీరంగారావుగారు ఈ నాటకమును పూర్తి చేయ తలపెట్టిరి కాని సాధ్యపడలేదు ఈ చంద్రికా నాటకము, ఆంగ్ల కవి షేక్స్పియర్ నాటకములలోని 'వింటర్స్ టేల్' అను నాటకమునకు అనుసరణ ఈ నాటకమును తాను క్రీ శ 1900 సం నందే వ్రాసినట్లు నాంది వాచకములో కవిగారు చెప్పుకొన్నారు ఇందలి కథా భాగమును సూత్రధారి చేత సంగ్రహముగా నిట్లు కవిగారు చెప్పించిరి.

సీ॥ శ్రుతకీర్తి యనురాజు_సతి గర్భవతి, జార
యను శంకఁ జెఱసాల నునుచుటయును
అచట, నాసతి గన్న యాడుబిడ్డను గరు
ణించక యేట ద్రోయించుటయును
'జనని రక్షించుమో జనక' యటంచుఁ బ్రా
ర్థించు తనూజు హింసించుటయును
నిరపరాధను నన్నుఁ గరుణింపుమని మ్రొక్క-
తనసతి డాకాలఁ దన్నుటయును

గీ. ఏటఁబడి చిన్న శిశువొక చోట నెమ్మి
రక్షితస్థితిఁ గనుటయు రాజు మరల
నందనునుగూడి బహు సౌఖ్య మందుట యును
చిత్రముగ వర్ణితంబులై చెలఁగు నిందు

ఈ రెండంకములందే 70 పద్యములు కలవు సంభాషణలు స్వల్పము. పద్యములు నారికేళ పాకములు శ్రుతికీర్తి పాడెడి పద్యము చూడుడు

సీ. సంతతాత్యంత హృచ్చింతా దవానలా
మోఘ సంవర్త ఘనా ఘనంబు
భూరి శాపత్రయోదార ధారాధర

స్ఫారాతి ఘోర ఝుంఝూ విలంబు
భయ శోక రోగాది బహు విపద్భయ దాహి
దారుణ ఖగరాజ దర్శనంబు
కామాది రిపుషట్క ఘన దుర్గమో దగ్ర
వీరు ద్వితాన లవిత్రకంబు

గీ. సమధికాఖిల పురుషార్ధ సాధకంబు
సకల భోగాభియోగ సంసాధనంబు
కామితార్థ ప్రదాయక కల్పకంబు
గాదె సజ్జన సాంగత్య గౌరవంబు

కవిగారు తమకుగల భాషా పాండిత్యము నిందు గుప్పించిరి ఇందు నాటకీయత తక్కువ ఇది ప్రదర్శనాయోగ్యముగా లేదు.

వీరి 'సార్వోచిష' (వరూధినీ పరిణయము) నాటకములోని పద్యము లన్నియు మనుచరిత్రలోని పద్యములకు మారుసేతలు. ఇదికూడా పూర్తిగా నాటకీయతను సంతరించుకొనలేదు ఈ నాటకమును గూర్చి కీ॥ శే॥ కల్లూరు వేంకటనారాయణరావుగారు తమ వీరేశలింగయుగమున నిట్లు వ్రాసిరి

మనుసంభవములో వలెనే దీనియందును వస్త్వైక్యము లేదు అది కావ్యము దాని కిసుమంతయు దోషములేదు కాని యిది రూప కము ఆద్యంతములకొక నిబంధన సూత్రము నాటకములలో లేకున్న నదియు కావ్యములే యగును. వీనియందు శ్రవ్యము దృశ్యము కాలేదు. కావి నాటక కళాకుశలతను చూపించు గుర్తులు మాత్రముకలవు ''

పై అభిప్రాయమే చంద్రికా నాటకము చదివినవారికి కూడ కలుగగలదు.

ఈ కవిగారు దివ్యజ్ఞాన సమాజ సభ్యులు. ఈ సమాజము ఆర్షమత సనాతన ధర్మములు కర్మవిషయము పునర్జన్మ విచారము మున్నగు అనేక అంశములపై ప్రచురించిన గ్రంథములసంఖ్యాకములు. కాని కవిగారికీ అంశములపై గల సందేహములను పద్యరూపమున వెలువరించిరి అదియే భార్గవీమాలికగా రూపొందినది ఇందుపయోగించిన తమ భాషాశైలిని గూర్చి కవిగారిట్లు వ్రాసుకొనిరి.

"పద్యశైలి క్లిష్టముగాను, సాంకేతిక పదభూయిష్టముగను, దీర్ఘ సమాస యుక్తంబుగను గ్రాంధిక ధాటీ పాటవంబు గలదియును గానుండిన యెడల నది నిరుపయోగముగా నుండునని తలంచియు ఇంతకన్నను బాగుగా రచించు శక్తి చాతుర్యాదులు చాలనందున సులభశైలి కలది యగునట్లు దీనిని రచించితిని."

నిరుపయోగమైన కవిత్వమేదో కవిగారు తెలుసుకొన్నారు పాండిత్య ప్రదర్శనవల్ల ఫలమేమున్నది? తమరచనలలోగల లోపములను గ్రహించ గల్గి వాటిని సరిదిద్దుకొనగల సరసహృదయులు మన రాయలసీమ కవులు.

రొద్దంవారి రచనా వ్యాసంగము తొమ్మిదేండ్లకాలము మాత్రమే కొన సాగినది వీరు ధర్మవరం రామకృష్ణమాచార్యులు-కోలాచలంగార్ల సమకాలికులు. ఈ సమకాలికులు పొందిన పేరుప్రతిష్ఠలే వీరినాటక రచనకు ప్రోత్సాహ మిచ్చినట్లున్నది.

రొద్దం హనుమంతరావువంటి ప్రౌఢ కవిత చెప్పగలిగిన ఆనాటి వారి సమకాలికుడు పోలికి చిదంబరరాయకవి గారొక్కరే.

ఇట్టి కవులు రాయలసీమలో ఎందరున్నారో?





# శ్రీ ధర్మవరం గోపాలాచార్యులు

జననము 1856వ ప్రాంత్యము

తల్లి శ్రీమతి లక్ష్మిదేవమ్మ
తండ్రి శ్రీమాన్ కొమాండూరుకృష్ణమాచార్యులు
జన్మస్థలము ధర్మవరం అనంతపురం జిల్లా
కులము, మతము, హిందూ, బ్రాహ్మణ, వైష్ణవులు

శ్రీ గోపాలాచార్యులవారు మన నాటక పితామహులైన శ్రీ రామ కృష్ణమాచార్యుల సోదరులు. వీరు బళ్ళారిలో సెకండరీగ్రేడు ప్లీడరుగా పనిచేసిరి. అన్నగారివలెనె వీరుకూడా కొన్ని నాటకములను రచించిరి. వాటిలో 1 రామదాసు నాటకము, 2 రామకబీరు నాటకము, 3 చంద్రమతీపరిణయము, 4 ప్రేమచంద్రయోగి లేక అస్పృశ్య విజయము ముఖ్యములు

వీరి ప్రేమచంద్రయోగి నాటకము 1933లో ముద్రింపబడినది ఇది ప్రబోధాత్మకమైన సాంఘిక నాటకము. మహాత్మాగాంధీగారొనరించు చున్న అస్పృశ్య నివారణోద్యమమునకు వీరి నాటకము చేయూతనిచ్చినది.

ఈ నాటకము నందెక్కువగా అస్పృశ్యతను గూర్చి వివరించు ఉపన్యాసములే మెండు. ప్రతి పాత్ర. ప్రతి సంఘటన ఆవిషయము నందే పూర్తిగా నిమగ్నమైనదని చెప్పవచ్చును. అకారణముగా కొంత కథాగమనము కుంటుబడినది. దానితో కొన్ని దృశ్యములు ప్రదర్శనా యోగ్యము కాలేదు.

అస్తగిరి-వేదగిరి, ముత్తుస్వామి-మునిస్వామి, సుమిత్రుడు-సుదాముడు

భోగిచంద్రుడు-మదనచంద్రుడు మొదలగు ఒకే శబ్దోచ్చారణ గల పేర్లు చదువరిని మభ్యపెట్టించును కొన్ని పాత్రలు తమ స్వగతములో నాటక కథను వర్ణించుటకూడ జరిగినది ఈ పద్ధతి ప్రథమాంకమున ప్రధాన కథా నాయకునితోనే ప్రారంభమైనది.

కవి బళ్ళారి ప్రాంతమునందుండుటచే అటనట కన్నడ పదజాలము కూడ యాదృచ్ఛికముగా దొర్లినవి ఇందు పద్యములు అధికముగా లేవు ఉన్నవాటియందీ పద్యమును ఎన్నుకొనదమైనది. చూడుడు.

సీ॥ ఆర్యులు శ్రద్ధతో, నధ్వరంబులుసేయ-
నెనపిన జ్ఞానంబు_మనకు గలదె?
పూజ్యులు తమ దేహపుష్టి నార్జించిన
ఘనతర శీలంబు-మనకు గలదె?
యోగులు విజ్ఞాన భోగమొందిన మార్గ
మును గాంచు పదిలంబు మనకు గలదె
తపసు అన్నముమాని విపినంబు లందుండి
తనరిన తనుశక్తి మనకు గలదె.

గీ॥ వాతబెట్టి నంతనె నక్క వ్యాఘ్రి మగునె?
నూత మునుగంగ దుష్క్రియల్ పూతమగునె
వెకలి జందెమును ధరింప-విప్రుడగునె?
సత్యనిష్ఠ యెల్లరికిని సాధ్య మగునె?

1889వ సం లో వీరు వ్రాసిన కన్నడ 'ఉత్తర రామచరిత నాటకము, బళ్ళారి సరస వినోదిని' నాటకశాలలో ప్రదర్శింప బడెను. ఆచార్యులవారు హొసపేటదగ్గర నున్న 'నారాయణదేవరకెరె' అను గ్రామమున న్యాయవాదిగా నున్నపుడు అక్కడి రంగాచారి నాటక కంపెనీవారు ప్రద

ర్శించిన నాటకములను జూచి ప్రభావితులై తాము తెలుగు నాటకము వ్రాసి ఆ యూరిలో ప్రదర్శించిరి

వీరి రామదాసు కబీరుదాసు నాటకములకు వచ్చినంత కీర్తి సాంఘిక నాటకములకు రాలేదు సాంఘిక నాటకపు కథావస్తువే వేరు దానివి తీర్చు నేర్పరితనమే వేరు. నాటకములు ప్రదర్శనా యోగ్యములైనప్పుడే కవి ప్రయత్నము ఫలించినట్లు కదా!

అన్నగారివలె తాను ఒక ప్రసిద్ధ నాటకకర్త కావలెననెడి కాంక్ష కవి గారికి మిక్కుటముగా నుండెను అన్నగారి యెడగల భక్తి ప్రపత్తులకు మేర లేదు. వారినిట్లు ప్రేమతో భజించిరి

'శ్రీరామ సౌమ్యంబు-శ్రీకృష్ణ మధురంబు
నడతలో గవితలో బడసియుండి
రామభూషణ కవిరాజు బోలిన భంగి
సంగీత సాహితి సంతరించి
సరస వినోదినీ సంఘంబు నెలకొల్పి
వేలుపారు నాటకంబులు రచించి
సుకవియై 'యాంధ్ర నాటక పితామహు'డన్న
బిరుదొంది బుధులచే వినుతి బొంది

గీ॥ సత్య సంధిత కార్యముల్ సలుపుచుండి
పుణ్యపురుషుండు ఘనుడంచు గణ్యుడనుచు
దివికి చనుదేరి భువిపైన దేజమిడిన
రామకృష్ణార్య భజియింతు బ్రేమతోడ

ఆచార్యులవారి తదితర వివరములు తెలిసి రాలేదు నేను బళ్ళారిలో పనిచేయు చున్నపుడు తమ శుభాకాంక్షలతో చేవ్రాలుచేసి నాకు 'ప్రేమచంద్ర యోగి' నాటకమును 22-10-1933వ తేదీన ఆచార్యులవారు ఇచ్చిరి. నాకు

యొఱక వున్నంతవరకు ఆచార్యులగూర్చి వ్రాసితిని. వారి కృషి ప్రశంసింప దగినది వీరి కీర్తి ఆంధ్ర నాటక చరిత్రిలో శాశ్వతముగా నిలువగలదు.

# 3. శ్రీ కస్తూరి సుబ్బారావు

జననము 1855 ప్రాంత్యము

శ్రీ కస్తూరి సుబ్బారావుగారు పేరుగడించిన నాటక కర్తలు కాక పోయినను వ్రాసిన రెండు నాటకములు మేల్బంతులనవచ్చును వీరి మొదటి నాటకము 'శాకుంతలా దుష్యంతము' రెండవది 'సుగ్రీవ పట్టాభిషేకము'

శ్రీ కస్తూరివారు ప్రభుత్వ నౌకరీ (క్యాష్‌కీపర్) నుండి విశ్రాంతి పొందిన తరువాత పెన్షన్ పుచ్చుకొన్న సమయంలో రచనా వ్యాసంగమునందు మునిగి 1915లో 'శకుంతలా దుష్యంతము'ను ప్రకటించిరి ఇందు శకుంతల జననము, దుష్యంతుని వేట, శకుంతల దుష్యంతుల గాంధర్వ వివాహము విరహము, భర్త కడకు పంపకము, ఆకాశవాణి వాక్కు, భరతుని పట్టాభిషేకము ఇందలి ప్రధానఘట్టములు. అందందు చక్కని పద్యములు వ్రాయబడినవి పాటలు వ్రాయలేదు.

వేటకై వచ్చిన దుష్యంత మహారాజు తన చెలికానితో తాను చూచిన శకుంతల అందము నిట్లు వర్ణించుచున్నాడు.

సీ చెలియ మోమును జూచి-సిగ్గుచే రేరాజు
నింగిని సరగున - నిలువబోయె
సఖియ కురులతోడ సరిగా నగాలేక
మధుపంబు లై తిర్గు-భ్రమరచయము
సరసంపు గనులతో-సరి దూగగాలేక
కానల పాలయ్యె-నేణి గణము

మేలైన మోముతో-మెలఁగి యుండగ లేక
  పగడంబు కఠినమై ప్రబలె భువిని

గీ. నడుము కెనగాక సింగముల్ నక్కె- గుహల
యానమున కోడి నీర్వట్టు హంస వితతి
ఇట్టి వలపుల కుప్పను నెట్లు విడుతు
బలుకరించక రానెట్లు పరమ మిత్ర.

భారతాంతర్గత కథావస్తువునే ఈ నాటకమునకు ఆధారముగా తీసుకొనద్య మైనది ఈ కథకు నాయకుడైన దుష్యంతమహారాజు పాత్రకు బలము చేకూర్చలేదు ఈ దుష్యంతుడు స్వతంత్రుడుకాడు ముగింపు శకుంతల దుష్యంతుల సంవాదము మత్తకోకిలలో వ్రాయబడి. పేలవముగా నున్నది. ఆకాశవాణి పలుకగానే దుష్యంతుడు మారాడక శకుంతలతో కరచాలనము చేసినాడు దృశ్యమునందు నాటకీయత లోపించినది

వీరి రెండవ నాటకము 'సుగ్రీవ పట్టాభిషేకము' దీనిని 1919లో ప్రచురించిరి శ్రీరాముడు దండకారణ్యము ప్రవేశించినది మొదలు సుగ్రీవుని పట్టాభిషేకము వరకు నాటకరూపమున వ్రాయబడినది అందందు సందర్భాను సారముగా భాస్కరకవి ప్రణీతంబగు రామాయణమునందలి కొన్ని పద్యము లుపయోగించు చున్నారనని కవిగారు చెప్పుకొన్నారు

ఈ నాటకమునందు పాటలు అనుబంధముగా చేర్చిరి. ఇందు నాటకీయత చక్కగా పోషించబడినది ఆయాపాత్రల ఔచిత్యమునకు తగినట్లు సంభాషణలు వ్రాయబడినవి. కొన్ని సందర్భములు చదువరి కంట తడి పెట్టించు చున్నవి.

రామాయణమునందలి అరణ్య- కిష్కింద కాండలలోని కథనే కవిగారు 'సుగ్రీవ పట్టాభిషేకము' అను పేర నాటకముగా వ్రాసిరి పంచవటి

యందు సీతారామలక్ష్మణుల వానము-జంబుకాసుర సంహారము-శూర్పణఖ గర్వభంగము-సీతాపహరణము- జటాయువు-శబరులకు మోక్షము - సుగ్రీవ మైత్రి-వాలిసుగ్రీవుల యుద్ధము-సుగ్రీవ పట్టాభిషేకము యిందలి ప్రధాన ఘట్టములు వాలి మరణానంతరము తార పరితపించిన విధము కవిగారు కడు విషాదముగా చిత్రించిరి

సీ। కపి కులాధీశ్వర! కపి రాజశేఖర!
  కన్నెత్తి నాదిక్కు కాంచ వేమి?
హృదయేశ! నినుబాసి యేనుండజాలను
  నీ వెంట నేతెంతు నిక్కముగను
ఏల యీ చుట్టాలు? యేల యీ పుత్రుండు
  యేల? యీ ధన ధాన్య మేలనాకు?
హానాథ! హా వీర! హా యింద్రినందన!
  హా జీవితేశ! హా! వనచరేంద్ర!

గీ ధర్మపత్నిని గడద్రోచి ధరణి మీద
నాథ! న్యాయమే చనగ యనాథ జేసి
యెన్ని విధముల జెప్పిన నెమ్మితోడ
వినగ నైతివిగా నాదు మనవి యకట!

ఇట్టి రసవత్తర విషాదకర దృశ్యములిందు పెక్కులున్నవి సీతను కోల్పోయిన రాముడు పొందు మనోవేదన, లక్ష్మణుని ఆరాటము, జటాయువు శబరులతో రామలక్ష్మణుల సంభాషణలు, ఇందుల కుదాహరణములు

శ్రీ కస్తూరివారి 'శకుంతల' నాటకమునకంటె యిది వేయి రెట్లు నాటక ప్రదర్శన కనుకూలముగా నున్నది పద్యములిందు ఎక్కువగా చేర్చి సంభాషణలయందు తమ నేర్పరి తనమును చూపిరి. ప్రదర్శన కనువుగా

రంగ విభజన గావించిరి నాటకకర్త తమ నాటకమునందలి కొన్ని దోషములు వింధు సవరించుకొనిరి

ఈ కవిగారి ఇతర రచనలేవో తెలియవు తక్కిన వివరాలు తెలిసి రాలేదు. తెలిసినంతవరకు వీరు అనంతపురంలోని పాతవూరులోనే నివసించిరి. వీరి ఇంటికి 'కస్తూరి బిల్డింగ్స్' అనుపేరు ఇప్పటికికూడా కలదు

## 4 శ్రీ చక్రాల నృసింహ కవి

( జననము 1885 )

తండ్రి . శ్రీ చక్రాల భాస్కరప్ప - తల్లి శ్రీమతి వెంకమాంబ

కులము, మతము .. హిందూ - బ్రాహ్మణ భారద్వాజస గోత్రము

జన్మస్థలము గుత్తిపట్టణము - అనంతపురం జిల్లా

చక్రాల వంశస్థులు కవులేగాక వైద్య జ్యోతిష్కములందు ఘటికులు చక్రాల నరసింహకవిగారి ముత్తాత గారైన శ్రీ శేషాద్రి రామప్పగారు సకల విద్యా పారంగతులై, 'ఆ కా శ ప ం చా ం గ' బిరుదు వహించిరి శేషాద్రి రామప్ప గారికి వెంకప్ప శాస్త్రి - శేషాద్రిశాస్త్రి అను ఇరువురు పుత్రులు వీరిలో రెండవవారైన శేషాద్రిశాస్త్రి కుమారులు భాస్కరప్ప గారు.

శ్రీ చక్రాల భాస్కరప్పగారు వేదాంత శాస్త్ర కోవిదులు. 'ధర్మప్రకాశికాది' కృతికర్తలు, సాధుతత్పరులు, వైద్యోత్తములు, వీరి కుమారులే మన చక్రాల నృసింహ కవిగారు

కవిగారు తమ పన్నెండవ ఏటనే కవిత్వము చేబట్టి తొలుత 'సింహావలోకన'మను శతకమును రచించిరి. తరువాత 1920వ సంవత్సరమున సౌందర్య 'చక్రధరీయమను' నీతిదాయక సాంఘికనాటకమును రచించిరి దీనిని శ్రీ శారదా విలాస గ్రంధమాల ద్వారా తొలి కుసుమముగా వెలువరించిరి.

వారకాంతల మాయోపాయ మాటలవలలో దగులుకొని ఎందరు ధన, బల,మానములను నశింప జేసుకొనుచున్నారో తేటతెల్లముగా ఈ నాటకమందు తెలిపిరి.

ఇందు రెండు అంకములు మాత్రమే కలవు చక్రధరరావు ఇందు కథానాయకుడు అతడు కులస్త్రీని విడిచికులటల ఇండ్లు తిరుగు వేశ్యాలోలుడు పేరుకు తగినట్లు సౌందర్యమైన వేశ్య 'నిపుణ' చక్రధరరావు ఇంటిదాపి ఆమె చక్రధరరావును మార్చుటకు యత్నించి, ఒక చిన్న నాటకమును చిత్రించెను తుదకు చక్రధరరావు వేశ్యల ప్రేమలు క్షణికములని తెలుసు కొని ధర్మపత్నిని ఏలుకొనెను ఇది సౌందర్య చక్రధరీయ మందలి కథ

'సౌందర్య చక్రధరీయము' ప్రధానముగా నీతిని బోధించుటకే వ్రాయ బడినది నాటక ప్రదర్శనమునకు కావలసిన బలమైన సంఘటనలుకాని సం భాషణా చాతుర్యముకాని ఇందు కనిపించదు అందందు పద్యములు కూడ చేర్చిరి పద్యనడక చక్కగా నున్నది ఈ నాటకమును పరిష్కరించి పంపునపుడు బ్రహ్మశ్రీ శతావధాని వేలూరి శివరామశాస్త్రిగారు ప్రహసన ముల కన్నను పద్యకావ్యంబు వ్రాయుట శ్రేయంబని కవిగారికి సలహా నొసంగిరి అట్లే కవిగారి చెలికాడు సమకాలికుడు గ్రంథకర్త యైన శ్రీచెన్నే కొత్తపల్లి వేంకటకృష్ణశర్మగారు కూడ అదే అభిప్రాయమును వెలిబుచ్చిరి వారి అభిప్రాయములను కవిగారు ఆచరణలోనుంచిరి అప్పటి ప్రసిద్ధ నాటక కర్తల నాటకప్రదర్శనలతో కవి గారు ప్రభావితులైనట్లు తోచుచున్నది కాని ఒంట బట్టిన పద్యరచన ముందది కుంటుబడెడిదే నని ఎఱింగిన గుణగ్రాహులు వీరు రాయలసీమ కవు లందరియందును కనిపించు సహజగుణ సంపది ఇదియే మనవారికి మొండి పట్టుదలతో అవసరములేదు

వీరి తదుపరి కావ్యము 'శ్రీమయూరధ్వజోపాఖ్యానము' దీనికి పిన వీరభద్రుని జైమినీభారతకథ ఆధారము ఇందు ప్రాచీన కావ్యధోరణి గలదు

పద్యములన్నియు ఎక్కువగా వృత్తములలో సాగినవి అందొక పద్యము చూతము.

> ఉ॥ మారులు రూపసంపద కుమారులు కీర్తిధరప్రభూతి సం
> చారులు, సత్పథంబున విచారులు, నైతిక తత్వమందు మం
> దారులు పార్థివార్థుల కుదారులు, భూతియు తత్వమందు కొ
> మారులు దృష్టశాత్రవ కుమారులు రాజకుమారు లా పురిన్.

వీరిని గురించిన వివరము లెక్కువగా తెలిసిరాలేదు. వీరివంశీకులు ప్రస్తుతము గుత్తిలో వున్నారు ఈ కవులు తమనుగురించి ఎక్కువగా ప్రచారము చేసుకొనలేదు అంత మాత్రమున మనము వారిని పరిగణింప కుండుట భావ్యమా? ఉన్నంతలో వారిచరిత్రలు వ్రాయవలసినదెకదా' వీరికృషి రాయలసీమ సాహిత్య చరిత్రలో ఎన్నదగినది

వీరందరూ స్వాతంత్ర్య మునకు పూర్వమున్న నాటకకర్తలు, స్వాతంత్ర్యానంతరము కొందరువ్రాసిన నాటకముల తీరు వేరుగా నున్నది.

# ప్రబంధ కవులు

రాయలసీమ ప్రబంధ కావ్యములకు పుట్టినిల్లు శ్రీ కృష్ణదేవరాయ లేలిన ఈ ప్రాంతమందు రత్నములవంటి ప్రబంధ కావ్యములు వెలసినవి మను, వసు చరిత్రలవంటి అష్టదిగ్గజ ప్రబంధములు తెనుగులో మహాకావ్య ములుగా వెలసి మనసీమకు వన్నెయు, వాసియు తెచ్చిపెట్టినవి విజయనగర రాజులు కవులు, కవిపోషకులు అట్టియెడ కొదువేమి? ఆకాలమును ప్రబంధ యుగమని సాహితివేత్తలు గుర్తించిరి

ఈ ప్రబంధ యుగానంతరముగూడా కొందరు కవులు చక్కగా ప్రబంధములు వ్రాసిరి. వారు ప్రాచీనకవుల ఒరవడి ననుసరించియే ప్రౌఢ

తర కావ్యముల నల్లిరి. పంతొమ్మిది, ఇరువదవ శతాబ్దములందుకూడా అనగా శ్రీ గడియారమువారి 'శివభారతము' వరకు మంచికావ్యరచనలే సాగినవి.

శ్రీయుత వావిలికొలను, జనమంచి, దుర్భాక, గడియారము, పుట్టపర్తి మొదలగు కవులందరు ఒకకోవకు చెందిన కావ్యకర్తలు. వీరినిగూర్చి పరిచయములు ప్రథమ, ద్వితీయ సంపుటములందు చేర్చబడినది వీరికంటె పూర్వీకులు ప్రాచీన ప్రబంధ వైఖరి నేమాత్రము వీడక వారి బాటయందే తమ కవితా రథమును సాగించిరి వారిలో శ్రీ రత్నాకరం అప్పప్పకవి శ్రీ కొట్టుపాటి గురవయ్యకవి, శ్రీ కొడపలూరి రామచంద్రకవు లెన్నదగిన వారు. వారినిగూర్చి కొంత తెలిపికొందము

## శ్రీ రత్నాకరం అప్పప్పకవి

జననము 1827 నిర్యాణము 1899

తల్లి : శేషమాంబ తండ్రి ఆంజనేయార్యులు

జన్మస్థలము అనంతపురం జిల్లా, పెనుకొండ తా కొత్తచెరువు గ్రామము

కులము, మతము హిందూ, భట్రాజులు

కవిత్వము చెప్పుటలో భట్రాజులు పేరెన్నికగన్నవారే ఈ భట్రాజులలో రత్నాకరంవారు ప్రసిద్ధులు. వీరనేక సంస్థానాధీశ్వరులవద్ద కవులుగా మెలగిరి వసుచరిత్ర కర్త భట్టుమూర్తి ఈ కులజుడే వీరి ఇంటిపేరు ప్రబంధాంకము వారు భట్టుమూర్తికి పూర్వమే ఒక " చిత్రకవిత్వ రచనాచమత్కార రత్నాకరు డుండెనని శ్రీఆరుద్రగారు తమ సమగ్ర ఆంధ్ర సాహిత్యమునందు వ్రాసిరి. అతని పేరు రత్నాకరం , గోపాలరాజు ఇతని తండ్రి కృష్ణమరాజు ఈతని కాలమునుండియో, అంతకు పూర్వము నుండియో ఈ వంశమువారికి 'రత్నాకరం' వాచను ఇంటి పేరు

వచ్చినదవిరి ఈ రత్నాకరం గోపాలరాజును శ్రీ రావెళ్ళ లింగమ నాయకుడు పోషించెను ఈ కవి కాల మిదమిత్థమని నిర్ణయింపబడలేదు

గోపాలరాజు ప్రౌఢకవి ఈతడు భాగవత దశమస్కంధమును 'సౌగంధికా కుసుమ ప్రసవాపహరణము' అను రెండు ద్విపద కావ్యములను రచించిరి అవి అముద్రితములు మొదటిదానిని మదన గోపాలస్వామికి రెండవది రావెళ్ళ లింగమనాయకునకు అంకితమిచ్చెను. గోపాలరాజు చక్కని లాక్షణికుడు 'సకల లక్షణసార సంగ్రహము' అనబడు ఛందో గ్రంథమును గూడా ఈయన రచించెను అదికూడా అముద్రితమే. ఈ ప్రతి కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్తు కార్యాలయమందు కలదని శ్రీ ఆరుద్రగారు వ్రాసిరి 1949 లో శ్రీ వావిళ్ళ కంపెనీవారు వీరిసౌగంధికా కుసుమ ప్రసవాపహరణము' ను ముద్రించిరి

పై ద్విపద కావ్యమునే వీరియనంతరము, ఈ రత్నాకరవంశీయుడైన 'రత్నాకరం అప్పప్పకవి' దీనిని సౌగంధికా ప్రసూన సంగ్రహము అనుపేర ప్రబంధ కావ్యముగా మార్చి వ్రాసిరి ఇది అముద్రితము. వ్రాతి ప్రతి ఎచ్చటనున్నదో తెలియదు. అప్పప్పకవి గోపాలరాజు తనవంశకర్తగా ఈ కావ్యమునందు చెప్పుకొన్నాడు కాని ఈ విషయ మితర కృతులందు ఎలనో చెప్పుకొనలేదు.

అప్పప్పకవిగారి శశిరేఖా పరిణయము (3 ఆశ్వాసములు) సంగమేశ్వర విలాసములు ముద్రితములు. శశిరేఖా పరిణయమును శ్రీ వావిళ్ళ కంపెనీవారు ముద్రించుట ముదావహము రామదాసు చరిత్ర వీరి మరొక అముద్రితకృతి

ప్రబంధలక్షణములు సంపూర్ణముగా గల ఈ కావ్యమందు ఇంద్రప్రస్థపుర వర్ణన ఇట్లున్నది.

శా॥ ఇంద్రగ్రావ వితోన్నతామిత మణీ, హేరాళ సోపాన భా
క్చంద్రద్రి ప్రస్తర వేదికానికరమై, సౌధాగ్రభాగోద్యన్న. మ
త్సాంద్రద్యోతిత కేతనాంబర, మరుత్సంపీడితాంభోదమై
ఇంద్రప్రస్థపురంబు భాసిలె మహా హేమోజ్జ్వలాగారమై

శశిరేఖా పరిణయ ఘట్టమున ఘటోత్కచుడు జరిపిన వీరోచిత భయంకర కృత్యములకు లక్ష్మణకుమారుడు అదరిపడినాడు. అతని అందోళన నిట్లు కవిగారు వర్ణించిరి.

సీ॥ మది భయంకరమైన వదన గహ్వరమొప్పఁ
దంష్ట్రాద్వయంబుతో దయ్యమిపుడు
నేలెంచె మీమొగమేమి చూచెదరింక
మాటు కేగెదనన్న మార్గమిడరు
ఇంకెన్నటికిఁ బెండ్లినేవొల్ల మీయాన
యీ గండ మొకటి యీడేర్చరయ్య
నీలాంబరుడు మిము నెరనమ్మి నిలువగా
దరమె, దయ్యము వెంట దగిలినపుడు.

తే॥ పదపదండని మూపులు పట్టిత్రోచి
బెబ్బరింపుచు జనులెల్ల భీతిబొందఁ
దండ్రులందఱు దిగులొంది తత్తరింప
లలన బృందంబులో దూరె లక్ష్మణుండు

వీరి రచన కొన్ని చోట్ల దీర్ఘసమాసముల చేతను మరికొన్ని చోట్ల లలిత పదముల తోడను సాగినది. వీరి ఇతర అముద్రిత రచనలు లభించలేదు. ఈ కవిగారు గోపాలరాజు గారి ద్విపదకావ్యమును పద్యముగా మార్చెనందురు. ఇతడు 1899 లో దివంగతుడయ్యెను.

# శ్రీ కొడవలూరి రామచంద్రరాజకవి



జననము 1877

నిర్యాణము 1945

తల్లి శ్రీమతి అచ్చమాంబ

తండ్రి శ్రీ సంజీవరాజు

జన్మస్థలము కడప జిల్లా ప్రొద్దుటూరుకు దగ్గరగాగల ముక్తిరామేశ్వరం కులము, మతము హిందూ భట్రాజులు భారద్వాజసగోత్రులు

సీ॥ ప్రతివాది పండిత ప్రకర భయంకర
ప్రౌఢ వాక్యులు భట్టరాజువారు
క్ష్మాతలాధిప దత్త సామర్థ్య చిహ్న వి
భ్రాజితాంగులు భట్టరాజువారు
విద్వాన్ వరిష్ఠ సద్విజ్ఞాన పూరిత
ప్రకట కీర్తులు భట్టరాజువారు
సంస్కృతాంధ్ర సుశబ్ద సంశోభిత కవితా
ప్రాభవాత్ములు భట్టరాజువారు

తే॥ నిస్సమాన ఘృణాధర్మ నీతి వినయ
ప్రతిభ సాలంకృతులు భట్టరాజువారు
సత్తమ క్షత్రివంశ పయోంబురాశి
ప్రభవ జైవాతృకులు భట్టరాజువారు.

భట్టరాజుకులజులు తమకుగల ఆత్మ విశ్వాసము నిట్లు ప్రకటించుకొనిరి. వారెందులో తక్కువ వసుచరిత్ర కర్త భట్టుమూర్తి రత్నాకరం గోపాల

రాజు, రత్నాకరం అప్పప్పకవి యింకా ఎందరెందరో కవిపుంగవులు ఈ కులమున పుట్టి విఖ్యాతి నార్జించిరి వారు రాజాస్థానములందు మన్ననల నందు కొనిరి. సంస్కృత తాంధ్రములు వారి జిహ్వాగ్రములందు నాట్య మాడినవి వారు వందిమాగధులే కారు! శతాధిక కావ్యములకు కర్తలు. వారు పేరు ప్రతిష్ఠలకు పాత్రులాదనివారు అధ్యయన, అధ్యాపనలు నిత్య కృత్యములుగా కలవారు ఇట్టి సత్కుల వంశ సంజాతుడు శ్రీ ఆంజనేయ స్వామిభక్తుడు 'మహాసేనోదయ' కావ్యకర్త, కావ్యనాటక శతకాది వివిధ రచనా ప్రక్రియలందు లబ్ధప్రతిష్ఠుడు, సువర్ణహస్త కంకణధారుడు, రాజా స్థానములందు సన్మానములను బొందిన మహనీయుడు మన శ్రీ కొడవలూరి రామచంద్రరాజు కవిగారు

శ్రీ రామచంద్రరాజు వంటి ప్రౌఢకవి, చిత్రబంధ, గర్భబంధ కవిత్వములను చెప్పగల ధీశాలిని ఆధునికులలో లేరని యే చెప్పవచ్చును. ఆయన వసుచరిత్ర కర్త రచనా వైఖరిని ఆపోసన పట్టినవాడు తిక్కన కవిత్వమును తనదిగా చేసుకొన్నవాడు. పోతన భక్తిభావము ననుసరించిన వాడు కనుకనే ఆయనిట్లు చెప్పుకొన్నాడు.

మ॥ సుతదారాది కుటుంబరక్షణమునై - క్షోణీస్థలిన్ మానవ
స్తుతులం గావ్యములొప్ప జెప్పి, ధనరాసుల్గొంచు మోదించుమన్
వితతాహంకృతి నొంది చచ్చి, నరకావిద్ధాంగులై యుండ్రు, హీ
నత యేపాటన్, భగవత్సమర్పణము జెందంగా రచింపందగున్

ఇహపర సాధనలకై, తమ కావ్యములను శ్రీరామచంద్రున కంకిత మిచ్చిన భక్తవరేణ్యులు వీరు వీరి కింతటి కవితా ప్రౌఢిమ శ్రీ ఆంజనేయస్వామి వల్లనే కల్గినది ఆ విషయముగా వారిట్లు వ్రాసిరి

తే॥ పంక్తి రథ నందనాగ్రణీ పాదకమల
సేవనానందు నంజనీదేవి సుతుని
కరుణచే రామచంద్ర సత్కవి సమాఖ్య
గలిగె గాకున్న నీ పేరు గలదె నాకు॥

శ్రీ మారుతిని దలచి నప్పుడెల్లను కవి తన్మయుడై ఆనందబాష్పములు రాల్చెడివారు.

"నా పుణ్యముచేత షణ్ముఖుని పుట్టుక గాథలు గద్యపద్యముల్ వన్ని రచింపరైరి, యొక పట్టున, దానిని నే రచించెదగా" అంటూ కవిగారు కుమారస్వామి గాథను అత్యంత సారవంతముగా రచించి, దానికి 'మహా సేనోదయ' మని పేరిడిరి. ఇయ్యది ఎనిమిది ఆశ్వాసముల పురాణ ప్రబంధ కావ్యము. దీనికి మూలము స్కాంధ పురాణ మందలి, 'శంకర సంహిత' యందలి మహా సేనోదయ కథావస్తువు. ఇందలి సూర్యోదయ వర్ణన చూతము

ఉ॥ కైరవముల్ దపించె,విహగంబులు గూండ్లు త్యజించె బద్మముల్
గోరికలన్ వహించె, నుడుకోటి నశించె, రథాంగ దంపతుల్
సారెకు సంతసించె, బొది జక్కొర విల్ద్రార తూపులుంచె ది
గ్వారము కాంతి బెంచె, బవిపాటలు గేస్తులడాసె నంతటన్

ఇందు కొంత నాటకీయత గూడ కవిగారు జొప్పించిరి. వల్లీ దేవిని ప్రేమించ బోయిన కుమార స్వామి బోయ వేషమున వల్లి కడకు వచ్చి, సంభాషణ సాగించెను. అంతలో ఆమె తండ్రి పుళిందుడు రాగా స్వామి వటవృక్షముగా మారెను. తదుపరి ముసలి బ్రాహ్మణ వేషము ధరియించి త్రాగుటకు నీరు కోరెను. వల్లి అతని సమీపమునగల సరస్సునకు

బొమ్మనెను. అప్పుడు కుమారస్వామి

ఉ॥ త్రోవ యెఱుంగ నచ్చటికి దోయరుహాననః నాకుదోడుగా
నీవునురాక తక్కితివ యేని నిజంబుగ బోవజాల; నే
నేవిధి దోషి నైతి, నన నింతి కృపజ్ఞ గపటాగ్ర జన్ముతో
బోవుడు జెర్చుచేరి దగబో, జలమాతడు గ్రోలి వేడుకన్

మంచి భావములు కలిగినప్పుడు వానిని చెప్ప నేర్చుటకు మంచి భాష కావలెను. భావము భాష ఈ రెండును కవికి రెండుచేతుల వంటివి ఏ ఒక్కటి కుంటుపడినను తొందరే. మంచి భాషాపాండిత్యమున్న వారికి భావపరంపర తక్కువగా నుండవచ్చును. భా వా వే శ ము కలవారికి భాష తక్కువ కావచ్చును. అట్టి సందర్భములందు ప్ర స వ ం త మైన కవిత్వము పుట్టుటకు వీలుండదు. అట్లుకాక ఈ రెండును తన హస్తగతము గావించుకొన్న కవిపుంగవుడు తన కవితా పటిమతో స్వర్గమునే ఇలకు తెచ్చును. అతని ఊహల కంతుండదు. ఆ కవి రవినే మించును. అతడు బొమ్మను తిమ్మి చేయును. తిమ్మిని బొమ్మ చేయును. అందుకే కవి దృష్టి వేరు, మనదృష్టి వేరు. చంద్రునిలోని మచ్చకు కారణము రామచంద్రరాజుగారి భావనలో వేఱుగానున్నది. అది యే భావనో జూడుడు.

మ॥ ముదమొప్పన్ జనుదెంచుచున్న శశి భృన్మూర్తిన్ త్రియామా
నఘా టీ.దృడాలింగన మాచరింప, దనకాఠిన్యంపు జందోయి పై
బదిలంబౌ. మృగనాభి కర్దమము, లోభాగంబు సందంటియు
న్నది పోలెన్, గననయ్యెనంక మరవింద ద్వేషి బింబంబునన్.

రసజ్ఞు లింపరి సారమును గ్రహించియే వుందురు. తనకడకు సంతోషముగ వచ్చుచున్న చంద్రుని రాత్రియనెడి స్త్రీ మిక్కిలి గాఢముగా

కౌగిలించుకొనెను ఆమె బిగువైన చన్నులకు పూసిన కస్తూరి, చంద్రుని యురోభాగము నందంటు కొనినది. అదృఢాలింగన ముద్రలే చంద్రుని లోని కళంకమునకు కారణములు ఇది కవిగారి సహేతుకమైన భావకల్పన, ఇట్టి భావోద్వేగముతో కూడిన పద్యములు కోకొల్లలు. సాహితీప్రియులు ఎదువలసినదే తప్ప ఇందుదహరింప సాధ్యపడదు ఈ కవికి రామరాజ భూషణుని కావ్యరచనా శైలిపై మిక్కిలి మక్కువని తోచును అటనట ఆ పోకడలే కనిపించును కవిత్వమందు శ్లేష నుంచుట, కొందరుకవుల కొక కేళి. సాహితీ పిపాసుల కీకేళి కొంత భాషాభివృద్ధిని ఆలోచనా శక్తిని ఇనుమడింపజేయును మన ప్రాచీన కావ్యములందీకేళి అపారము అధునిక కావ్య ప్రబంధములందు కూడ కొందరీ పద్ధతిని తమ కావ్యములందు చొప్పించిరి రామచంద్రరాజు గారి మహాసేనోదయకావ్యమందలి శ్లేషను కొంత చూతము

సీ॥ వర సుమనశ్చక్ర వాళక భరితంబు
మహనీయతర సుధర్మాన్వితంబు
అసమానఘన వైజయంతప్రకాశంబు
విద్యాధరోరోత్కర విలసితంబు
విసులాభ సంప్రాప్త వర్ణిత విభవంబు
నతులిత వజ్రప్రభావృతంబు
సంతత గురువాక్య జాలాభి రామంబు
గంధర్వ సందోహ బంధురంబు

గీ॥ పరిబల పుణ్యజనౌఘ ప్రాప్యస్థలంబు
వితత దోషాత్మకా శిద పీయ తలము
బ్రొంచి తాఖండ సౌఖ్యరత్నాకరంబు
క్ష్మాత్రివిష్టప మన నొప్పు స్కందపురము.

ఇందు స్కంధపురమును వర్ణించుచు. అది సురపురముకంటె అన్నింటి యందును మించి యున్నదని కవిగారు శ్లేషలో వర్ణించిరి.

వీరు గర్భబంధ కవిత్వమున దిట్టలు, ఇట్టి రచనాప్రక్రియలో. గారడి వానివలె కవి ఏదో గాలిలో చేతులూపునట్లు కనిపించినను, తుదకతడు మనకు తాను సాధించిన ఫలితమును చూపి మనల నానందింప జేయుచున్నాడు,

ఇట్టి ప్రక్రియ నలవాటు చేసుకొన్న కవీశ్వరులు రసోచితమైన కవిత్వమును చెప్పలేరను భావము మనలో లేకపోలేదు. రామచంద్రరాజు గారు మాత్రము విషయమున విఫలులు కాలేదు. వారి విషయములో దానికి తావులేదు.

కం॥ భావ భయోపను వామా
భావి భవాబభవ ధావ పాపా విపమ!
భూవి భ భోమా వాపా
భావామ విభోప భపప భభవ ప్రభవా!

ఇట్టి పదగుంఫనతో అనర్గళముగా సాగిన కవితాధార వీరిది. ఈ కావ్యమును మహాపండితులగు శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారు పరిశీలించి తమ అభిప్రాయము నిట్లునుడివిరి "వీరి కవనము మృదుమధురము, హృదయంగమము. రసవంతము. వసుచరిత్రకారుని మార్గములోనిది. ఈ నాల్గు విశేషములచే నిండిన కడము గుణములను పండితులూహింపవచ్చును వీరి పద్యములు వినుచు కరమానందించుచుంటిని."

'భారతి - ఆంధ్రపత్రిక - మాసీమ' మున్నగు వివిధ పత్రికలలో ప్రశంసలను వీరి మహాసేనోదయకావ్యము పొందినది. ఆంధ్రపత్రిక అభిప్రాయ మిట్లున్నది.

కౌగిలించుకొనెను. ఆమె బిగువైన చన్నులకు పూసిన కస్తూరి, ఇంద్రుని యురోభాగము నందంటు కొనినది. అదృఢాలింగన ముద్రలే చంద్రుని లోని కళంకమునకు కారణములు. ఇది కవిగారి సహేతుకమైన భావకల్పన, ఇట్టి భావోద్వేగముతో కూడిన పద్యములు కోకొల్లలు. సాహితీప్రియులు ఎదువలసినదే తప్ప ఇందుదహరింప సాధ్యపడదు ఈ కవికి రామరాజ భూషణుని కావ్యరచనా శైలిపై మిక్కలి మక్కువని తోచును అటనట ఆ పోకడలే కనిపించును కవిత్వమందు శ్లేష నుంచుట, కొందరుకవుల కొక కేళి. సాహితీ పిపాసుల కీకేళి కొంత భాషాభివృద్ధిని ఆలోచనా శక్తిని ఇనుమ డింపజేయును మన ప్రాచీన కావ్యములందీకేళి అపారము ఆధునిక కావ్య ప్రబంధములందు కూడ కొందరీ పద్ధతిని తమ కావ్యములందు చొప్పించిరి రామచంద్రరాజు గారి మహాసేనోదయకావ్యమందలి శ్లేషను కొంత చూతము

సీ॥ వర సుమనశ్చక్ర వాళక భరితంబు
మహనీయతర సుధర్మాన్వితంబు
అసమానఘన వైజయంత ప్రకాశంబు
విద్యాధరోరోత్కర విలసితంబు
వసులాభ సంప్రాప్త వర్ణిత విభవంబు
నతులిత వజ్ర ప్రభావృతంబు
సంతత గురువాక్య జాలాభి రామంబు
గంధర్వ సందోహ బంధురంబు

గీ॥ ప్రబల పుణ్యజనౌఘ ప్రాప్యస్థలంబు
వితత దోషాత్మకా శిద వీయ తలము
ద్రాంచి తాఖండ సౌఖ్యరత్నాకరంబు
త్మ్రివిష్టప మన నొప్పు స్కందపురము.

ఇందు స్కంధపురమును వర్ణించుచు. అది సురపురముకంటె అన్నింటి యందును మించి యున్నదని కవిగారు శ్లేషలో వర్ణించిరి.

వీరు గర్భబంధ కవిత్వమున దిట్టలు, ఇట్టి రచనాప్రక్రియలో. గారడి వానివలె కవి ఏదో గాలిలో చేతులూపినట్లు కనిపించినను, తుదకతడు మనకు తాను సాధించిన ఫలితమును చూపి మనల నానందింప చేయుచున్నాడు,

ఇట్టి ప్రక్రియ నలవాటు చేసుకొన్న కవీశ్వరులు రసోచితమైన కవిత్వమును చెప్పలేరను భావము మనలో లేకపోలేదు. రామచంద్రరాజు గారు మాత్రము విషయమున విఫలులు కాలేదు. వారి విషయములో దానికి తావులేదు.

కం॥ భావ భూపన వామా
భావి భవాబభవ భావ పాపా విపదీ:
భావి భ భోమా వాపా
భావామ విభోప భపప భభవ ప్రభువా:

ఇట్టి పదగుంఫనతో అనర్గళముగా సాగిన కవితాధార చిరిది. ఈ కావ్యమును మహాపండితులగు శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిగారు పరిశీలించి తమ అభిప్రాయము నిట్లునుడివిరి "వీరి కవనము మృదుమధురము, హృదయంగమము. రసవంతము. వసుచరిత్రకారుని మార్గములోనిది. ఈ నాల్గు విశేషములచే నింపబడు గుణములను పండితులూహింపవచ్చును వీరి పద్యములు వినుచు కరమానందించుచుంటిని."

'భారతి-ఆంధ్రపత్రిక-మూసీమ' మున్నగు వివిధ పత్రికలలో ప్రశంసలను వీరి మహాసేనోదయకావ్యము పొందినది. ఆంధ్రపత్రిక అభిప్రాయ మిట్లున్నది.

"క్రొత్తగా వచ్చిన స్వతంత్ర కావ్యాలలో మొట్టమొదట చెప్పుకో దగినది శ్రీ కొడవలూరి రామచంద్రరాజు కవి వ్రాసిన 'మహాసేనోదయం. అతిమాత్రమైన సంయమం, భాషా ఛందః పాండిత్యము, చిత్రబంధకవిత్వ మర్మజ్ఞత, అన్నిటికన్న ఎక్కువ ప్రసన్నత, ఈ కావ్యానికి శోభ గూర్చే విషయాలు". ఇకభారతి, మాసపత్రిక యిటు కొండాడినది.

" భూషణుని మార్గం కంటె తిక్కనవలె వ్రాయుట యీతని కిష్టముగా కాన్పించును యుద్ధ వర్ణనమునందు సరిగా తిక్కన విగ్రహము అదేకూర్పు, ఉపమానపు నేర్పు కానబడుచున్నది."

వీరి కృతులలో మహాసేనోదయము, చాతుర్మాస్యదీక్షా ప్రబంధము, ఆంధ్ర పంచీకరణము శ్రీ ముక్తి రామేశ్వర క్షేత్ర మాహాత్మ్యములు' ధీవిధీశతకము మనః ప్రబోధశతకము, రామచంద్రప్రభుశతకము, హనుమచ్ఛిశికళ, రుక్మాం గద నాటకము, రామదేశికుల చరిత్రములు ముద్రితములు. ఇంకను పెక్కు అముద్రిత గ్రంథములు కలవు వాటిలో పాండురంగ క్షేత్రమాహాత్మ్యం, నలనాటకము, లక్ష్మణమూర్ఛ, సుంధరకాండనాటకము, శమంతకమణి, అంబ రీష, శ్రీకృష్ణరాయబారము. మార్కండేయ చరిత్ర, దమయంతీ వివాహము మరికొన్ని హరికథలు ముఖ్యమైనవి. వీటివి కడప జిల్లా రచయితల మహా సభయందు ప్రదర్శింపబడి, సారస్వత ప్రియుల దృష్టికి దెచ్చుట జరిగినది.

కవిగారు 1916లో పుష్పగిరి పీఠాధిపతుల ఆశీస్సులను పొంది పారి తోషికముగా, సువర్ణహస్త కంకణమును బడపిరి అనేక సంస్థానాధీశ్వరుల వద్దగల విద్వాంసులు, పండితులు, మహాకవులు, శతావధానులు, కళాప్రపూ ర్ణులు, వీరిని ప్రశంసించి, యోగ్యతా పత్రముల విచ్చిరి, సన్మానములు చేసిరి

రాజుగారు జీవనోపాధి నిమిత్తము పల్లెలందున్న సంపన్నుల బిడ్డలకు

విద్యా గురువుగా జీవితమును సాగించుచు మరుగుపడిన మాణిక్యమువలె బ్రతికిన కవి పుంగవులు, వీరికిరువురు కుమారులు, పెద్దకుమారుడు శ్రీ కొడవలూరి పెద్దరామరాజు-చిన్నకుమారుడు శ్రీ కొడవలూరి చిన్నరామరాజు, వీరుకూడ తండ్రివలె కవులు, తండ్రిగారి కవిత్వమును వ్యాప్తిగావించుటకు బహుళ కృషి గావించి వారి ఆత్మకు శాంతి కలిగించిన సత్పుత్రులు వీరు

# పెద్ద రామరాజకవి

వీరు 1-7-1909లో జన్మించిరి ప్రస్తుతము ఉపాధ్యాయ వృత్తినుండి నివృత్తిపొంది విశ్రాంతి తీసుకొను చున్నారు వీరు మహానందీశ్వర శతకము 2) పితృప్రార్థన 3) మాతృస్తోత్రము 4) జన్మలగ్న శుభా శుభ నిర్ణయములు 5) అస్పృశ్యత 6) బేసిక్ విద్య 7) కృష్ణస్తుతి 8) మహాకవి కొడవలూరి రామచంద్రరాజు కవిగారి జీవితచరిత్ర మొదలగు నవి వీరి మహానందీశ్వర శతకము నందలి మచ్చునకొక పద్యము.

మ॥ భవదీయాద్భుత శక్తిలెక్కఁడక గర్వాగ్రగంధియై దక్షుడా
సవ భూమిన్ ఘను వీరభద్రుని శితాస్త్ర వ్యూహఘాతంబులన్
దివిషద్బృందముజూచు చుండగదెగండే శీర్ష విచ్ఛేదడై
నవనీలోత్పల బాణ సంహర॰ మహానందీశ్వరా! శంకరా

# చిన్న రామరాజు కవి

వీరు 1-1-1911లో జన్మించిరి. వీరు తండ్రియొద్దనే విద్య నభ్యసించిరి 1) మహానందీశ్వర శతకము 2) కృష్ణశతకము 4) శంభోశత

తము 4) చిత్తబోధశతకము 5) ఆంజనేయితారావళి 6] విభీషణ పీఠి 7] ఈశ్వరస్తుతి 8] పితృస్తుతి 9) వెల్లి రామయ్య జీవిత చరిత్ర వీరు వ్రాసిరి వీరి రచనా వైఖరి కొక పద్యము చూతము.

ఉ॥ రాముని, భక్తకిల్బిష విరాముని, వైరి సమూహజైత్ర సం
గ్రాముని, భాస్కరాన్వయలలాముని, కోమల నీలనీరద
శ్యాముని, దివ్యధాముని, ప్రశంస యొనర్చు మిమ్ము నుతింపనౌ
నా' మదనాపహార! మహానందిపురీశ! గిరీశ' శంకరా'

ఇటీవలనే ఈ కవి కుమారుడు 5–6-1980వ తేదిని దివంగతుడయ్యె నని తెలసి విచారమైనది.

తండ్రిగారి రచనలన్నియు పెద్దకుమారుడైన శ్రీ పెద్దరామరాజు గారి వద్దగలవు కవిపోషకులు-మరుగుపడిన గ్రంథములను వెలికి దెచ్చు సదుద్దేశ్యముగల దాతలు. ప్రచురణకర్తలు, అకాడమీలు, పరిజావరిభుత్వము వారు ముందుకువచ్చి రాయలసీమ సాహిత్యరత్నములనబడు ఈ కవిగారి గ్రంథములను ప్రచురింపబూను కొనవచ్చును.

## శ్రీ కొట్టి పాటి గురువయ్య కవి

జననము' 1867 - మరణము 1927

తల్లి శ్రీమతి గుట్టమ్మ - తండ్రి చిన్న గురుమూర్త్యావారి

మతము కులము హిందూ-విశ్వబ్రాహ్మణులు-సానర్షిస గోత్రులు

జన్మస్థలము కడపజిల్లా. కొట్టిపాడు

కడప జిల్లాలోని కొట్టిపాడు ఒక పేరెన్నికగన్న సంస్థానము.

ఈ సంస్థానాధికారులైన శ్రీ కె. సీతారామరెడ్డిగారు, వారి కుమారులు మంచి సాహిత్యపోషకులు. వారొకసారి కాశీకాంబా వరప్రసాదులు మునలావారి పౌత్రులు, శేషాచార్యులవారి శిష్యులైన శ్రీ కొట్టిపాటి గురువయ్య కవి వరేణ్యులను పిలిపించి, యిట్లు కోరిరి.

కం॥ ప్రౌఢి పద్యరసాస్పదముగ
గృతిరచియింపంగవలయు గీర్తి చెలంగన్
క్షితి సప్తసంతతుల, ద
త్కృతియే శాశ్వతము మిగులగేవలమగుచున్

వారి ఆజ్ఞను శిరసావహించి కవిశేఖరులు 'సుద్యుమ్నరాజ చరిత్రము' లేక పురూరవోదయము అనబడు కావ్యమును తెనుగించి వ్రాసిరి.

వీరి కవిత్వము ప్రాచీన ప్రబంధశైలిని అనుసరించినది. అదే ఒరవడిలో సాగినది. పోతన రచనాపోకడలో సాగిన. ఈ దైవస్తుతి పద్య మిట్లున్నది.

ఉ॥ సారెకుభక్తి వేడెదను స్వర్ణనగప్రతిమాన గాత్రునిన్
వైరిలతాలవిత్రు పరభవ్యచరిత్రుని భక్తశేముషీ
సారస మిత్రునిన్ దనుజసంచయజైత్రుని గిల్బిషాటవీ
దారుణవీతిహోత్రుని బుధస్తుతిపాత్రుని వాయుపుత్రునిన్

వసుచరిత్రలో భట్టుమూర్తి ఎట్లు పురమందలి అన్నిజాతుల వారిని, వర్ణములవారిని వర్ణించిరో అట్లే వీరును వర్ణనలు సాగించిరి. ఈ క్రింది పద్యముకూడ భట్టుమూర్తి రచనాపోకడలలోనే నడచినది.

సీ॥ అమితాభి కాలాప శమితాభినవకోప
రమితాంగనాటోప రాజితములు

దతకుంజ సుమమధూద్ధత గుంజదళి వధూ
హితమంజురవ పృథూన్నతయుతములు
లీలాసరోభంగ డోలాచల రథాంగ
బాలాభినవసంగ భాస్వరములు
ఫలసూన భరచూత దళపీనపికజాత
వలమానమృదుగీత వలయితములు

తే॥ వితత మందానిలోద్గత విచికలాది
వాసనావాస దళ దిశావ్యాప్తి కలిత
శారికాకీర, కాకలీ, చకితపాంధ
పరసహృన్మథన కృదబ్జసాయకంపు
భాసురమ్ములు, మధుమాస వాసరములు.

తదుపరి సుద్యుమ్నమహారాజుగారి మృగయా వినోదవర్ణన సాగినది. ఈ వర్ణన తరిగొప్పుల మల్లనమంత్రి ప్రణీతంబైన 'చంద్రభాను చరిత్ర' లోని వర్ణనలను సరిపోలుచున్నవి

చెంచుదొర మహారాజుకడకు విచ్చేసి యిట్లు విన్నవించుకొన్నాడు.

కం॥ ఎలమిని జివ్వగులుఁ జిఱుత
పులు లేడులుఁ గాఱు దున్నపోతులు గురుపో
తులు, గబ్బుచెంక మెకములు
దెలి మెకములు, దాడిగట్టు తెఱగున నుండున్

కం॥ చెట్టులపట్టుల వట్టక
విట్టల మగుపిట్ట పిండు నెఱక లొలిచియున్
బెట్టిన మంటల జొటజొట
దొట్టిన క్రొవ్వెగపి కాఱుదొర ! పేరడవిన్

వేటకు వెళ్లిన సుద్యుమ్నుని ఒక దైత్యుడు అడ్డగించును. వానితో రాజు పోరాడును. ఆ యుద్ధవర్ణన కొంతసాగినది. యుద్ధమున వాడు కూలి నాడు. వాడు శాప ఫలితముగా ఆ రూపముదాల్చిన ఖచరవరుడు. దీనితో ప్రథమ, ద్వితీయాశ్వాసములు ముగియును. తృతీయాశ్వాసములోని ఒక పద్యము రాయలవారి ఆముక్తమాల్యదను జ్ఞప్తికి తెచ్చును.

రాక్షసబాధ మాన్పి తదనంతరము రాజు పరివారముతో వన విహార మునకేగెను. అది కుమార వనము. ఇట కవిగారు వనవిహార వర్ణనలకు దిగిరి. తరువాత సుద్యుమ్నమహారాజును పరివారముతోబాటు జలక్రీడలకు దించిరి. ఆ సరోవర మహిమ ఎట్టిదియోకాని, మునిగిన వారందరు ముదిత లైరి. వారయోమయముపాలైరి స్త్రీ జన్మకంటె, రాయిగానో, చెట్టుగానో, పుట్టగానో, మారివుండిన బాగుండెడిదని ఏగచిరి వారి వగపుతీర్చు వారెవరు?

ఇంతలో కొందరు కన్నియలు అటుగావచ్చి, వారి దుఃఖహేతువును కనుగొని, శివపార్వతులను ప్రార్థించుమనిరి.

ఆ మహిళామణియగు భూపతికి, నీలాదేవియను నామకరణము గావించబడెను. ఆ నీలాదేవి, తోడిచేడియలతో కలిసి వనవిహారము చేయ దొడగినది. ఆ వర్ణన యిట్లున్నది.

సీ॥ ఇమ్ములై వలిగాలికుమ్ములై పిట్టల
 సొమ్ములై, చక్కని కొమ్మలుండ
నిగ్గులై పొదరిండ్ల ముగ్గులై విరహుల
 కెగ్గులై యలరుల మొగ్గలుండ
బోవులై తేనియ బావులై తావుల
 తావులై, విచ్చిన పూవులుండ
ఉత్తలై వలికి సంపత్తులై పుప్పొళ్ళ
 తిత్తులై దిగుపూవు గుత్తులుండ

తే॥ నాకులయ్యెను మరునకు బాకులగుచు
జొకలు సెలంగ నీ చిగురాకులుండ
తరువులెల్లను మిగుల నెత్తురువులగుచు
బరువు తేటల గముల, తాదరువులయ్యె.

జలక్రీడలాడుచున్న నీలాదేవి సౌందర్యము నొకమునికుమారుడు చూచినాడు మోహించినాడు. ఆమెకూడా మోహించినది ఇక మదన తాపమున వీగవలెనుకదా! అదికూడ సాగినది రాయబారములు కూడ జరిగినవి. నీలాకన్య పరిచారిక అతనితో నిట్లన్నది.

ఉ॥ ఇంతులమేలుబంతి లలితేక్షుశరాసనుదంతి జాజిపూ
బంతి పడంతి సోయగపు బాటలదొంతి లతాంగనామణీ
స్వాంతము నిన్నెకోరినది యాపెకు నీకెతగు౯ మహాత్మకా
కంతు సమాన సుందరతగల్గిన వాడవు, ప్రౌఢ విద్ధర౯.

కథతోబాటు అన్నివర్ణనలు సహజముగా సరితూగునట్లు రచించుట కవిగారి రచనా ప్రౌఢిమకు తార్కాణము. అంధకారమును వర్ణించుచు ఈ చమత్కారమును కవిగారు చేసిరి.

సీ॥ . ........ .. .. ....
. .. ....... . ... . .. ...

తే॥ అస్త పాశ్చాత్య వర్తకుడబ్ధివీధి
వేల్పులను సాహుకారులు వెలకుగొనుట
కంగడిని బెట్టియమ్ము ముత్యమ్ములనగ
రిక్కగమి యొప్పెఁగాంతులు పిక్కటిల్ల.

ఇక సరేసరి చంద్రోదయవర్ణన-విరహతాపముతో చంద్రుని దూరుట-మన్మథునిపై ధ్వజమెత్తుట-మలయమారుత దూషణ-ఇవన్నియూ ప్రబంధ

కవులకు చెప్పవలసిన పనిలేదు. అతి చమత్కారముతో చెప్పుట వారికి వెన్నతో పెట్టిన విద్య గురువయ్యగారుకూడ అట్లే వ్రాసిరి.

పురుకు నీలాదేవికి వివాహమైనది. పురూరవుని జననముతో కావ్య మంతమైనది

ఇది ఐదు ఆశ్వాసముల కావ్యము. కవిగారి రచన, చక్కని, ధారా శుద్ధితో సాగినది. ఏ పద్యమునందును బింకము చెడలేదు తెనుగు సంస్కృతులు, సామెతలు, నటనట అలంకారప్రాయముగా నతికిరి. వీరికొక స్వతంత్రరచనాశైలి, భావనాపటిమ యున్నట్లు కావ్యము ద్వారా స్పష్టమగును ప్రాచీనప్రబంధ కవుల రచనలకేమాత్రమిది తీసిపోదు. ఈ కవిగారేడిగ్రీ లను పొందినవారు కాదు పెద్దగా చదువుకొన్నవారు కాదు. ఇంతటి కవితా చాతురి వీరికి కాళికాంబ వరప్రసాదముచేతనే కల్గిన దనుటలో సందేహము లేదు.

శ్రీ గురువయ్య కవిగారిది సామాన్య కుటుంబమేకాని, పండిత వంశముకాదు. వీరి యితర కృతులు (1) రావణాంజనేయ సంవాదము. (2) నామకరణ చేయని ఒక శతకము ప్రసిద్ధి కవులందరు రాయలసీమకు కీర్తి ప్రతిష్ఠలను తెచ్చిపెట్టి రనుటలో అతిశయోక్తి లేదు

# ప్రబోధకవులు

## శ్రీ ఆర్య నారాయణమూర్తి

తల్లి — శ్రీమతి నారమ్మ
తండ్రి — శ్రీ గురుమూర్తి

జననము - 1866 నిర్యాణము - తెలియదు
మతము. కులము - హిందూ - క్షత్రియకులము
జన్మస్థలము - కుందుర్పి -కల్యాణదుర్గం తా॥ అనంతపురం జిల్లా.

కొందరు కవులు తమ రచనా వ్యాసంగమును సంఘశ్రేయస్సుకు, సంస్కరణకు, ప్రబోధమునకు, వినియోగించి ధన్యులైరి వేమనకవి ఎంతటిసంఘసంస్కరణాభిలాషియో,మనకుతెలియనిదికాదు.కీ॥ శే॥వీరేశలింగం పంతులుగారు తమ రచనలద్వారా సంఘమును ప్రబోధించలేదా! గురుజాడ దేశభక్తిని తమగేయములద్వారా రేకెత్తించలేదా! కవులు సంఘసేవకులవి, వేరుగా చెప్పవలసిన పనిలేదు. వారు విట్టి విట్టి సంఘ సంస్కరణలను, కూడ ప్రవేశ పెట్టినవారే. రాజకీయ నాయకులవలె వారు సంఘదురాచార నిర్మూలనకు నడుము కట్టినవారే. కీ॥ శే॥ పప్పూరి రామాచార్యుల వంటి వారి పదును కలములు సాహిత్యరంగమందేకాక సంఘ పురోభివృద్ధి, జాతి మనుగడ, జీవహింసా సిద్ధాంతము. మానవసేవ, మున్నగు అనేకరంగము లందు చిందులు వేసినవి. వారి రచనలను స్థానిక పత్రికలలో ప్రకటించిరి. పత్రికలు లేని తావులందు తామే స్వయముగా పత్రికలు నడిపిరి తామెంత దుర్భర దుస్థితియందున్నను సంసారజీవయాత్ర సాగుటకెంత క్లిష్టపరిస్థితు లేర్పడినను, వారు మనోధైర్యము వీడక సమిష్టి సమాజ వికాసమునకై అహోరాత్రులు కృషిచేసిన ప్రబోధకవులు వారిలో కొందరు. శ్రీ ఆర్య నారాయణమూర్తి, ఎల్లమరాజు నారాయణభట్టు, కిడాంబి రాఘవాచార్యులు, అభయార్థి నంజుండప్పగార్లు ముఖ్యులు. వారిలో శ్రీ ఆర్యనారాయణమూర్తి ప్రథములు.

శ్రీ ఆర్యనారాయణమూర్తిగారు భట్టువంశమునకు చెందిన, మధ్యమ తరగతికి చెందినవారు వీరు ముగ్గురన్నదమ్ములు ఇతడు మధ్యముడు. 12వ ఏటనే, మూర్తిగారు తండ్రిని కోల్పోయిరి. అన్నగారి పోషణలో విద్యాభ్యాసము కొనసాగించిరి తరువాత తోడిపిల్లలతోకలసి రాష్ట్రాంతరము వెళ్ళి, అక్కడ శ్రమపడి చదివి, 1886 వ సంవత్సరములో ఉపాధ్యాయ వృత్తియందు ప్రవేశించిరి.

తరువాత గృహమునందేర్పడిన కొన్ని చికాకుల ఫలితముగా వారికి విరక్తి జనించి, ఉపాధ్యాయ వృత్తిని విడనాడిమరల రాష్ట్రాంతరమువెళ్ళిరి.

అచ్చట వారికి సాధు సజ్జనుల సాంగత్యము లభించెను. బళ్లారిలో 'దివ్యజ్ఞాన సమాజము'లో చేరి (Theosophical Society) కొంతకాలము నకు బోధకులైరి. కొంతకాలము గడచెను. దివ్యజ్ఞాన సమాజమువారు నాస్తికులని గ్రహించిరి. సమాజమును విడిచిరి.

స్వగ్రామము చేరుకొని, 'విజ్ఞాన వర్ధని' యను మాసపత్రికను స్థాపించిరి. కొన్ని సంవత్సరముల తర్వాత పత్రిక ఆగి పోయెను.

మరల శ్రీ మూర్తిగారు మనశ్శాంతికై, ఉత్తరదేశయాత్ర సాగించిరి. బొంబాయి, పూనా మొదలైన పట్టణములను దర్శించిరి. వారి అభిరుచి కాంగ్రెసు సంస్థవైపు మరలి ఆ సంస్థలో ప్రవేశించిరి.

హిందీభాషను చక్కగా అభ్యసించిరి. అనేక విద్వాంసులను సందర్శించి, వారి ఉపన్యాస, శాస్త్ర గోష్ఠుల యందు పాల్గొని, జ్ఞాన సంపన్నులైరి. సాధు సజ్జన సహవాసము వల్ల పరిణతి జెందిరి. సనాతన ధర్మములను, సంఘ సిద్ధాంతములను గ్రహించిరి మరల స్వగ్రామము చేరుకొనిరి. కల్యాణదుర్గములో 'ఆర్యక్షత్రియ మహాసభ'ను స్థాపించి, కొంతకాలము నడిపిరి

తరువాత గృహస్థులైరి. గృహస్థజీవనము నడపుటకై, వారు మరల ఉపాధ్యాయవృత్తిని, స్వీకరించక తప్పలేదు

వీరి, 40వ, సంవత్సరము వయస్సునకు, సంసారము పెరిగెను. ఇద్దరు కుమార్తెలు, ఒక కుమారుడు కలిగిరి. కుమార్తెలు (1) శ్రీమతి దేవమ్మ (2) శ్రీమతి సుభద్రమ్మ (3) శ్రీ భానుమూర్తి (కుమారుడు)

స్వగ్రామమైన కుందుర్పి విడిచి 1905లో వీరు కుటుంబ సమేతులై హిందూపురము చేరుకొనిరి. స్వగృహము సంపాదించిరి. 1911వ సంవత్సరములో వీరికి భార్యావియోగము సంభవించెను. మూర్తిగారు చాలాపట్టుదల

గలవారు. గాన, తాముస్థాపించిన 'ఆర్యక్షత్రియ సమాజము' లో నైకమత్యమును పెంపొటకై తమ సమాజములోని, భిన్నభిన్నశాఖల నొక్కటిగా చేర్చుటకు, విశేష ప్రయత్నము లొనరించిరి తన పెద్ద కుమార్తెను సికిందరాబాదు లోని 'శుకదేవవర్మ' యను నొక క్షత్రియ కుమారునకిచ్చి పెండ్లి చేసిరి. రెండవ కుమార్తె కాలధర్మమొందెను.

శ్రీ మూర్తిగారు, అనేక వైదికాంధ్ర గ్రంథములు రచించిరి. హైస్కూలులో పండితులుగా పనిచేసిరి.

— వీరు వ్రాసిన గ్రంథములు —

1) ఈశ్వర రహస్యసారము, 2) ఫలిత జ్యోతిష ఖండనము, 3) భారత సూర్యోదయము. 4) తత్త్వజ్ఞానము 5) స్వాత్మనిరీక్షణము 6) మత, మతాంతర, మహాసభ 7) భక్తి ప్రార్థనోపాసనము 8) అగ్ని హోత్రలాభము 9) మనుష్య జీవనము, 10) వైవాహిక ప్రహసనము 11) ప్రశ్నార్ణవము 12) న్యాయ దర్శన పరిచయము, 13) కలిదర్బారు ప్రహసనము 14) మరణ దుఃఖ నివారణము 15) స్వర్గీయ మహాసభ (పురాణ సమీక్ష)

వైదిక ధర్మవిరోధులు కొందఱు వీరి గ్రంథములను ఖండించుటకు బయలుదేరిరి. వారి వ్రాతలనెల్ల, ప్రతిఖండనము చేయుచు, వ్యాసములను వ్రాసి 'వర్తమాన పత్రిక' (అప్పటి పత్రిక) లో ప్రచురించిరి ఆంధ్రదేశ మంతట, వైదిక ధర్మప్రచార మొనరించిరి. అచ్చటచ్చట ఆర్యసమాజము లను స్థాపించిరి.

తుదకు, సంసార తాపత్రయములలో చిక్కి, మనసు విసుగెత్తి జీవితాంతదశలో గృహస్థజీవితమును చాలించి, తృతీయాశ్రమమున దివ్య లోక ప్రాప్తినొందిరి

# శ్రీమాన్ కిడాంబి శ్రీనివాస రాఘవాచార్యులు

జననము : 1899 నిర్యాణము : 1974 ప్రాంత్యము

తండ్రి:- శ్రీమాన్ గోపాలాచార్యులు తల్లి : రాగాంబ

జన్మస్థలము : కడప జిల్లా, మతము, కులము:- హిందూ-బ్రాహ్మణ

ధన్నవాడ కుటుంబము-శ్రీవైష్ణవులు

శ్రీ కిడాంబి శ్రీనివాసరాఘవాచార్యుల వారు తమ చిన్ననాటి విద్యాభ్యాసమును కడప పట్టణములో సాగించిరి. 1943 నుండి 1940 వరకు వీరు కడప హైస్కూలు నందు సంస్కృత అధ్యాపకులుగా పనిచేసిరి. తరువాత అనంతపురం జిల్లా బుక్కరాయసముద్ర గ్రామమున చేనేత కార్మికులకు ప్రౌఢశిక్షణ నొసంగి, సుమారు 20-25 మందిని 8వ తరగతిలో ఉత్తీర్ణులు గావించిరి.

తదుపరి మహాత్మాగాంధీగారి ఆదర్శాలను పాటించిరి. బ్రాహ్మణ కులమున పుట్టిన రాఘవాచార్యులవారు మాల, మాదిగలకు సేవచేయుటకు కంకణము గట్టిరి. హరిజన బాలబాలికలకు ఎట్టి రుసుము తీసుకొనక వారికి భోజనాది సౌకర్యములు కూడ కలిగించి, విద్యను బోధించుచుండిరి. అప్పటి స్థితిలో ఆచార్యులవారు సంఘమున కొక పెద్ద సవాలుగా నిలబడిరి. ఆనాడు ఆచార్యులవారిచ్చిన చేయూతతో ఒక మహమ్మదీయుడు బాగుగా చదువుకొని సుశిక్షితుడై గొప్ప అధికారియగుటయే గొప్ప ఉదాహరణము.

స్వతంత్ర సమరయోధులైన కీ॥ శే॥ పద్మశ్రీ కల్లూరు సుబ్బారావు గారు, కీ॥ శే॥ పప్పూరి రామాచార్యులవారు, ప్రస్తుత రాష్ట్రపతి నీలం సంజీవరెడ్డిగారితో కలిసి స్వతంత్రమునకై పోరాడిరి. వీరి సంఘ సేవాకార్య క్రమములలో ఎన్నదగినది స్త్రీ విద్య. సంఘములో స్త్రీలు చదువుతోబాటు అన్నిరంగములందును ఆరితేరవలె ననెడి దృఢ సంకల్పము కలిగినవారు.

ఆతని బంధుమిత్రులు ఈ విషయముగా ప్రబల విరోధులైరి కాని ఆయన పట్టువీడక తన కుటుంబములోనే ఆ ప్రయత్నము చేసి సాధించిరి వారికృషి ఫలితంగానే వారి నలుగురు కుమార్తెలు విద్యలో రాణించిరి వీరి ప్రథమ పుత్రిక జయలక్ష్మి వైద్యవృత్తి ఐ. యం యస్ మేజర్, వీరి రెండవ పుత్రిక శ్రీమతి జానకి, సంగీతాధ్యాపకురాలు వీరి మూడవ పుత్రిక శారద యం ఎ డి. యల్ యస్ లెక్చరర్, ఘోరక్‌పూరు విశ్వవిద్యాలయములో ఉన్నారు నాల్గవ కుమార్తె శ్రీనివాస శాంత, యం ఏ పి హెచ్ డి లెక్చరర్-బెనారస్ హిందూ యూనివర్సిటీ, వారణాసి. వీరి కుమారుడు శ్రీ గోపాలాచార్యులు యం. ఏ లెక్చరర్, అనంతపురం సత్యసాయి స్త్రీల కళాశాలలో పనిచేయు చున్నారు

ఆచార్యులవారు సంఘ సేవాపరాయణులేకాక, ప్రబోధకవులు కూడ. తమకున్న కవితాశక్తితో మానవాళిని ప్రబోధించు కొన్ని 'మిత్రగీతము' లను తెనుగున వ్రాసిరి. శ్రీ లక్ష్మీనక్షత్రమాల, రంగదామీయము, శబరవిప్రః, పరాభక్తి ఇయ్యవి వీరి సంస్కృత ఖండకావ్యములు.

ఈ కవిగారి విషయమై కీ॥ శే॥ కవిరాజు కలుగోడు అశ్వత్థరావు గారు వ్రాసి పంపిన విషయము లిందు పొందుపరచు చున్నాను.

" . .. తొలుత సంపదలతో దులదూగి, విపరీత విధివిలాసముచే విడివడి, జ్ఞానజిజ్ఞాసులై, ఏకాంతముగ లోకమునకు మఱుగుపడిన ఒక అజ్ఞాత కవిని పరిచయము చేయుచు, అతని హృదయపేటిక నుండి ఎప్పుడో వెలిదీసిన ప్రాతకాగితముల పొట్లము లో, మూతవడియు మిలమిల లాడుచుండిన మణులు నాకంట బడినవానిలో కొన్నింటి నిందువెంట బంపు కొంటిని. వాటిని రాయలసీమ రచయితల చరిత్రలో చేర్చుకొని, ఒరవెట్టి విలువగట్టి లోకముదృష్టికి బట్టింతురుగాక!"

ఆ మిత్ర గీతములందలి ప్రబోధమిట్లున్నది.

గీ॥ నీవె శ్రీరాముడవు; సీత నీదు సతియె
ఒక్కతలరావణుల్ పద్గురుందు రిపుడు;
వినవె 'ఆమిషవత్కాంత' యనగ బుధులు ?
కాలదోషంబు లేదె ? జాగ్రత్త సుమ్ము.

గీ॥ సర్వ విజయసిద్ధికి నాత్మశక్తి వలయు;
బ్రహ్మ చర్యమ్ము నందది వఱలు చుండు;
నాకు నందనిపండు కొనంగఁ జాల
కొంగు బంగారమా నీకు, కొనగఁబూను.

గీ॥ అఖిల లోకాలు వాని నేత్రాబ్జములకు
కరతలామలకంబులై గానిపించు,
అతని శ్రవణ విపంచిపై ననుదినమ్ము
మేళవించు భువనగీతి వేళకన్య.

గీ॥ రామ నీతివాక్యాల స్వార్థమ్ము లేదె ?
ఇంద్ర సుతుతోడ ఆచెల్మి యితనికేల ?
వాలిఁ గూలిచి, కృష్ణుడై కోఁ మడిసె;
పాపఫలము దప్పునె ? యెంత వారికైన ?

గీ॥ దివికి నేగి సుఖింతువా ? దేబకావె ?
పలుమరిందేల మనసెట్లు వచ్చునీకు ?
మీసమున్నచో నాస్వర్గ మందెగూర్చు,
భువికిఁదేదె మందాకిని పూర్వమొకడు ?

ఈ విధమైన ప్రబోధములను ఆచార్యులవారు తమ మిత్రగీతము లందు గావించిరి సామాజిక విషయములను ధార్మికరీతిలో మేళవించి, సునిశితమైన మందలింపుతో నర్మగర్భముగా వ్రాసిరి.

వీరు నిరాడంబరులు. తానొక సామాన్య వ్యక్తిగా జీవించి, నలుగురిని ఉన్నతస్థితికి దెచ్చిన మహనీయులు. ఇట్టివారు అరుదుగా కనిపింతురు వీరికి ప్రచారమక్కరలేదు తామనుకొన్న కార్యమును సాధించవలెననెడి గట్టి తలంపుతప్ప, పేరు ప్రతిష్ఠలకు పాకులాడినవారు కారు. మానవసేవే మాధవసేవగా తలచిన మహనీయులు వీరు.

# కర్షక కవులు

వ్యవసాయమే ప్రధానముగా గల భారతదేశ వాసులందరు రైతులే, కర్షకవృత్తిలో తాము పొట్టపోసుకొనుటేగాక పదుగురి పొట్టలు నింపుపుణ్యజీవులు వీరు "హాలికులైననేమి ? గహనాంతరసీమల కందమూల కౌద్దాలికులైన నేమి ? నిజదార సుతోదర పోషణార్థమై" అని శ్రీబమ్మెరపోతన్న నుడువ లేదా ?

రాయలసీమ దుర్భరక్షామప్రాంతము నీటి ఎద్దడి అధికము. కొండ గుట్టలతో కూడుకొన్నది. సారవంతప్రదేశము తక్కువ. జలాధారాలు లేవు. ఇట్టి కటువు కాటక ప్రదేశములలో కష్టించు రైతుకు తుదకు కన్నీరే మిగులు చున్నది.

ఈ దుర్భర క్షామము ననుభవించు రైతు కవియైనప్పుడతని కవితలో ఆదృశ్యములు తప్పక ప్రతిబింబింపగలవు. ఆకవి పాఠకులకు ఎండిన బీళ్ళను, బక్కచిక్కిన బడుగు పశువులను, దీనార్తులను గోచరింపజేయ గలడు. కాపు కులము నందుపుట్టిన ఇట్టికవులు మన రాయలసీమలో నెందరో వున్నారు. వారిలో శ్రీ భైరవరెడ్డి రెడ్డి నారాయణరెడ్డి - శ్రీ గొట్టిపాటి సుబ్బరాయుడు - శ్రీ పాలా వేంకటసుబ్బయ్య-శ్రీ కోగిర జయ సీతారామ రెడ్డి-శ్రీరాప్తాటి ఓబిరెడ్డి శ్రీ వేదాంతం నరసింహారెడ్డి మొదలైన వారున్నారు. వారినిగూర్చి పరిచయము చేయుటెంతైనా అవసరము.

# శ్రీ భైరపురెడ్డి రెడ్డి నారాయణరెడ్డి



తల్లి : శ్రీమతి నాగమ్మ

తండ్రి : శ్రీ వేంకటరెడ్డి

జననము : 2-2-1923

ర్యాణము: 1979 జూన్

మతము, కులము:హిందూ-రెడ్డికులము

జన్మస్థలము:- రాయవరము - రాయచోటి తాలూక. కడప జిల్లా.

కలమునకు హలమునకు సమాన ప్రాధాన్యత నిచ్చిన కవులు మన కరుదుగా నున్నారు. వారిలో శ్రీ భైరపురెడ్డి రెడ్డి నారాయణరెడ్డి ఒకరు. కడపమండల మందలి మడితాడు. గ్రామమునకు చెందిన రెడ్డివారిపల్లెలో వీరుజన్మించిన కృషీవలులు. నాలుగైదేండ్ల ప్రాయమున అల్లరిపిల్లవాడుగా తిరుగుచుండిన యీతని, యితని తండ్రి ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయు నింట విడిచి చదువు నేర్పించిరి ఆతనికైదవ తరగతి వరకు మాత్రమే చదువబ్బినది. చిన్ననాటి నుండియు పుస్తకములు చదువుట యందాసక్తి కనబరచు చుండుటచే కాపుబిడ్డడు కవి కాగలిగినాడు.

కవిశేఖరుల ధర్మపత్ని శ్రీమతి భాగ్యలక్ష్మి, అకాలమరణము చెందినది. ఆ విషాద సంఘటనతో ఆతని హృదయము ద్రవించినది. 'క్రౌంచ మిథున మరణముతో వాల్మీకి హృదయము గాయమై రామాయణ కావ్యమైనట్లు' వీరి మనోభావములు 'తలపోతలు'గా అవతరించినది.

కవిగారు ఆస్తికులు. భగవంతుని సంపూర్ణముగా నమ్మినవారు. దైవభక్తి పరాయణులు. వారి స్వగ్రామమునకు దగ్గరగాగల బాహుదా నదీ సమీపమునగల సంగమేశ్వరాలయమునకు వారు ధర్మకర్తలుగా వ్యవహ

రించిరి. ఆ స్వామియెడ కవిగారికిగల భక్తిప్రపత్తులకు నిదర్శనమేవారి 'సంగమేశ్వర శతకము.

హైమ నగాధివాసమున నద్రి హిమాంబువు లాని దేహ మే
సామయోగాని చిత్తమల చండశిలాకృతి పీడలేక యా
కాముని కంటిమంటలను గాల్చితివా ! సతిగూర్చు తప్పునన్
హైమవతీ పతీ! యురగహార! నటేశ్వర! సంగమేశ్వరా !

పై విధముగా కవిగారు తమ సంగమేశ్వర శతకమున చమత్కరించిరి.

రెడ్డిగారి మూడవ పంట, 'రాయలసీమ రైతు' వీరి రచనలపైకిది మేల్బంతి ఇందు కవి సజీవుడైనాడు. రాయలసీమ రైతుగా తాను నిలిచినాడు అతని కన్నీటికి గలకారణములను కవితలో వివిపించినాడు కఱవు రాయలసీమ వాసులకు తోబుట్టువు పెట్టిన పైరు లెదిగిరాక, మెట్టభూముల లోనే గుట్టుగా నెండిపోవు విషాద సంఘటనలు రాయలసీమ రైతుల కేటేట అనుభవైక వేద్యమే అందుకే కవిగారిట్లనిరి.

మూడు జగముల మేఘుండు మోపనీక
తొలగ దోలిన ?అవెందు మెలగలేక
దత్తమండల మంచు తానెత్తుపడియె
గాక యుండిన యిట్లేల కలతవెట్టు!

నిజమే. ఈ ప్రశ్న ఆలోచింపదగినదే. పూర్వమీ సీమను శ్రీకృష్ణ రాయలు పాలించినప్పుడు సహితము యిట్లే వుండెనా ? లేదుకదా !

"రాసులై రాజిల్లు రత్నాల నమ్ముచు
బుచ్చులు సంగళ్ల బరగు చుండ
... . .. . .. . . ...
.... .... ... ... ... .... ... .... ... .... ....

తే॥ తెలకు ముమ్మారు వర్షముల్ నిలిచి కురియ
కాపు కోసిన ధాన్యముల్ గాంచెధరణి
జనుల కారోగ్య భాగ్యముల్ సెనఘు దివ్య
సీమ శ్రీకృష్ణ రాయల సీమ యొప్పె.

అదియేమి దౌర్భాగ్యమో, అదనులో వానలురాక, పంటలుపండక కఱవను కొని తెమ్చుకొన్నట్లుగా ఈ సీమలో తాండవించినది. 1972వ సం॥ లో వచ్చిన కఱవును కవిగారు ప్రత్యక్షముగా చూచి ఇందు వర్ణించినారు. ఆవర్ణనలు చదువరికంట కన్నీటిని గార్చును. కడుపున మంట పుట్టించును. వ్యవసాయ కూలీలకు పనులులేవు. పశువులకు పచ్చిగడ్డిలేదు దప్పి దీర్చు కొనుటకు నీటిచుక్క లేదు. ఆ మూగజీవుల బాధను కవిగారిట్లు పాడిరి.

కసవు పొసగదు; నీరైన నొసగలేక
మేప నడవికి తోలిన గోపవరుల
కనుగొలంకుల జొచ్చిన కరుణజలము
గ్రోలగను జూచినట్లుండె గోచయంబు

ఇదొక అద్భుతభావన. ఈ దృశ్యమును అనుభవ పూర్వకముగా కవిగారు చెప్పిరి.

వీరి కవిత్వము పూర్వాంధ్రకవుల కవిత్వమునకేమాత్రము తీసిపోదు. చదివిన చదువునకు వ్రాయు కవిత్వమునకు హస్తి మశకాంతరమున్నది. లేకున్న కీ॥ శే॥ విశ్వనాథ సత్యనారాయణ గారంతటివారు రెడ్డిగారిని పొగడుచు, ఇట్లు వ్రాసెదరా?

"ఒక మంచి కవిని పొగడుట నాకిష్టముగానుండదు. అభిప్రాయము వ్రాయుట కసలిష్టముండదు. అభిప్రాయము అల్పకవుల గ్రంథముల మీద వ్రాయవలయును. గొప్పకవుల గ్రంథములు, విద్వాంసులు భావుకులుచదివి

అనందింపదగినవి కాలము దుష్టమై విద్వాంసుల భావుకులయొక్క సంఖ్య తక్కువై అభిప్రాయములమీద నాధారపడవలసిన పరితల సంఖ్య అధికమై నేడీదేశమునకీ దుర్భాగము పట్టినది. ఇంత చక్కని రచన చేయు కవులీ ప్రాంతమునందు రెడ్లలోనుండగా అల్పప్రతిభావంతులు అల్పసాహిత్య పరులు పైకి వచ్చుట నాకు బాగుగా కనిపించలేదు. ... .... ... .
ఈయన గ్రంధమున కొకని యభిప్రాయ మెందులకో నాకు తెలియుటలేదు. వీరికి రాదగిన కీర్తి పరమేశ్వరుడు తెచ్చునుగాక!"

ఇంతకంటెను కావలసినదేమి ? ఇంతటి గొప్పపొగడ్త ఊరకనే వచ్చునా ? అది కవిగారి పూర్వ పుణ్యవిశేషమే. సుగుణసంపన్నులు-నిరాడంబరులు-ఉత్తమ భారతీయ సంస్కారులు-దేశభక్తి. ధర్మపరాయణత్వము ఆస్తికత్వముగల ఈకర్షక కవిశేఖరులు పోతనకు సమానులే.

విధివైపరీత్యమెట్టిదోగాని ఇట్టివారిని భగవంతుడు భూమిపై నూరేండ్లునిండుగా బ్రతకనివ్వడు.

"తొల్లిటి జన్మమందు నిను దుర్లభుగాగ దలంచి వేడకే
నొల్లక దేహధారినయి యుర్విజనించిన యార్తిబాయగా
నెల్లపుడున్ దలంతునిక యేర్పడజూచియు మోక్షభిక్షరా
గిల్లగనిమ్ము కోరనిక నేమియు నిమ్మని, సంగమేశ్వరా!"

వారి కోరిక మేరకే శివుడువారికి మోక్షమునిచ్చి త్వరగా మననుండి దూరము చేసినాడు. వారికివే మన శ్రద్ధాంజలులు.



మధురకవి

# శ్రీ పాలా వేంకటసుబ్బయ్య

జననము 11-11-1913

జన్మస్థలము రైల్వే కోడూరు - కడప జిల్లా
మతము, కులము - హిందూ - హరిజన.

మధురకవిగా పేరుపొందిన శ్రీ పాలా వేంకటసుబ్బయ్యగారిని గూర్చి కడప మండలములో తెలియని వారుండరు. శ్రీ సుబ్బయ్యగారు సాహితీక్షేత్ర కర్షక కవులే కాదు, ప్రజాసేవకులు కూడా. 1951 లో వీరు మద్రాసు శాసనసభకు ఎన్నికై 10 సంవత్సరములు శాసనసభ్యులుగా పని చేసిరి. తదుపరి వీరిసాహితీ గురువులుగా శ్రీ వేదం వేంకటకృష్ణశర్మగారు భాసిల్లిరి. ప్రభుత్వ సహకారశాఖలో కొన్నినాళ్లు ఉద్యోగము చేసిరి.

శ్రీ సుబ్బయ్యగారు నిరంతర అధ్యయనశాలురు. చిన్నతనమునందే శతకములను వ్రాయుచుండిరి. శ్రీ వేదం వేంకటకృష్ణశర్మగారి వద్ద కవితా రహస్యముల నెన్నింటినో తెలుసుకొనిరి వీరి గురువరేణ్యులు వీరిని గూర్చి ఇట్లు వ్రాసిరి.

"చిరంజీవి పాలా వెంకటసుబ్బయ్య నా శిష్యుడు. నావద్ద చదువు కొన్నాడు అట్టియెడ, విద్యా సముపార్జనయందు చొరవ చూపు చుండిన కొలది మంది విద్యార్థులలో, నీతదగ్రగణ్యుడు నామట్టునకు నాతని విశేషము, గ్రహణాసక్తి, జ్ఞాన సంపాదనాభిరుచి గాంచి మున్ముందీతడు, పేరు పెంపులతో ప్రకాశింపగలడని యువ్విళ్ళూరు చుండెడివాడను. ఈతని ధారణాశక్తి అనుపమానము. పూవుపుట్టగనే దాని పరిమళము నలుదెసల వ్యాపించునుగదా!"

వీరు సాహితీక్షేత్రమున, పండించని ఫలవృక్షములు లేవు. లెక్కించినచో వీరి రచనలు కడప మండలమందలి ఫలవృక్షములకు మించినవనియే, చెప్పవచ్చును. వీరి రచనలలో నలుబదికిపైగా పద్యకావ్యములు, పదిగద్య

కృతులు, ఎనిమిది నవలలు, నాలుగునాటకములు, రెండు కథాసంపుటములు, మరెన్నియో ఖండికలున్నవి వీరి కృతులన్నియు మేల్బంతులే. ద్రాక్షా పాకములే.

ఈ కవిగారు పాశ్చాత్య సాహిత్య వినువీధులందు సహితము విహ రించి కొన్ని ఆంగ్ల కృతులను కూడా చక్కగా రచించిరి. సంస్కృతభాషను చక్కగానేర్చి కాళిదాసు 'శాకుంతలము'ను గంగాదేవి రచించిన 'మధురా విజయము'ను తెలుగులోని కనువదించి, తమ ఉభయ భాషాపాండిత్యమును చాటిరి. వీరి రచనలను పరిశీలించినపుడు వీరి హృదయమెంత, సున్నిత మైనదో మన కవగతముకాగలదు. వీరి భావనలు సహితము మహోన్నతము లనియే చెప్పవచ్చును.

కఱవుకాటక ప్రాంతమైన రాయలసీమకు వర్షమిమ్మని కథానాయిక యైన భూదేవి కథానాయకుడగు మేఘునకు వర్తమానమును పంపినది. ఆ వార్తాహరుడు వాయుదేవుడు. ప్రకృతి సిద్ధముగా, మేఘములు చల్లని గాలి తాకిడుల వల్లనే వర్షించు చున్నవి. మేఘుని వర్షమువల్లనే భూదేవి హర్షించు చున్నది. నిండు జవ్వనివలె శోభిల్లుచున్నది. ఈ అద్భుతమైన భావన కవిగారి హృదయమున తళుక్కున మెఱసి 'అనిల సందేశ' మనుకావ్యముగా అవతరిం చినది. భార్య భూదేవి, భర్త మేఘున కిట్లు సందేశము అనిలుని ద్వారా పంపు చున్నది.

సీ॥ కోటానుకోట్లు నీకొమరులు నిలువున
గూలిపోయిరనుమ, కూడులేక,
లక్షోప లక్షలు భిక్షాధికారులై
దుఃఖాన గుములుచుఁ దూలిరనుమ,
వేలకువేలు వస్త్రాలకు హీనులై
చింపి పాఁతలనె కైసేసి రనుమ,
పచ్చని వల్వ విప్పచ్చరంబున నీదు
దయితయు మాలిన్య ధామయనుమ,

తే॥గీ॥ నిలిచి కనువిచ్చి యొకమారు నిండుకూర్మిఁ
జూడఁదలపెట్టి ప్రేమంపుఁ జుట్టమవయి
సత్వరంబుగ రాకున్న సర్వసృష్టి
కాలసర్పవిషజ్వాలఁ గ్రాగు ననుమ!

ఈ 'అనిల సందేశము' క్షామ పాత్రమునకు దర్పణము పట్టిన ఒక దృశ్యకావ్యమనియే చెప్ప వచ్చును. తదుపరి వీరి ఖండకావ్యమగు "మన రైతు" నందుకూడ రైతు కష్టములను ప్రభుత్వము రైతునకు తలపెట్టిన సహాయ సహకార పథకములను, వాటి నుపయోగించు కొనవలసిన విధాన ములను వివరముగా ఇందు చొప్పించిరి. సహకార సంఘములు రైతుల పాలిటి కల్పవృక్షములుగా కవిగారిట్లు వర్ణించిరి.

ఉ॥ క్షామముఁబారదోలు, ధనకాంక్షఁగృషీవళులన్ విపత్తునన్
బాయెడు వడ్డి వర్తకులఁ బ్రక్కకుదోలు, విచారభూతమౌ
లేమిడి నుక్కడంచు, పరుదీకొనజాలు ధనంబునిచ్చు, ఘో
రాముల పోరుమాన్పు నవురా! సహకారము మించదేదిలన్

ప్రజాసేవకులుగా పేరు తెచ్చుకొనిన ఈ కవివరేణ్యులకు ప్రజల యెడనే కాక ప్రజానాయకుల యెడను అమిత గౌరవ భావములున్నవి. భారత స్వాతంత్ర్య సముపార్జనకు ప్రాణము లొడ్డిన మహాత్మునియెడ వీరి కమిత మైన భక్తి విశ్వాసములు కలవు. వారు గాంధిజీ మరణానంతరము వ్రాసిన పద్యములలో మచ్చున కొక్కటిందు ఉదహరించబడినది. వారి పరితాప మెట్లున్నదో చూడుడు.

సీ॥ సంసార సుఖముల — సర్వంబు విడనాడి
మానవసేవకై — మనియె నెవరు?
మృష్టాన్నములువీడి — మేకపాలు, ఫలాలు
కృషికుల కొఱకు భక్షించె నెవరు?

ఒలునిండ వస్త్రంబు — గలుగని వాడయి
పేదల కొఱకు జీవించె నెవరు ?
ఆస్తిపాస్తులు లేక — నందందు భిక్షంబు
హరిజన నిధికిగా — నడిగె నెవరు ?

గీ॥ విధివిరామము లేకఁ గా — వించికృషిని
దాస్యయోచనమును గొన్న - దక్షులెవరు ?
అట్టి జాతీయపిత దివి కరిగె మనల
దుఃఖసాగర మందున — ద్రోసికడకు

వీరి చారిత్రాత్మక కావ్యములలో "భాగ్యమతి", 'విజయ వివేకానందము' బహుళ ప్రచారము ఆదరణ పొందిన గ్రంధరాజములు. భాగ్యనగర నిర్మాణ కథావస్తువితి వృత్తముగా గలది, 'భాగ్యమతి' కావ్యము. 'గోలకొండ' యువరాజు ఒక సాధారణ నర్తకిని ప్రేమించుట, అది సహించని నవాబతనిని కోటలో బంధించుట, ఒకనాటి అర్ధరాత్రి సమయమున వరదతో పొంగి పొరలుచున్న మూసీనదిని ఎవరికినీ తెలియక దాటి ఆవలి గట్టున గల తనప్రియురాలిని యువరాజు కలుసుకొనుట, ఇందు మనోజ్ఞముగా వర్ణింపబడినది.

తదుపరి వీరి 'విజయ వివేకానందము' ఎన్నదగిన ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధ కావ్యము. 'ఇందలి పద్యములు సానలుదీరిన జాతిరత్నముల వంటివి ఇందెక్కడగాని చెత్తపదములు, ఊతకట్లు, బెండు ముక్కలు వ్యర్థ దీర్ఘ సమాసములు కాగడా పెట్టి వెతకినను కానరావు. కథ చారిత్రాత్మక మగుటచే అనవసరమగు ఉత్ప్రేక్షలులేవు. ఈ కావ్యము చిరంతరానందస్వామి, విరచిత గద్యకావ్యమునకు పద్యకృతి. ఈ కథను వ్రాయుటలో కవిగారి అభిప్రాయ మిట్లున్నది.

తే॥ కాళరాత్రికి చంద్రుని - కాంతికరణి
వాడు తీవకు వర్షసం - పాత మట్లు
ధర్మమడుగంట — ప్రజలకు — ధర్మమిడగ
నమృత తుల్యంబు గాదె నీ — యమలగాధ.

ఈ దివ్యగాధ భారతీయులకేగాదు, మానవాళికే అమృతతుల్యము. ఇందు వివేకానందు నిజననము—విద్యాభ్యాసము, మానసిక పరివర్తనము—వివాహము—గురుదర్శనము మున్నగు విషయములన్నియు విపులీకరించబడినవి నరేంద్రుని తల్లి కుమారునకిట్లు బోధ చేయుచున్నది.

తే॥ "ప్రాణభయము వాటిల్లిన—పలుకబోకు
మెపుడసత్యము, విడువకు మే యనువున
నైన మంచి యుద్దేశము—నందటియెడ"
దయ బ్రకటనసేయుమ ! పుత్ర ! తలగ కెపుడు

నరేంద్రుడు రామకృష్ణుని దర్శనము చేసుకొన్నాడు. అతని కృపకు పాత్రుడైనాడు, రామకృష్ణ పరమహంసకు కూడ నరేంద్రునిపై విశ్వాస మంకురించినది. నరేంద్రుడు వివేకానందుడైనాడు. అప్పుడు పరమహంస నరేంద్రునిట్లు ప్రశంసించు చున్నాడు.

అష్టదళపద్మమొకడు, పెంపారనొకడు
షోడశ దళపద్మమగును—జూడనితడు
మహిని జను సహస్రదళప—ద్మంబునాగ
శిష్యవరులార! యీతని చెలిమి గనుడు.

ఈ పూర్వభాగపు కృతిని శ్రీ నీలం సంజీవరెడ్డిగారు అంకితము గైకొనిరి. ఈ వివేకానందపు ఉత్తరభాగము వెలువడినదో లేదో తెలియదు. ఈ కవిగారి కృతుల కన్నింటికిని శ్రీ జి. జాషువా కవిగారు మెచ్చి తమ అమూల్యాభిప్రాయముల నిచ్చిరి.

ఈ కవిగారిని 1955 సెప్టెంబరులో కడపయందు సన్మానించి మధుర కవి అను బిరుదొసంగిరి. ఢిల్లీ ఆంధ్ర సంఘమువారు "కవిరాజహంస" యను బిరుదునిచ్చి సత్కరించిరి. శ్రీ సుబ్బయ్యగారు "కలభాషిణి"

"శ్రీశైలప్రభ" పత్రికలకు నిర్వాహకులుగాను, సంపాదకులుగాను వ్యవహరించిరి. వీరు "కవిరాజహంస" గ్రంథమాలను స్థాపించి తమకృతుల నెన్నింటినో తెలుగులోనికి దెచ్చిరి. వీరి కృషి ఆచంద్రతారార్కముగా నిలిచిపోగలదు. కడప మండల కవిరత్నములలోను, సాహిత్యచరిత్రలోను అగ్రశ్రేణి కవులుగా వీరు పేరెన్నిక గనిరి. పరమేశ్వరుడు వీరికి చిరాయురారోగ్యాభివృద్ధుల ననుగ్రహించు గాక!

## శ్రీ గొట్టిపాటి సుబ్బరాయలు

జననము - 1917 నిర్యాణము.- 21-1-1970

తల్లి -శ్రీమతి వెంకటమ్మ తండ్రి.-శ్రీ వెంకటప్ప (బొజ్జన్న)

మతము, కులము -హిందూ-కమ్మ-రాజన్యుల గోత్రము

జన్మస్థలము - అనంతపురం-ధర్మవరం తా॥ కోనాపురం

గీ॥ ఒక్కొకరు నొక్కరీతిగా చిక్కదనము
చక్కదనములు, మిక్కిలై జాలువార
పెక్కురీతెలుగుగడ్డను దుక్కిజేసి
కృషినొనర్చిరి, సాహిత్య ఋషుల దీక్ష.

తెనుగు గడ్డను దుక్కిచేసి కృషిచేసిన కృషిక పండితులు, పెక్కురున్నారని శ్రీ గొట్టిపాటి వారన్న మాటలో వాస్తవము లేకపోలేదు. వారి కృషి ఫలితముగా నేడు తెనుగు సాహిత్య నందనోద్యానవనము పుష్ప, ఫల భరితమై నయనానందమును కల్గించుచున్నది, ఈ కర్షక కవులు పండించిన పంటలు పలురకములు. శ్రీ గొట్టిపాటివారికి ఆంధ్ర సాహిత్యఋషుల యెడగల భక్తిప్రపత్తు లపారములు. అందులకే వారు తాను పండించిన ఫలసాయము తనకృషి ఫలితము కాదని విశ్వసించి, ప్రతివారిని పేరుపేరున స్మరించి ధన్యులైరి. ఇది వారి గొప్పతనమునకు తార్కాణము.

శ్రీ గొట్టిపాటి వంశీకులు పూర్వము గుంటూరుసీమ నివాసులు. వారు అనంతపురం జిల్లా, తాడిపత్రి ప్రాంతమునకు వచ్చివేసిరి తదుపరి వారి నివాసము అనంతపురం జిల్లా ధర్మవరం దగ్గరగల ఎగువపల్లెకు మార్చబడెను వీరి వంశీకులందరు రైతులే. ఎగువపల్లెకు దగ్గరలోగల కోనాపురమందు సుబ్బరాయుడుగారి తండ్రి కాపురముండి గౌరవముగా సేద్యము చేయుచుండిరి సుబ్బరాయుడు గారికి అతని పదవయేటనే తల్లిదండ్రులు దూరమైరి తదుపరి అన్నగారివద్ద జీవయాత్ర సాగించిరి వీరి విద్యాగురువగు వెంకటరామరావుగారు వీరికి ఓ, నామాలనుండి ఉత్తర రామాయణము వరకు తొమ్మిది నెలలలో నేర్పిన మహనీయులు ఆంగ్ల, చరిత్రాదులను శ్రీ వీరభద్రరావు గారి వద్ద కవిగారు పఠించిరి. పదునాల్గవ యేడు నిండకపూర్వమే కవిగారు గ్రంథాలయములకు వెళ్ళి వేలకొలది గ్రంథములను చదివి జ్ఞాన సముపార్జన గావించిరి.

ఇంతలో గాంధీగారిపిలుపు దేశములోని యువకులను మేలుకొల్పెను. ఆ యుద్యమమునందు సుబ్బరాయుడుగారు పాల్గొనిరి. ఆ సమయమున వారికి 'బెత్తపుం దెబ్బ లొకపూట బత్తెమయ్యె' అని వాక్రుచ్చిరి.

తదుపరి వచ్చిన కష్టపరంపరలకు అంతులేదు. అప్పుడు వారు గోచె నెగజెక్కి వ్యవసాయకూలీగా నితరుల చేలలొ సేదుగింజల, కొరకు చెమటోడ్చి పనిచేసిరి. తదుపరి వారు ఒకచేత హలముబట్టి వేరొకచేత సాహితీ క్షేత్రమున కలము పట్టిరి.

వీరు 'వికాసభారతము'ను పేర మానవ ప్రగతి చరిత్రను వ్రాయ తలపెట్టిరి. అదొక పెద్దపథకము అయ్యాది సంపూర్ణమై యుండిన మానవుని జీవిత మనుగడ విభిన్న దశల యందెట్టెట్టి మార్పులు చెందుచుండెనో విశదమగు చుండెడిది అట్లే భారతదేశస్థితిగతులు, చరిత్ర తెచ్చిన మార్పులు అవగతమయ్యేడివి ఈ భారత వికాసమును వీరు తేటతెనుగులోని దేశకవితలో చెప్పబూనుట సాహసమైన విషయము. ఇది కథకాదు. చరిత్ర. దాని

కంతుండదు. చరిత్రను పెంచి వ్రాయు అభిలాష కవికి పూర్తిగా లేదు. వర్ణనలపట్ల వ్యామోహము కూడాలేదు. ఉక్కు శనగల వంటి మాటల నుపయోగించి పరితల నుక్కిరి, బిక్కిరి చేసి, పండితుల నుండి ప్రశంసావాక్యములను కానుకగా గై కొనవలెననెడి మోజుకూడా కవిగారికి లేదు. కొన్ని తెలుగు పదములను నుడికారములను కొందరు కవులు తమ రచనలయందు వాడుకొనే పద్ధతిని కూడ, వదలిపెట్టిరి. గొట్టిపాటివారు కాలానుగుణ్యముగా మారి మడిగట్టుకొనక జంకక కల్పనలు వర్ణనలు గావించక అచ్చతెనుగునుడికారముల వదలక ముచ్చటైన అలతి అలతి పదములతోడనే 16 పర్వముల వికాస భారతమును వ్రాయతలపెట్టి, ఆదిమ—బౌద్ధ—శాంతి—అణుపర్వములను వ్రాసిరి.

వీరి పథకము పూర్తిగా సాగియుండినచో ఈ వికాస భారతమునకు సాహిత్యలోకములో ఒక విశిష్ట స్థాన ముండెడిది. వీరి ఆదిమ పర్వములో కొన్ని విషయములను చూతము.

భూమిపై పుర్వుగా ప్రాకుచున్న మానవుడు, సముద్రములను దాటి ఆకాశ వీథులందు దిరిగి, గోళములనెక్కి 'నెలవంక, కొమ్ములకు విచ్చెనలు వేయు నందాక రెచ్చిపోయె' ననుమాట ఆధునికకు లెల్లరకు తెలిసిన విషయమే. ఇదెంతటి మార్పు ? అసలీత డెవరు ? ఎక్కడి దింతబలము. ఈతడు పూర్వమింతటి నాగరికతను కల్గి ఉండెనా ! అని ఆలోచించిన, చరిత్ర లేదనియే జవాబు చెప్పుచున్నది. మరి ఆతడెట్లుండెనో ? ఆతని పుట్టుకెట్లు జరిగినదో తెల్పునదియే ఆది మానవచరిత్ర. కవిగారు మానవుని పుట్టుకకు గల వివిధ ఆధారము లన్నింటిని విపులీకరించిరి.

మాటలిన్నిలేక మనసును వెలిబుచ్చు
మూగసైగతోడ మూల్గుతోడ
వెరపు గల్గినప్పు డరచును గట్టిగా
తృప్తివేళ నవ్వు దుముకు చుండు.

చూపులో ఊపులో నిల్పుమోపులోను
తాపులో కాలుసేతుల చాపులోను
బొమల ముడిలోను భావముల్ పుణికి కొనుచు
నెదుటివారల హృదయాల నెరుగుచుండె

ఆదిమానవుని కామవాంఛ ఇట్లుండెనని కవిగారూహించిరి.

తనదు తొడమీద తలవాంచు తనయులేపి
కామవాంఛను దీర్చుకోగడగె తల్లి
అన్నయొక్కడు చెల్లెలి నడుమ బట్టి
యొడుగరచుచు నానంద మనుభవించె.

ఇట్టి అనాగరిక మానవుడతి త్వరలోనే కుటుంబీకుడైనాడు. పశువులను పెంచనేర్చినాడు. పాలు, పెరుగు, వెన్నలుతిన మరిగినాడు దష్టమృగముల చంప సాహసించినాడు. గుడిసెలు గట్టుకొని శాంతిగా జీవితము సాగించినాడు. తదుపరి వస్తువులు తయారు చేయుట నేర్చినాడు. దానిని కవిగారిట్లు ముచ్చటగా ఆటవెలదులలో వ్రాసిరి.

ఒండుమట్టిదెచ్చి యెక్కరూపంబిచ్చి
యెండలోననుంచి నెదియొ నెంచి
అగ్గిపైనగాల్చి అదికుండగా మల్చి
సాధనముగా నెంచి సంతసించె

ప్రత్తి చెట్టుగాంచి విత్తులు విడదీసి
దూదిలోనున్న ధూళి దులిపి
యేకుజేసి దారమింతితగా దీసి
కండెబోటు జుట్ట గలిగినాడు.

ఇట్లు పలువిధములుగా మానవుని మనుగడలో మార్పులు రాసాగినవి.

ఓబిరెడ్డిగారు నిరాడంబరులు వినయ గుణశీలురు. ఒక మారుమూల కుగ్రామమునందు బడి పెట్టుకొని, వారికి పాఠము జెప్పుచు, తీరిక సమయములందు తమకు తోచిన విషయములపై, కవిత్వము జెప్పుచు మతి యొక ప్రక్క సేద్యము చేసెడివారు.

ఓబిరెడ్డిగారు తమ తొలి రచనలుగా శతకములు, హరికధలు వ్రాసిరి. తదుపరి నాటకములు వ్రాయుట కుపకరించిరి. పద్యరచనయందు, చిత్రబంధ కవితారీతులతో, అంత్యప్రాసలతో, నూత్నపదబంధములతో వ్రాయుట వీరి కభిరుచి వీరి 'భక్త శ్రీసిరియాళ' హరికధను సాహితీపోషకులైన, శ్రీ భోగి సెట్టి జోగప్పగారు ప్రచురించి కవిని ప్రోత్సహించిరి. వీరి పద్యనడక చూడుడు.

శా॥ ఏమేమీ ! చిరుతొండనంబి సతతం—బీరీతి సద్భక్తులన్
ఆమోదంబు జెలంగ, దృప్తిపడ—నాహారంబు లర్పించునే ?
ఈ మాడ్కిన్ జెలువొందు త్యాగపరు నెందేనిన్ గనుంగొంటిమే?
స్వామీ! నామదిఁగోర్కె గల్గెను భవద్భక్తున్ బరీక్షింపగన్

తదుపరి వీరి 'భీమసౌగంధిక' నాటక మెన్నదగినది. ఈ నాటకమును కవిగారందరికి అర్థమగునట్లు వ్రాసిరి. ఇందు భీమాంజనేయ సంవాదమొక రసవత్తర ఘట్టము. ఆంజనేయుడు, భీముని పరాక్రమమును పరీక్షించి, ఇట్లవహేళన జేయుచున్నాడు.

గీ॥ ఇంక సౌగంధి కంబులం చెన్నదేవి
స్వప్నమందైన దలపకు—సత్వరమున
మని కేగుము ప్రాణంబు లున్నజాలు
భామినుల, నెందఱినినైన బడయవచ్చు.

అందులకు కోపగించిన భీముడు రుద్రుడై ఇట్లు పలికినాడు,

గీ॥ ముదుసలి వటంచు, కనికరమెద దలంచి
యింత పలుకును మదిని శాంతించి యుంటి,
నింక నోరెత్తి మాటాడితేవి, నీదు
మూతి విఱుగంగ బొడుతు నా ముష్టిచేత

కవులందఱు, మొట్టమొదట శతకములనే వ్రాసినట్లు తెలియవచ్చును. ఆ శతకములందు, భక్తి, నీతి, వైరాగ్యములకే ప్రాధాన్యమొసంగిరి. మన రెడ్డిగారు తమ "కృష్ణశతకము" నందు పెదవులు, తగలని పద్యములనే వ్రాసిరి. పెదవులు తగిలిన పాపమని భావించిరేమో? ఖడ్గ బంధకందము, శైలబంధకందము, రతిబంధము. ఉత్పల పాదగర్భకందము, మున్నగు చిత్రబంధ కవిత్వములున్నవి. ఈ క్రిందిపద్యము చూడుడు.

కం॥ నక్షత్రనేత! ఖద్యో
తాక్ష! రణరంగదక్ష! ఆశ్రితరక్షా!
రాక్షస గజహర్యక్షా!
అక్షీణ దయా కవితకటాక్షా! కృష్ణా!

వీరి తరువాత కృతి, రాప్తాటి నిర్వచన రామాయణము. వీరు శ్రీరామకథను సర్వజనులకు అర్థమగురీతి సులభశైలిలో వ్రాయదలంచిరి. ఇందు కౌసల్యాపరిణయముకూడ, సంక్షిప్తముగాచేర్చిరి. రావణుడు కౌసల్యా పరిణయము దశరథునితో జరుగకుండ, భగ్నము చేయదలచినాడు. విధిని దాటితినని గర్వపడినాడు. తుదకు తానే భగ్నపడినాడు. అందుకు సాగరు నిట్లు దూషించినాడు.

శా॥ ఏరా! సాగర! యింతనీకు పొగరా! మీరీతి నాయానతిన్
మేరంజాలతివా! దురాత్మ! కుటిలా! మిథ్యానులాపా! నినున్
ఘోరపక్రిక్రియ ఖండఖండములుగా, గోయించి భూతాళికా
హారం బౌ నటులే నోనర్తు ననగా-నాతండు భీతాత్ముఁడై

విరామ సమయములో కూడా, వీరు కాలమును సద్వినియోగము చేయుచున్నారు. తన వద్దకు వచ్చుచున్న విద్యార్థులకు విద్యాదానము చేయుచున్నారు.

హిందూపురము తా॥ దాని గ్రామములు కవులకు, పుట్టినిండ్లుగా వెలసినవి. కల్లూరు, కగ్గల్లు, మణేసముద్రము, కోడిపల్లి, కిరికెర, బేవినహళ్ళి, కొండాపురము మొదలైన గ్రామములలో కవులుద్భవించినారు. మణూరు మలుగూరు కవులుకూడి ప్రసిద్ధులు. సంగీత సాహిత్య సరస్వతులు. కీ॥ శే॥ రొద్దము రాజారావుగారు, హిందూపురములో ప్లీడరుగావుండి, ఆంధ్ర సాహిత్య సంగీతములకు, చేయూతనొసంగిరి. శ్రీకృష్ణదేవరాయ వర్ధంతుల నెఱపి, సాహిత్య సంగీతసభలను ప్రోత్సహించినారు, కీ॥ శే॥ కల్లూరి సుబ్బరావుగారి జీవితములో, ఏటేట వసంతోత్సవముల జరిపి అనేక కవి పండితులను పిలిపించి వారిచే సాహిత్యోపన్యాసముల నిప్పించి వారిని ఘనముగా సత్కరించినారు. ఈ సందర్భమునందే మణూరువారికి కవితారామ వసంత బిరుదమును శ్రీ జనమంచి వారిచ్చిరి.

శ్రీ మణూరు రామరావుగారు ఈ క్రింది గ్రంథముల రచించినారు. 1) రామశతకము 2) ముక్తాక్షరగ్రస్త రామాయణము-1936 3) శ్రీ అది నారాయణస్వామి చరిత్ర-1940 4) లీలారంగనాథము-1952 5) స్వాతంత్ర్య విజయము-1957

## శ్రీ ఆదినారాయణస్వామి చరిత్ర

'ఇది యొక స్థలపురాణము. ఇందుఁబేర్కొన్న కూర్మగిరి నిపు 'డాది నారాయణ కొండ' యందురు. ఇయ్యది మైసూరు రాజ్యమున "గుడిబండ" కుత్తరమున నాలుమైళ్ళ దూరమున యల్లోడను గ్రామము చెంత గలదు. ఇద్ధరాధరంబుపై వేంచేసియుండు శ్రీమన్నారాయణుండు భక్తఫల ప్రదాతయని చాలాకాలమునుండియు లోకమున సువ్యక్తము. ప్రతి మాఘమాసమునను

తనగోడును, మొఱపెట్టుకొన్నాడు.

వీరి 'శబ్దాలంకార శతకము' నందు, అంత్యనియమము, అంత్య ప్రాస, ద్విప్రాస, త్రిప్రాస, లాటానుప్రాసముగల పద్యము లనేకము లున్నవి. వీరి ఈ కృషి ప్రశంసింపదగినది.

వీరి అముద్రిత గ్రంథములు చాలగలవు ఇట్టి అజ్ఞాతకవులు, మన రాయలసీమలో అనేకులున్నారు. వారు కీర్తికాములుకారు. వీరు చిరంజీవులై సాహిత్యలోకమున ఆతారార్క—చంద్రులవలె ప్రకాశించెదరు గాత.

# హిందూపురం కవులు.

కవితా రామ వసంత — విద్వాన్

## శ్రీ మణూరు రామరావు

జననము 21—4—1908

జన్మస్థలము —మధూడి మడకశిర తా॥ అనంతపురము జిల్లా

తల్లి —శ్రీమతి వెంకమ్మ

తండ్రి —శ్రీ మణూరు నారణప్ప

మతము. కులము — హిందూ—బ్రాహ్మణ—స్మార్తులు, శ్రీవత్సనగోత్రము

వీరి పూర్వీకులు, అనంతపురము జిల్లా, పెనుకొండ తాలూక చిన్న మణుతూరుగ్రామములో ఉండిరి. కరణీకము చేయుచుండిరి. వీరి పితామహుని కాలములోనే ఆవూరు విడిచి మడకశిరా తాల్లూకు మణూరు చేరిరి వీరితండ్రి గారుపాధ్యాయులుగా నుండిరి. ఈ కవిగారుకూడ ఉపాధ్యాయ వృత్తినే చేబట్టిరి. ఈ కవిగారు 8వ, తరగతివఱకే చదివి, తరువాత స్వయంకృషితో S S L C ముగించి, తర్వాత విద్వాన్ పరీక్ష ప్యాసై, 1949 నుండి 1963 వఱకు హిందూపురము మహాత్మాగాంధి హైస్కూలులో ఆంధ్రపండితులుగా పనిచేసి విరమించిరి.

విరామ సమయములో కూడా, వీరు కాలమును సద్వినియోగము చేయుచున్నారు. తన వద్దకు వచ్చుచున్న విద్యార్థులకు విద్యాదానము చేయు చున్నారు.

హిందూపురము తా॥ దాని గ్రామములు కవులకు, పుట్టినిండ్లుగా వెలసి నవి. కల్లూరు, కగ్గల్లు, మణేసముద్రము, కోడిపల్లి, కిరికెర, బేవినహాళ్ళి, కొండాపురము మొదలైన గ్రామములలో కవులుద్భవించినారు. మణూరు మలుగూరు కవులుకూడి ప్రసిద్ధులు. సంగీత సాహిత్య సరస్వతులు. కీ॥ శే॥ రొద్దము రాజారావుగారు, హిందూపురములో ప్లీడరుగావుండి, ఆంధ్ర సాహిత్య సంగీతములకు, చేయూతనొసంగిరి. శ్రీకృష్ణదేవరాయ వర్ధంతుల నెఱపి, సాహిత్య సంగీతసభలను ప్రోత్సహించినారు, కీ॥ శే॥ కల్లూరి సుబ్బరావుగారి జీవితములో, ఏటేట వసంతోత్సవముల జరిపి అనేక కవి పండితులను పిలిపించి వారిచే సాహిత్యోపన్యాసముల నిప్పించి వారిని ఘనముగా సత్కరించినారు. ఈ సందర్భమునందే మణూరువారికి కవితారామ వసంత బిరుదమును శ్రీ జనమంచి వారిచ్చిరి.

శ్రీ మణూరు రామరావుగారు ఈ క్రింది గ్రంథముల రచించినారు. 1) రామశతకము 2) ముక్తాక్షరగ్రస్త రామాయణము-1936 3) శ్రీ ఆది నారాయణస్వామి చరిత్ర-1940 4) లీలారంగనాథము-1952 5) స్వా తంత్ర్య విజయము-1957

## శ్రీ ఆదినారాయణస్వామి చరిత్ర

'ఇది యొక స్థలపురాణము. ఇందుఁబేర్కొన్న కూర్మగిరి నిపు 'డాది నారాయణ కొండ' యందురు. ఇయ్యది మైసూరు రాజ్యమున "గుడిబండ" కుత్తరమున నాలుమైళ్ళ దూరమున యల్లోడను గ్రామము చెంత గలదు. ఇద్ద రాధరంబుపై వేంచేసియుండు శ్రీమన్నారాయణుండు భక్తఫల ప్రదాతయని చాలాకాలమునుండియు లోకమున సువ్యక్తము. ప్రతి మాఘమాసమునను

మూఁడవ రవి వాసరమున విద్దేవునకు రథోత్సవాదుల నతిశ్రద్ధమైయి నచటి భక్తలోకము జరుపుట సర్వజన విదితము. ఈ జాతరకు దూరదేశమునుండి భక్తులు పెక్కురరుదెంతురు. ఏతదుత్సవ వినోదములనుఁ జూడవలయుఁ గాని చెప్పనఁ జిప్పుడిగానుండును.'

కవిగారు తమ విన్నపము నందిట్లు వ్రాసుకొన్నారు.

ఈ గ్రంధమునకుఁ దొలుత నన్నుఁ బ్రేరేపించినవారు పీరాపురము లోనుండు వే॥ బ్ర॥ శ్రీ పంచాంగం వెంకప్పగారు. వారు "శ్రీకూర్మాద్రి పురాణ"మను యక్షగానముగా నున్న యొక కృతిని నాకొసఁగిరి దానిని రచించినవారు హంపసముద్రము నందుండిన కీ॥ శే॥ సూరప్పగారు మఱియు 'యల్లోడు' గ్రామనివాసులైన శ్రీయుత లక్ష్మీనరసప్పగారును, ఆది శేషప్పగారును, నాయందభిమానముంచి "శ్రీ ఆదినారాయణస్వామి స్థల పురాణ" మను కథనిచ్చి నాకుత్సాహముఁ గల్పించిరి. ఆకథ కన్నడభాషలో సంగ్రహముగా వచనరూపమున వారి పెద్దలచే వ్రాయబడినది. ఈ గ్రంథ మున కంగములుగాఁ గొన్ని విషయములను గుడిబండ నివాసులైన వే॥ బ్ర॥ శ్రీ నరశింహభట్లుగారును, కంచిసముద్రం దాసా లక్ష్మయ్యశ్రేష్ఠిగారును దెలియఁజేసిరి.

ఈ యాధారములఁ బురస్కరించుకొని, శ్రీ ఆదినారాయణస్వామి యనుగ్రహమునను, పెద్దల యాశీర్వచన ప్రభావమునను, శ్రీఆదినారాయణ చరిత్రంబను నిక్కావ్యంబు రచియింపగలిగితి.

ఇందలి పద్యములు కొన్ని

— కూర్మముని ప్రత్యక్షమగుట —

కం॥ గిరిగహానసీమ ధరణీ
సురదంపతు లట్లు ఉన్న । చోటికి వచ్చెఁ
బరగునఁ గూర్మమునీశుఁడు
పరమాదరచిత్తుఁ డార్త । బాంధవుఁడగుచుఁ

సీ॥ దీర్ఘ జటాచ్ఛటల్ । దిగజాఱి తెల్లనై
నెలిమిడి పూతతో । వియ్యమంద
బ్రహ్మతేజంబున । భాసిల్లు ముఖమున
శాంతరస స్ఫూర్తి । సందడింప
యోగదండము చంక । నొప్పుగా వలచేతఁ
బూను కమండలం । బును రహింప
రుదురాక పేరులు । కుదురుగా శోభింప
మునివేషమెంతయు । పొసఁగుచుండ

ఆ॥ వఱుఁగుదెంచు నతని । నబ్బురంబునఁజూచి
నతియుఁ బతియుఁ దమకు । స్వాంతమందు
నొక్కవింతగాఁగ । నుల్లసిల్లెడు భక్తి
తోడ నిల్చి కేలుఁ । దోయి మోడ్చి

స్వాతంత్ర్య విజయము

సీ॥ సత్యాగ్రహంబను । సాధనంబు ధరించి
స్వచ్ఛంద సైనికుల్ । సంభ్రమింపఁ
బ్రాణంబు లెదురొడ్డి । పట్టు వీడకనిల్చి
రాజాజ్ఞ నెదిరి దు । ర్వార భంగి
బార్డోలిజయము చేపట్టి । దేశమునందు
నధికారులకు నధి । కారివగుచు
శిక్షల నన్నింటి । శిరసావహించి కా
రాగారముల నుండి త్యాగమహిమఁ

గీ॥ జూపి శత్రువులకు నెల్ల । జోద్యమడర
శాంతిపద్ధతి సమరంబు । సాగఁచేసి
దేశమున వారి యాజ్ఞకు । దిక్కు లేక
దిగులు గూర్చితిగాదె । గాంధీమహాత్మ!

వీరి కృతులలో 'శ్రీలీలారంగనాధము' ఎన్నదగిన కావ్యము. దీనిని కవిగారు ప్రబంధపక్కీలో వ్రాసిరి. ఇది ఒక స్థలపురాణ గ్రంథము. హిందూపురం తాలూకా 'శిరివరమ'ను గ్రామమున వెలసియున్న శ్రీ రంగనాథస్వామి భక్తులలో అగ్రగణ్యులైన ఆ గ్రామ పూర్వపు కరణీక వంశస్థుల కథ కూడ యిందు చొప్పించబడినది. ఈ గ్రంథము కవిపండితుల ప్రశంసల నందుకొన్నది. కవిగారి రచనా వైఖరెట్లు సాగినదో, చూడుడు.

చం॥ చనిచని కాంచిరంతట విశాల మహీరుహ వాటికా ని గూ
హనమున మోహనాంగియగు నంగన కౌగిట నుల్లసిల్లుచుఁ
దన ఘనతా విశేషమున దార్కొను పేరిమి జూపు రాజనఁ
దనరుచు నున్న భూభృదవతంసము నున్నత శృంగ రమ్యముఁ

ఉ॥ ఏమిది సీదులీల? మహివింతటి భీకరమైన కాటకం
బీమెయి జుట్టుముట్టి తనయేత్తెర జూపి గ్రసించు బ్రాణులఁ
స్వామి! భరింపరాని దురవస్థలకుం గుఱియైతి మీ మహా
క్షామము దీర్చిబ్రోవవె? విశాల దయామయ రంగనాయకా!

ప్రబంధ వైఖరిలో సూర్యోదయ, చంద్రోదయ, ఋతువర్ణనలతో, మూడు ఆశ్వాసములుగా వ్రాయబడిన ఈ కృతి వారి సాహిత్య కృషికి మకుటాయమానము.

## ముక్తాక్షరగ్రస్త రామాయణము (1938)

పద్యము యొక్క, కడపటి అక్షరముతో, రెండవపద్యము ప్రారంభమగును. రెండవ పద్యము యొక్క చివరి అక్షరముతో, మూడవ పద్యము ప్రారంభమగును. ఇట్లే చివరి వఱకు ఈ రామాయణమును 274 పద్యములతో సంగ్రహముగా, ముగించినారు.

సీతాపహరణమైన తర్వాత, శ్రీరాముడు తమ్మునితోగూడి. అరణ్యమున సంచరించుచు, సీతకై ఇట్లు వాపోయినాడు.

సీ॥ దౌర్భాగ్యుఁడైన, నా తన్విని గానరే ।
తరులార । యో లతా తరుణులార ।
దీనుండనైన, నామానినిఁ గానరే
హరులార । కరులార । రురువులార ।
రాముండనైన, నా, రామనుఁగానరే
నదులార । యో ఘన_నగములార ।
పతిహీనుఁడైన నా_సతి నెందుఁగానరే
పక్షిగణము లార । యక్షులార ।

గీ॥ హరిణమా । సీత జాడల_నరయలేదె ?
శారికా । కానవైతివే ? జనక తనయ
పికమ । భూజాత కంఠంబు_వినగ లేదె ?
జనకసుత పల్కు_వినవొ ? యెందును, శుకేశ ।

ఈ కవిగారు శ్రీరామభక్తులు. శ్రీరామకోటి వ్రాసి తరించినారు, సభ్యులు. సుగుణ సంపన్నులు, ఆధ్యాత్మిక చింతతో_విశ్రాంతిగా_హిందూపురము నందు కాలము గడపుచున్నారు.



# కవితా విశారద_లలితకవి



జననము — 1897 ఆగష్టు

నిర్యాణము — 17-12-1979

జన్మస్థలము - మలుగూరు, హిందూపురం తా॥ అనంతపురం జిల్లా.

తల్లి —శ్రీమతి రంగమాంబ

తండ్రి:శ్రీ లక్ష్మినారాయణప్ప

మతము, కులము'—హిందూ-బ్రాహ్మణ—వేగినాడు.

శ్రీ లక్ష్మినారాయణప్ప గారికి కవిగారు జ్యేష్ఠులు. వీరు అతిధుల నాదరించు స్వభావము కలవారు. నిరాడంబరులు. కవిపండితులపై ఈ కుటుంబమునకు గౌరవము కలదు. కవిగారు హిందూపురములో మాధ్యమిక విద్య పూర్తి చేసిరి తరువాత చిత్తూరు జిల్లా మదనపల్లె థియసాఫికల్ హైస్కూలులో యస్.యస్ యల్ సి, ముగించిరి. 1919_20 సంవత్స రములలో అనంతపురం సెకండరీగ్రేడు ట్రయినింగు పరీక్షలో ఉత్తీర్ణులైరి. 1921 సం॥ నుండి 1953 వరకు హిందూపురము మునిసిపల్ హైస్కూలులో సెకెండరీగ్రేడు టీచరుగా పనిచేసిరి. తదుపరి 1953వ సంవత్సరము నుండి 1961వ సంవత్సరము వరకు శ్రీ శారద విద్యా నిలయ మను హైయర్ ఎలి మెంటరీ స్కూలులో ప్రధానోపాధ్యాయులుగా పనిచేసిరి. వీరి క్రింద తర్ఫీ తైన వారిప్పుడు గొప్ప, గొప్ప పదవులందున్నారు.

వీరికి 'లలితకవి' 'కవితాశారద' అను బిరుదులు కలవు. కవిగారు శ్రీరామభక్తులు, స్వామి రామదాసు శిష్యులు. వీరు రచించిన జానకీ వల్లభ

శతకము_స్వామి రామదాసు ముక్తావళి_ఆత్మ రామాయణము మొదలైన గ్రంధములే వీరి భగవద్భక్తికి నిదర్శనములు. వీరికి శ్రీరామచంద్రునిపై భక్తి కుదురుట కొక నిదర్శనము కలదు 'శ్రీ జానకీవల్లభశతకము' న కవిగారిట్లు వ్రాసుకొన్నారు.

"నా మనుమడు మూడేండ్ల బాలుడు జ్వర బాధితుడై పరుపు బట్టుటయు, నే నొకనాడా బాలుని యొద్ద యుండి వాని వంకను భజన కొఱకై యలంకరింపబడి యుండిన శ్రీ కోదండ రాముల పటము వంకను పలుమారు జూచుట తటస్థించెను.

అంతటితో నాలో నొక భావోద్రేకము కలిగెను. ఆ యుద్రేక తీవ్రతతో నా భావము లన్నియు పద్యములుగా మారినవి. సగము ముగియు నప్పటికి బాలుని స్థితి విషమించి నిరాశ జనించెను. నే భయపడి వ్రాత సాగించుటయా, మానుటయా, యని శంకించితిని. ఏమైనను గానీ యని శ్రీరామునిపై భారము వేసి రచన సాగించితిని. రచన ముందుకు నడచిన కొలది బాలుడు దినక్రమేణ ఆరోగ్యమును బొందుచు శతకము బూర్తి యగునప్పటికి సంపూర్ణ ఆరోగ్యమును బొంది బ్రతికెను. అప్పటినుండియు నాలో శ్రీరామునిపై భక్తి కుదిరినది." వారి జానకీ వల్లభ శతకము నందిట్లున్నది.

మ॥ కవితల్ చెప్పగ నాత్మనెంచి కథలన్ గల్పింపగాలేదు; య
య్యావి నీపై పలుకంగ జేసితిగదయ్యా! కాదె? నీ యిచ్చ యో
నవలావణ్య విలాస రూప భువిలో నాపుణ్య మెంతో గదే
భవ దూరం బొనరించి కాచితివి, దేవా! జానకీవల్లభా!

తదుపరి వీరి ఆంధ్రాను వాదము 'మానసప్రబోధ రత్నరాశి'. దీనిని శ్రీ సమర్థ రామదాసు గారు మహారాష్ట్ర భాషలో రచించిరి. ఈకృతిని కవిగారు తమ షష్ఠిపూర్తి శాంతి మహోత్సవ పూజా పుష్పముగా వ్రాసి ప్రకటించిరి. అందలి భామినీ షట్పదు లిట్లున్నవి.

ఎట్టి కార్యమొనర్చు చున్నను
గట్టిగా శ్రీరామనామము
పట్టుదలతో స్మరియించు చుండుము భావ మలరంగన్
అట్టి నియమము సడల జేయకు
యెట్టి సంకటములు రా వె
ప్పట్టున వేకువననే మనసా! పలుకు రామకథల్

కలియుగంబున మనుజు లెల్లరు
నిలను కర్మాచరణ నొల్లక
ఫలములన్ వెసగోరి ధర్మము సలుప నెంత్రు మదిన్
తలప భూతములందు నెప్పుడు
నిలుపలేరు దయార్ద్ర దృష్టిని
సులభమైనను రామనామము దలపరే మనసా!

వీరి కావ్యములలో 'ఆత్మరామాయణ' మొక బృహద్గ్రంథరాజము. "నేను కవిని గాను, కవినని చెప్పుకొను సాహసము నాకడలేదు. కవిని గావలయునను యుబలాటముతో చేసిన ప్రబల ప్రయత్నమెప్పుడును లేదు". అల్పజ్ఞుడనని ఇందు చెప్పుకొన్నారే గాని, శ్రీ గురుమూర్తిగారెందులోను తీసిపోరు. ఇది వారి నిగర్వమునకు నిదర్శనము. ఆత్మరామాయణమునకు మూలము ఒక వచన గ్రంథము. దీనిని కవిగారికి శ్రీకరణము సూరప్పగారు అందించి సులభ శైలిలో పద్య కావ్యముగా వ్రాయుమని కోరిరి. శ్రీరామచంద్రుడే తననిట్లు ప్రేరేపించినట్లు భావించి కవిగారు వ్రాయపూనిరి. భక్తి పరులైన కవిగారికి తెలుగు భాగవతముపైగల గాఢాభిమాన మీ 'ఆత్మారామాయణము' లో నటనట కానబడును. జనక మహారాజు కొలువు కూటమున ఏర్పాటు చేయబడిన సీతా స్వయంవరమునకు శ్రీరామచంద్రుడు సోదర సమేతుడై విశ్వామిత్రుల వారు ముందు నడువగా పురవీధులందు రాజఠీవితో

నడచి వచ్చుటను చూచి సౌధాగ్రంబుల జేరిన మగువలు తమలో తా మిట్లను కొనిరి.

సీ॥ వీడటే! తాటకఁ విగత జీవిగ జేసి
మునుల గాచిన యట్టి మనుజవిభుడు!
వీడటే! మారీచు బీచమడంచిన
భుజబలోన్నతుడైన భూరి యశుడు!
వీడటే! రాతిని వింతయౌ నాతిగా
సలిపి దీవించిన సత్యమూర్తి!
వీడటే! హరివిల్లు విదళించి మేటిగా
విశ్వకీర్తిని గొన్న వీరవరుడు!
వీడటే! సీతకు వేడ్కఁ గొల్పెడు నట్టి
ప్రణయగీతిని బాడు భావజుండు!

తే॥ ననుచు, సౌధాగ్రములనుండి యతివ లెల్ల
జారు తరమూర్తి విశ్వ ప్రశస్త కీర్తి
బరిణయంబున మనసీత కరము బట్టు
భానువంశాబ్ధ సోముడు భద్రి కరుడు.

ఈ రీతిగా మృదుమధురముగా, అతి లలితముగా సాగినదీ కవిత్వము. కవిగారికి పేరు ప్రతిష్టలను సాహిత్య సీమయందొక గొప్ప గుర్తింపు తెచ్చిపెట్టిన రచన ఇదియే. వీరి రచనలను బట్టియే వీరికి 'లలితకవి'యను బిరుదమును రాయలసీమ కళాపరిషత్తు వారొసంగి సత్కరించిరి. శ్రీకూడ్లీ శృంగేరి పీఠాధిపతులు 'కవితావిశారద'యను బిరుదము నిచ్చి ఆశీర్వదించిరి.

లలితకవిగారు కవులేకాదు, సంగీత కళాకోవిదులు కూడ. తంబూర వాయించుచు 'యత్ర యత్రి రఘునాథ కీర్తనం—తత్ర తత్ర కృత మస్త కాంజలి' గా హనుమంతుడే పగిది యుండెనో, అట్లే పెక్కు శ్రీరామ

కార్యములందు పాల్గొనిరి. ఒకసారి వీరు శ్రీ మద్వాల్మీకి రామాయణ ప్రవచన సందర్భముగా 'శ్రీహనుమత్సేవ' యను ఇతిహాసమును విని మనసున ఉత్సాహపడి రామభక్తుని స్మరించు భాగ్యము కూడ కల్గించి నందుల కానందపడుచు, ఆ కథను పెంచి పెద్దదిగా పద్యములలో వ్రాసి ముద్రించిరి. వీరి 'శ్రీహనుమత్సేవ' ఆత్మరామాయణము వలెనే ఒహూముఖములుగా ప్రశంస పొందినది శ్రీ రామ పట్టాభిషేకానంతరము కూడా హనుమంతుడు శ్రీ రామసేవను వదలలేదు. అతని సేవ సోదరులకు, బంధు మిత్రులకు తుదకు కట్టుకొన్న భార్యకు కూడ కంటక ప్రాయమైనది. వారెట్లో హను మంతుని రాముని సేవ నుండి దూరము చేసిరి. అప్పుడు హనుమంతుడిట్లు తపించినాడు.

కం॥ కనుమూసిన, గనుదెఱచిన
గనులను బండగను సేయు కరుణానిధి నా
కనులకు గనిపింపడు నా
కనులుండియు నేమిఫలము కలుగును నాకున్ ?

గీ॥ ఎందు బోవుదు ? నాకిపుడేది మార్గ
మెటుల నాప్రభు దర్శనమే బడయుదు ?
నేలపై బడ చేపనై నిలువ వలసె ?
రామ యడియేమి ? నా యపరాధమయ్య.

సరళముగా వ్రాయట నేర్చిన వారెంతటి విషయమునైనను అతి మనోహరముగానే వ్రాయుదురనుట కిది నిదర్శనము. శ్రీ గురుమూర్తిగారు సంఘ సేవా పరాయణులు. కీ॥ శే॥ కల్లూరు సుబ్బారావు గారితో బాటు రాజకీయ రంగమున కొన్నాళ్లు విహరించిరి వీరు జాతీయ భావములు గల వారు. వీరి కిద్దరు కుమారులు. ఒకరు శ్రీ నారాయణరావు గారు, రెండవ వారు శ్రీ రామమూర్తిగారు. వీరికి పలువురు మనుమలు, మునిమనుము లున్నారు. కవిగారు తమ 82వ యేట తనువును చాలించి శ్రీరామ పద సన్నిధిని చేరుకొన్న శ్రీరామభక్తులు.

విద్వన్మణి—కవికోకిల—విద్వాన్

# శ్రీ మాద్గుల వేంకటరామాశాస్త్రి



జననము - 27—2—1915

నిర్యాణము:- 26—11—1978

జన్మస్థలము — మణేసముద్రము, హిందూపురం తా॥ అనంతపురంజిల్లా

తల్లి —శ్రీమతి సీతమ్మ

తండ్రి —శ్రీ భాస్కరప్ప

మతము, కులము — హిందూ-వైదిక బ్రాహ్మణ-ఆత్రేయస గోత్రులు.

హిందూపుర పట్టణమునందు కవికోకిల బిరుదాంకితులగు శ్రీమాద్గుల వేంకటరామశాస్త్రుల వారి పేరు వినని వారు లేరు. వారు హిందూపురము నందు చిరకాలము ఉన్నత పాఠశాల ఆంధ్ర పండితులుగను, ఆయుర్వేద వైద్యులుగను, పురాణ ప్రవచన కర్తలుగను వాసికెక్కిరి. సనాతన వైదిక బ్రాహ్మణ కుటుంబీకులగుటచే బాల్యమునందే వేదాధ్యయనము గావించి, పంచదశకర్మల అధ్యయనానుభవమును గడించిరి కర్నూలు సంస్కృత పాఠశాలయందు పంచకావ్యములు, నాటకములు, వ్యాకరణములను నేర్చిరి, శ్రీమాన్ విక్రాల వేంకటాచార్యులు, శ్రీ వెల్లాల శంకరశాస్త్రులు వీరి విద్యాగురువులుగా బాసిల్లిరి. తదుపరి విజయవాడ శ్రీ వేంకటేశ్వర కళాశాలలో ఐదేండ్లు చదివి, 'ఆయుర్వేద విశారద' పట్టము బొందిరి. 1948తో మద్రాసు యూనివర్సిటీ వారిచే నిర్వహింపబడుచున్న 'విద్వాన్' పరీక్ష యందుత్తీర్ణులైరి. శ్రీ శాస్త్రిగారు కొన్నాళ్ళపాటు రాయదుర్గము, ఆదోని, కడప హైస్కూళ్లలో తెలుగు పండితులుగా పనిచేసి, కడపట హిందూపురం మహాత్మాగాంధీ పురపాలకోన్నత పాఠశాలలో ఫస్టుగ్రేడ్ తెలుగు పండితులుగా పనిచేసి ఉద్యోగ విరమణ గావించిరి.

సంస్కృతాంధ్ర సాహిత్యములందు వీరికి చిన్నతనము నుండియు మక్కువ గలదు బాల్యము నందే కవిత్వము వ్రాయుట వీరి కలవడినది. సాహిత్యలోకమున వీరు 'మాశాస్త్రి' గారుగా వ్యవహరించబడిరి వారి పొట్టి సంతకము మా వే శాస్త్రి తుదకు 'మాశాస్త్రి' గా మారినది. వీరు గురువులకు, పూజ్యులకు, దైవమునకు, తల్లిదండ్రులకు వినమ్రత చూపువారేకాని పరులకు తలవంచు వారుకారు.

దాస్యజీవనమును కాలదన్ని నేను
లోకమను నాట్యరంగాన ఉప్తమైన
పౌరుషోదాత్త జీవికపాదుకొల్పి
కొంత నటియించు చున్నాడ సొంత నముడ.

అని తమ 'నడవడి'లో వ్రాసుకొన్నారు. జీవితమొక నాటకరంగ మనుమాట వాస్తవము. అందు మనమెల్లరము పాత్రధారులే కదా! కవిగారు సర్వతంత్ర స్వతంత్రులు. అట్లనివారు విచ్చలవిడిగా సంచరించ లేదు.

పరవనితలన్న, నొరుసొమ్ము దోఅయు టన్న
నలము కొనెడు నశక్తి నాకట్టి తఱిని
పాపభీతియు నేహ్య భావంబు గల్గి
పరితపించును నాయాత్మ వలవదంచు.

ఇట్టి సద్గుణములే వారి జీవిత సౌధమునకు పునాదులైనవి. వీరు నిత్య సంతోషులు. ఉన్నదానితో సంతుష్టి చెందు నిండు హృదయులు. లేని దానికి వ్రాకులాడు స్వభావము వారికి లేదు. తమలోని సద్గుణములే యితరుల కలవడ వలెనని ఆశించెడి ఉదారులు వీరు.

ఎంతయున్నను సంతుష్టి నెఱుగ రకట!
వారి తల్వ్రాత కెవ్వారు బాధ్యులవని

నిత్య సంతోషమే జన్మకత్యవసర
మంచు, జీవింతు నే శివమంచు కృతము.

ఇట్లే కవిగారు మానవాళికి ప్రబోధ గావించిరి. వీరి ప్రబోధన లన్నియూ మానవకోటిలోని తమస్సును పటాపంచలుచేసి, వారిని జాగృతము చేయునవియే ఈ ప్రబోధలు బోధనలవరకే కాదు, ఆచరణ యోగ్యములు కూడ. కవిగారు సహితము తమ నిత్య జీవితమందు వాటిని శోధించి, సాధించి, ఆచరించి మన ఆచరణలకు వదిలిరి యువకులను కవిగారెట్లు ప్రబోధించిరో చూతము.

శివాజి యెడిరో ఉడికిన రక్తం
మహాత్ము మతిలో మరగిన రక్తం
సుభాసు చేతుల జెరగిన రక్తం
మన రక్తంలో పొంగాలోయ్ ॥ఓ యువకులారా॥

ఆధునిక గేయ పోకడలలో రచనలు చేయుట యందు కూడ వీరు సిద్ధహస్తులే. పారశాలలో గ్రాంధికము, పత్రికలలో వ్యవహారికము, సాహిత్యంలో భావ విప్లవ కవిత్వము, చోటు చేసుకొను ఈ సంధియుగము భావకులై ఛందోబద్ధ కవిత్వము చేపట్టిన కవివరేణ్యుల రాణింపున కొక అవరోధవశమైనది శ్రీ శాస్త్రిగారి విషయమున అది దూరమైనది.

ఈ ప్రబోధ గీతములన్నియు 'ప్రబోధ గీతాంజలి' యనుపేర శ్రీ శాస్త్రిగారు 1962 వ సం॥న ప్రకటించిరి. ఇందలి భావగీతములు దేశికవిత, వృత్తము, అధునిక గేయము మున్నగు రకములుగానున్నవి. ఇందు ధ్వని, వ్యంగ్యములకే ప్రాముఖ్యతఇవ్వబడినది ఇందు కవి ఆలోచనలు స్రవంతిగా సాగినవి 'ప్రజాప్రభుత్వము'ను శీర్షికలో 'ప్రభుత్వమేదోచేస్తుందనకోయ్ –ప్రభుత్వమంటే మనమేకాదోయ్' అంటూ ప్రజలను ప్రబోధించారు. అంతియేగాక,

'కుంటీ గ్రుడ్డీ సోమరిపోతుల
కింటా బయట పని-పెట్టాలోయ్
భిక్షం అంటే-అవమానంగా
భిక్షం అంటే-అతినీచంగా
భిక్షకు లిప్పుడు-ఓటరురాజులు
భిక్షాలకు నిక-గురియౌతారా ?

అంటూ 'గరీబీహటావో' నినాదమును ప్రజలకు వినిపించారు. ఇందులో కొంత వ్యంగ్య ధోరణికూడ ద్యోతకము కాగలదు.

వరకట్న నిషేధముపై ఒక కవిత వ్రాసి, యువకులకిట్లు రోషమునూరి పోసిరి.

రోపిన కాసుల-కాసింపకుమా
మీసముగల యా-మగవాడైతే'

ఇట్లైన్నో విషయములిందు ప్రబోధించిరి

తదుపరి వీరి 'శతకభారతి' ఒక శతకము. ఇందు కూడ అనేక భావములు కలగా పులగముగా చొప్పించబడినవి. అవి కవిగారి లోగల ఆవేశపు మచ్చుతునకలు. కొందరికీతని మతము పట్టక పోవచ్చును, కాని తన మతము తనదిగా లెక్కించుకొన్న వారు వీరు. అందుకే వారిట్లు వ్రాసు కొన్నారు.

ఉ॥ గ్రాంధిక మందు ప్రేమ, సమకాలికమౌ వ్యవహారకంపు, ని
ర్బంధము నామనఃస్థితిని బల్విడిఁ గ్రుంగగ జేయు చున్నదీ
సంధి యుగమ్ములో నెటుల సాగునో నా కవితాకుమారి, సం
బంధము ఛాందసంబొకో? యవైదికమో? యిది భారతావనీ!

ఉ॥ పుత్రులు బెక్కు-రం గనిన-పుణ్యము నాయది, దాని కెందు నే
మాత్రము సిగ్గిలన్, సఖులు మాత్రము నాకథ విన్న, బుణ్యుడీ
వే! త్రిజగమ్ములందు ననరే, యదె చాలును, బుత్రులెల్లరున్
బాత్రులు విద్యలన్ వినయ భాసితులై మన, భారతావనీ!

ఇందు వీరి సత్సంతాన విషయమునుకూడ ప్రస్తావించిరి. వీరికెని మిది మంది పుత్రులు. పుత్రికలు లేరు. వీరందరూ ప్రస్తుతము మంచి దశలోనున్నారు. వారందరూ విద్యావేత్తలే. నిజముగా వీరి కంటెను పుణ్యాత్మలెక్కడున్నారు ? వీరికి మనుమండ్లు కూడ వున్నారు.

శ్రీ మాడ్గుల వేంకటరామాశాస్త్రుల వారికి కీ॥ శే॥ పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారిపై పితృవాత్సల్యమున్నది సుబ్బారావుగారు వారిని చిన్ననాటి నుండి ఆదరించినవారే. వారి విద్వాన్ పరీక్షలకు ఫీజులు కట్టి చదివించి, తదుపరి యుద్యోగవిషయమున కూడ సహాయ పడినవారే అట్టి పితృసమా నుల ఋణ మెట్లు తీర్చుకొన వలెననెడి తలంపు శాస్త్రిగారికి కలిగినది భగ వంతుడు మార్గము చూపించినాడు. కల్లూరు సుబ్బరావుగారు రాయలసీమలో పేరెన్నికగన్న ఆంధ్రభోజులు. వారి సప్తతి శాంతి మహోత్సవ సందర్భ మున 'శ్రీ సుబ్బరాయ సప్తతి సువర్ణాభిషేకము'ను గ్రంథమును వ్రాసి కృతి సమర్పణ గావించి ధన్యులైరి. ఈ కృతియందే శ్రీశంకరాచార్య విరచిత మగు సంస్కృత కనకధారాస్తోత్రమును 'కనకధారాస్రవంతి'గా అనువదించి ముద్రించిరి శ్రీ సుబ్బరావుగారి గుణవిశేషములనిట్లు కవిగారు కీర్తించిరి.

సీ॥ కవ్వించు నొకమారు గదన రంగములకు
యువకుల నుబ్బూత లూపి రేపి
నవ్వించు గడుపుబ్బ నానారసోల్లాస
హాస్యకృద్భావ్య కావ్యప్రసక్తి

గుప్పించు నొకమారు గురుబోధ మలకించి
ఆత్మతత్వార్థ మహత్త్వ మెఱిగి
వెల్గించు నొకమారు విజ్ఞాన దీపమ్ము
వేదవేదాంగ సంవేది నాగ

తే॥గీ॥ భారతము రామచరితమ్ము—భాగవతము
భక్తితో భగవద్గీత వల్లెవేయు
ననుదినమ్మును ముసలి విద్యార్థియగుచు
జోక సత్కావ్య గోష్ఠి శ్రీ సుబ్బరావు.

తదుపరి వీరు కొంతకాలము పుట్టపర్తిలోని శ్రీ సత్యసాయిబాబాగారి సన్నిధిలో గడిపి, మానసిక శాంతిని పొందిరి. వారికి సత్యసాయిబాబాగారిపై నమ్మకము పుట్టి కొన్ని పుస్తకములుకూడ వ్రాసి ముద్రించిరి. వాటిలో 1) శ్రీ సత్యాదిత్య హృదయము, 2) శ్రీ సత్యసాయి మహిమ కలవు. వీరి అముద్రిత కృతులుగా శివగీతికందము—తుకారాం చరిత్ర (మూడు అశ్వాసములు) శ్రీ కామేశ్వరీ విలాసము, శ్రీ దుర్గాసప్తశతి, శ్రీ మదగ్నిమణాయనమ్ (650 శ్లోకములుగల, సంస్కృత కావ్యము) మిగిలిపోయినవి. వీరి సంస్కృత భాషా పాండిత్యమునకు 'శ్రీమదాంజనేయ సుప్రభాతమ్' ఒక మచ్చుతునక. శ్రీ మాడ్గులవారు ఉభయ భాషా కవిమిత్రులు గదా !

1959 సం॥ నందు హిందూపుర పట్టణమునకు శ్రీ కూడ్లీ శృంగేరి పీఠాధిపతులు జగద్గురువులైన శ్రీ సచ్చిదానంద శ్రీ శంకర భారతీస్వామి వారు విచ్చేసిన సందర్భమున వారేర్పాటు గావించిన కవిపండిత గోష్ఠిలో కవిగారికి 'కవికోకిల' యనుబిరుదము నిచ్చి సన్మానించిరి. వారి కవిత్వము నకు తోడు వారి కంఠమాధుర్యము తోడైనందున 'కవికోకిల' బిరుదము వారికి పూర్తిగా ఒప్పినది.

శ్రీ శాస్త్రిగారిది నిండైన విగ్రహము. సదా దరహాస మాతని ముఖ కమలము నందు ప్రస్ఫుటించెడిది విద్యార్థులను వారు సదా నవ్వించెడివారు. ఒకసారి ఒకి విద్యార్థి బృందము వారి ఆకారమును చూచి, లంబోదరుని చూచిన చవితి చంద్రుని పగది నవ్వెను. వారు కోపగించుకొనక "ఓరే_ ఆ నాయకుడు, నవ్విన చంద్రుడికి శాపమిచ్చాడు. ఈ వినాయకుడు మిమ్ముల నాశీర్వదిస్తాడు ఈ బొజ్జలో సంస్కృతాంధ్ర పాండిత్య పూర్ణముతో చేసిన కరకరలాడే సాహిత్య కుడుము లున్నాయి" అని ఛలోక్తివిసరి, అందరిని నవ్వించి, తాను నవ్వెడివారట! అట్టి కవికోకిల విందుగా నూరు వసంత శోభలను చూడకనే గగనమున కెగిరి పోయినది. అది అరువది రెండు వసంతము లవరకే పాడినది.

ఇంత వరకిట్టి మార్గాన సంతరించె
జీవితరథమ్ము, విశ్రాంతి జెందగోరి
యెవటకేగునొ? యేమౌనొ? యెఱుగనేర
మంచిమార్గాన నడచెడు మమత కలదు (ప్రబోధగీతాంజలి)

శ్రీ శాస్త్రిగారు తాము వ్రాసుకొన్నట్లే మంచిమార్గములందు నడచిన వీరి జీవిత రథము, పరమ శివుని కైలాసమునకే దారితీసినది వారు ప్రాతః స్మరణీయులు. వారి ఆశయములు సదా ఆచరణీయములు వారు తమ అనుశాసనము నందిట్లు వ్రాసుకొనిరి.

నాదు వస్తువులవి నాణ్యమ్ములై యుండు;
వాని దీపికొన్న వారు మరల
నెచట నున్నవాని నచటనే యుంచంగ
వలయు లేద తాక వలదు వాని.

కవిగారి ఆశయములను వారి సంతతి వారు కాపాడుదురుగాత!

'కవికోకిల, విద్వన్మణి, విద్వాన్ శ్రీ మాద్గుల వేంకటరామశాస్త్రి గారు' అని సంపూర్ణ బిరుదాది నామధేయములతో స్వాగతము పలికినప్పుడు "అవన్నీ అక్కరలేదయ్యా! నన్ను 'శాస్త్రి' అనండిచాలు" అని పలికిన నిగర్వి మనకికలేడు వారి ఆత్మకు శాంతి కలుగుగాక!





## శ్రీ డి. బాబన్న యాదవ

జననము - 15-12-1904

జన్మస్థలము - హిందూపురం
అనంతపురం జిల్లా

తల్లి - శ్రీమతి వరసాంబ

తండ్రి - శ్రీ వెంకటరమణప్ప

మతము కులము - హిందూ - యాదవ

శ్రీ డి. బాబన్నగారు హిందూపుర పట్టణమున ఒక ప్రభుత్వ ఉద్యోగిగా పనిచేయుచు విరామ సమయము లందు తమకు గల్గిన భావములను వ్యాసముగా వ్రాయు చుండిన అజ్ఞాత రచయితలు వీరజ్ఞాతముగా వుండుటకు ప్రధాన కారణము, ప్రభుత్వ ఉద్యోగమనియే చెప్పవచ్చును. వీరు ఆంగ్ల భాషల యందు కూడా రచనలు చేయగల సమర్థులు వ్యవసాయ దారునిగా తన జీవయాత్రను సాగించిన ఈ రచయిత తండ్రిగారే మంత చదువు కొన్న వారు కాక పోవుటచే వీరి పెదతండ్రి గారే కవి గారి చదువుకు దోహద కారులైరి. శ్రీ బాబన్న గారు తమ యస్. యస్ యల్. సి వరకు

త్యములో ప్రహసనముల కొక విశిష్ట స్థానము లేక పోలేదు. ప్రహసనము దశ విధ నాటకములలో నొకటి, శాస్త్ర సమ్మతమైనది కూడా. ఈ ప్రహసనము లు మానవులనన్ని రంగముల యందును ప్రభావితము చేయుచున్నవి తెలుగుదేశమున శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు గారి ప్రహసనములు, మఱియు శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారి, ప్రహసనములు తలమానికములై కీర్తిగాంచినవి. ఆ ప్రహసనములు కడుపుబ్బ నవ్వించు నవియే కాదు, సంఘమందలి లోపముల నెత్తిచూపు చున్నవి. ఆ ప్రహసనములు సంఘ, కుల, మత, ప్రభుత్వము మున్నగు అన్ని రంగములందలి దోషములను చూపెట్టునట్టి విలువ టద్దములు. ఆ కారణముగానే కవులు తమ రచనలలో ప్రహసనములకొక ఉన్నత స్థానముల విచ్చుట జరిగినది. శ్రీ డి. బాబన్న గారి మయూర ప్రహసనము, కూడా ఆ కోవలో చేరినదని చెప్పవచ్చును.

హిందూపుర మందలి శ్రీ ఆరణ్యనారాయణ మూర్తిగారు 1910-12వ ప్రాంతముల మధ్య 'మునిసిపల్ ప్రహసనము' 'కవి దర్బారు' 'ప్రహసన మంజరి' మున్నగు వాటిని వ్రాసి సంఘములోని కుళ్లును బాహాటముగా ఎత్తి చూపి ప్రజలకు మేలు కలిగించిరి. శ్రీ బాబన్నగారి సహసనమందు కూడా మనకిట్టి విషయములే గోచరము కాగలవు. ఈ ప్రహసనము ను విషయాను క్రమముగా వ్రాయక కొన్నిరంగములుగా విభజించి ఆయా పాత్రలచే ఆయా విషయములను చెప్పించిరి. తొలి రంగమున గోపాలశర్మ మిస్‌లీలా వీరిరువురి సంభాషణలు కొనసాగును. ఈ సంభాషణలలో ప్రహసనములు-వాటి పుట్టుక, ఆంగ్ల, కన్నడ, తెలుగు నాటక రంగపు తీరుతెన్నులు సినిమాలు వాటి రచనలపై ప్రసంగములు కొనసాగినవి తదుపరి ఘటనపై. విషాద హరిశ్చంద్ర నాటకముపై ధ్వజమెత్తి చర్చగావించినారు దొంగ వేషాలు వేయు హరి దాసులను, టోపీదాసులుగా ఎత్తిచూపి, ఒక చురుకును మాటించిరి ఇక ప్రజా ప్రభుత్వముపై మంత్రులపై దేశము చేయుచున్న అప్పులపై అతి చమత్కారముగా రచన సాగించిరి. ఈ ప్రహసనము నందు అట, నట కొన్ని ప్రాంతీయ నానుడులను చేర్చుట ద్వారా హాస్యమునకు

కొంత రాణింపు వచ్చినది. పోలీసును 'అగ్గిపుల్లగా' సేల్సుటాక్సు ఇన్‌కమ్ టాక్సు ఆఫీసర్లను మిడుతలదండు గా, నేటి సినిమాలు 'కచడా సినిమాలుగా, నేటి మంత్రులు 'దశమ గ్రహాలు' గా, కేంద్ర పరిపాలన రాజు గారి గుఱ్ఱము వ్యవహారములాంటిది' గా, ప్రభుత్వ పన్నులు 'కాపును కరణాలు కంది గింజ మోస్తరు వేయించి, పీడించి తిన్నట్లుగా, చీట్ల పేకాటను అఖండరామ భజన' గా చమత్కరించి కడుపుబ్బ నవ్వించినారు.

తదుపరి వీరి 'వీరులు—వీరపూజ' కూడ ఒక వ్యాస సంపుటియే ఇందు కొందరు ప్రముఖ వీరుల వీరోచిత గాథలను చేర్చి నిర్వీర్యులైన ప్రజలకు వీరత్వమును నూరిపోయుటకు కృషి చేసిరి. గాంధీ, వల్లభాయి పటేలు స్వాతంత్ర్య సమర వీరులుగాను, శివాజీ హిందూ మతోద్ధరణకు పాటుబడిన మహారాష్ట్ర వీరుడుగాను, భారత రామాయణ కాలము నాటి వీరులను ప్రాచీన వీరులుగా నిందు పరిగణింపబడిరి. వీరే కాక అధర్మము నణచి ధర్మోద్ధరణకై కంకణము కట్టుకొన్న మహనీయులు, అంతశ్శత్రువు లను జయించిన స్త్రీ పురుషులందరు కవిగారి దృష్టిలో వీరులే. ఆభావన మిందు కవిగారు చక్కగా సమన్వయ పరచిరి.

శ్రీ బాలన్నగారికి చిన్న తనము నుండియే భగవద్గీతపై ఒకప్రత్యేక మైన ఆసక్తి ఏర్పడినది. పెనుకొండలో వీరు యస్ యస్ యల్. సి చదువు చున్నప్పుడే ప్లీడరు శ్రీ జి. వెంకటసుబ్బయ్య గారితో పరిచయ మేర్పడి వారిద్వారా భగవద్గీత పఠన ప్రారంభమైనది వారొక ఆంగ్ల భగ వద్గీతను దానికి సరితూగు శ్రీ ఆదిపూడి సోమనాథరావు గారి పద్య భగవద్గీత నిచ్చి నిత్యపారాయణము గావించుమని కోరిరి. అప్పటి నుండి కవిగారి మనోవీధిలో గీతార్థరేఖ గీయబడెను. ఉద్యోగ విరమణానంతరము గీతా సారము నంతటిని ఆధునిక పరిస్థితులకు సమన్వయ పఱచుచు సోదాహరణము లతో, సామాన్య పాఠకులకు కూడ సులభముగా అర్థమగునట్లు వచనములో వ్రాయ తలపెట్టిరి ఆ కృషి 1979 నాటికి ఫలించినది. దీనిని శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాల వారు తమ 24 వ పుష్పముగా ప్రకటించిరి.

భగవద్గీతలోని 18 అధ్యాయముల సారమును 22 శీర్షికలుగా విభజించి వ్రాసిరి. ఇందు 12 జ్ఞాన సూత్రము అనుభాగము ప్రముఖముగా చదువదగినది. ఈ గ్రంథముపై ఆంధ్రప్రభ - ఆంధ్రపత్రికలు తమ అభిప్రాయముల నిట్లు వ్రాసినవి.

"ఇది అనువాదంకాని, వ్యాఖ్యగాని, సారంకాని కాదు. భగవద్గీతను బాగా అవగాహన చేసుకొన్న రచయిత గీత మనకు ఏమి చెప్పుచున్నది. సులభమైన పద్ధతిలో పెక్కు శీర్షికలలో వివరించారు. భగవద్గీతలోని విషయాలను సులభంగా అవగాహనము చేసుకొనుటకు ఈపుస్తకము బాగా ఉపయోగిస్తుంది — 'ఆయాస్య'

"ఇందు రచయిత అక్కడక్కడ నారాయణ పండితుల పద్యాలు ఆదిపూడి వారి పద్యాలు ఉదహరించినారు. సాంఖ్యవివరణ, 12 జ్ఞాన సూత్రాలు అనే భాగం ప్రముఖంగా చదువవలసింది. అలాగే సాధన సంపత్తికి బాబన్నగారిచ్చిన మార్గాలు మరీ గమనీయాలు. భగవద్గీతపై ఎన్నో రచనలు వస్తున్నాయి వస్తాయి. ఇది పులుముడు లేకుండా, అంతర్యమును తేట తెల్లముగా తెలిపే రచన, కనుక గీతా విషయమును సులభముగా తెలుసుకోగోరు వారికి, వరప్రసాదము వంటిది. అని నిస్సంకోచముగా చెప్పవచ్చును. ఆధ్యాత్మిక తత్త్వమును అందరికి అందుబాటుగా బోధించే ఉత్తమ కృతి—"శ్రీ యామిజాల పద్మనాభ స్వామి".

శ్రీ బాబన్నగారు 1979 లో అనారోగ్యమువల్ల ప్రభుత్వ ఆస్పత్రిని చేరిరి. అప్పుడు వారికీఅశాశ్వత కాయమున్నంతలోనే తాను వ్రాసిపెట్టిన 'భగవద్గీతా సందేశము' ను ప్రకటింపవలెననెడి దృఢసంకల్పము కలిగినది. శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలకు రూ॥ 1000/— సమర్పించి గ్రంథమాల ద్వారా వెలువరింపజేసిరి. వారి సాహిత్యసేవకై ఉదారముగా విరాళముల నిచ్చిన దాతలు. సౌమ్య స్వభావులు, నిరాడంబరులు, దేవబ్రాహ్మణులయందు భక్తి విశ్వాసములు గలవారు. కళాప్రియులు. విద్యా సంస్కారణలందు సత్వ

రాశి వృద్ధిని కోరు ఆదావాదులు వీరు రెండు వివాహములు చేసుకొన్నను సంతానము పొందలేక పోయిరి. వీరి కృతులే వీరికి పుత్రరత్నములుగా మిగిలినవి. 1956 వ సం॥ నుండి వీరు హిందూపుర మండలి శ్రీకృష్ణ దేవరాయ గ్రంథమాలకు కార్యదర్శిగా పనిచేయుచున్నారు. వీరికి ప్రాంతీయాభిమానము హెచ్చు రాయలసీమలో అజ్ఞాతముగా బడియున్న విశిష్ట వ్యక్తులందరిని గూర్చి లోకమునకు పరిచయము చేయవలెననెడి సంకల్పముగల వారు. ఆ ఉద్దేశ్యము తోడనే వారు 'స్థానిక గొప్ప వ్యక్తులు' అను పేర అప్పుడప్పుడు కిరుపత్రికలను ముద్రించి, సాహితీ లోకమున కందించెడి వారు. వీరి కృషి పలువురి ప్రశంసలను పొందినది.

తదుపరి వీరి ఆంగ్లరచనలలో ముద్రితములు 'లిటరరీ మ్యూజింగ్స్'- (Literary Musings) మాడరన్ పొయిట్రీ (Modern Poetry) రాగూరు వారి గీతాంజలి పద్యములను, కొన్నింటిని అనుసరణీయ పద్యములుగా విందు పొందుపరచిరి. వీరాంధ్రాంగ్ల భాషా సాహిత్యము లందెన్నదగిన కృషిని గావించిరి. విశ్వశ్రేయోమతము - 'Glimpses into English Literature' అనునవి, వీరి అముద్రితములుగా నిలిచిన వ్యాస సంపుటములు. 77 ఏండ్ల ఈ వయస్సులో వీరు ఏకాంత జీవితమును గడపుచు చదువు, వ్రాతలందుత్సాహము చూపుచు, సాహిత్య సభలందు శ్రోతగా పాల్గొనుచు, భావకవిత్వ రంగములోనికి దూకుదునా యని యువ్విళ్లూరుచున్న నవనవోన్మేష బాలవృద్ధ కవులనటలో పొరబాటు లేదు. వీరికి భగవంతుడు ఆయురారోగ్యముల నొసంగి కాపాడుగాత!





కవిభూషణ — కవితిలక

శ్రీ

# కల్లూరు అహోబలరావు

జననము — 1901 జూన్

జన్మస్థలము:- కల్లూరు - హిందూపురం తా॥ అనంతపురం జిల్లా

తల్లి —శ్రీమతి అశ్వత్థమ్మ

తండ్రి.—శ్రీ గూళూరు కృష్ణప్ప

మతము, కులము — హిందూ - బ్రాహ్మణ - బడగనాడు కాశ్యపస గోత్రము.

అనంతపురము జిల్లా హిందూపురము తాలూకాలోని కల్లూరు గ్రామమున కొక ప్రత్యేకమైన విశిష్టత కలదు. ఈ కుగ్రామమొక బ్రాహ్మణ అగ్రహారముగా అన్నిరంగములందును ఆరితేరియున్నది. కీ॥ శే॥ పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారు భారత స్వాతంత్ర్య సమరాంగణ యోధులుగా, ఆంధ్రభోజులుగా వాసికెక్కుట అందరికీ తెలిసినదే. కీ॥ శే॥ యజమాన కల్లూరు వేంకటనారాయణరావుగారు కవిత్వ వేదిగాను, ఆధ్యాత్మిక తత్త్వవేత్తగాను, సంస్కృతాంధ్రాంగ్లేయ భాషాకోవిదులుగాను, జిల్లాలో విద్యాశాఖాధికారిగాను బహుగ్రంథ కర్తలుగాను పేరెన్నికగాంచి యుండుట ఆంధ్ర సాహిత్య లోకమునకు తెలియనిది కాదు. శ్రీ కల్లూరు నంజుండరావుగారు స్వాతంత్ర్య సమరయోధులుగా తామ్రపత్రమును పొందియుండుట యెన్నదగిన విషయమే. కీ॥శే॥ సి వి. రామరావుగారు కూడా ఈ గ్రామవాసులే. వీరు 'Good Earth' అను ఆంగ్ల నవల నాంధ్రీకరించినారు. కవిభూషణ, కవితిలక బిరుదాంకితులైన శ్రీ కల్లూరు అహోబలరావుగారు ఈ గ్రామవాసులే యని వేరుగా చెప్పనవసరము లేదు. ఇచ్చటి బ్రాహ్మణ యువకులు, ప్రభుత్వపు అన్ని శాఖలలోను ఉద్యోగులుగా నున్నారు.

శ్రీ కల్లూరు అహోబలరావుగారి పూర్వీకులు మైసూరు రాష్ట్రములోని 'మొళబాగు' నందు నివసించుచుండిరి. తదుపరి ఆగ్రామము వదలి కోలారు

జిల్లా, బాగేపల్లి తాలూకా. గూళూరు గ్రామము జేరిరి. వారి వంశావళి ఇట్లున్నది.

1) శ్రీ నారాయణప్ప – (కవిగారి ముత్తాత)
2) శ్రీ శంకరప్ప – (కవిగారి తాత)

శ్రీ శంకరప్పకు కుమారులు ముగ్గురు, కుమార్తెలు ఇద్దరు వరుసగా 1) నరసప్ప - 2) రామప్ప - 3) కృష్ణప్ప - 4) జానకమ్మ 5) నరసమ్మగారు శ్రీ శంకరప్పగారు తమ జ్యేష్ఠ పుత్రికయైన శ్రీమతి జానకమ్మను కల్లూరు గ్రామములోని కరణం పెద్దనారాయణప్పగారి కిచ్చి పెండ్లిగావించిరి. ఈమెకు కొడుకులు పుట్టి గిట్టిరి. కాన తన తమ్ముడైన పదేండ్లవయస్సు గల కృష్ణప్పను తెచ్చుకొని పెంచి, పెద్దజేసి ఉపనయన మొనరించిరి. కరణం సూరప్ప (కీ॥ శే॥ పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారి తండ్రి) గారి కుమార్తె శ్రీమతి అశ్వత్థమ్మను తన తమ్మునికి భార్యగా స్వీకరించిరి. ఆ దంపతుల సంతానమిట్లున్నది.

పుత్రులు :–1) కల్లూరు అహోబలరావు (కవిగారు)
2) శ్రీకల్లూరు నంజుండరావు (స్వాతంత్ర్య సమరయోధులు)
3) శ్రీ కల్లూరు శంకరరావు (ప్రముఖ వ్యాపార వేత్తలు, కీర్తిశేషులు)

పుత్రికలు:– 1) శ్రీమతి బేబమ్మ 2) శ్రీమతి రుక్మిణమ్మ
3) కీ॥ శే॥ శ్రీమతి జానకమ్మ 4) శ్రీమతి లక్ష్మీదేవమ్మ

జ్యేష్ఠులైన శ్రీ అహోబలరావుగారికి పండ్రెండవ యేటనే వివాహమైనది. వీరి భార్య శ్రీమతి సీతమ్మగారి కప్పటి కెనిమిదేండ్లు మాత్రమే వీరికి కుమారులార్గురు, ముగ్గురు పుత్రికలు కలరు అందరూ విద్యావంతులు, గృహస్థులు. వీరికి పెక్కుమంది మనుమలు, మనుమరాండ్రు, మునిమనుమలు కలరు.

వీరు తమ ప్రాథమిక విద్యను కల్లూరు హిందూపురం, ధర్మవరం గ్రామములలో ముగించి. బెంగళూరులో యస్ యస్ యల్.సి. పరీక్షలో నెగ్గి, సెకెండరీ గ్రేడ్ ట్రయినింగు పరీక్షను బళ్లారిలో ఉత్తీర్ణులై, అనంతపురం జిల్లా, కల్యాణదుర్గం తాలూకా అనేక గ్రామముల పాఠశాలలయందు హెడ్ మాష్టరుగా పనిచేసిరి బళ్లారిలో సెంట్ జాన్సు హైస్కూలులో 8,9 సంవత్సరములు సెకెండరీ గ్రేడు టీచరుగాను. తెలుగు పండితులుగాను పనిచేసిరి. వీరు విద్వాన్ పరీక్షలో ఆంధ్రము నందుత్తీర్ణులైరి.

శ్రీ కవిగారు బళ్లారి పట్టణమున ఉద్యోగము చేయుచున్నప్పుడే వీరికి రాయలసీమ కవిపండితులను, వారి పుస్తక ప్రచురణల ద్వారా ప్రోత్సహించవలెననెడి, తలంపు కలిగినది. ఆ సంకల్ప ఫలమే 1931 లో శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల స్థాపన. వీరికి శ్రీ ఘూళీ కృష్ణమూర్తి ఆచార్యులవారు, కీ॥ శే॥ హెచ్. దేవదానముగార్ల సంపూర్ణ సహకారములు లభించినవి. శ్రీ ఘూళీ కృష్ణమూర్తి గారి 'స్వార్థత్యాగము' అను నవలతో ప్రచురణ ప్రారంభింపబడి ఇప్పటి వరకు ధారావాహినిగా 40 ప్రచురణలు సాగినవి స్వర్ణోత్సవము 1981 లో గ్రంథమాలకు జరుప సంకల్పింపబడినది.

ఈ కవిగారు తమ రచనలను తొలుత శతకములతో ప్రారంభించిరి. ఇప్పటికి వీరి గ్రంథములు పది ముద్రింపబడినవి. ఎన్నియో అముద్రిత కృతులు ముద్రణకెదురు చూచుచున్నవి కవిగారి ముద్రిత గ్రంథములివి 1) కుమార శతకము (1923) 2 భరతమాతృశతకము (1923) 3) భావ తరంగములు-ఖండికలు (1931) 4) పూదోట-ఖండికలు (1951) 5) భక్త మందారము-ద్విశతి (1958) 6) ఉగాది స్వర్ణభారతి (1972) 7_8_9 రాయలసీమ రచయితల చరిత్ర_3 సంపుటములు 10) శ్రీరామకర్ణామృతము (1980)

శ్రీకృష్ణ కర్ణామృతము-గృహలక్ష్మి (కందపద్యత్రిశతి)-పుష్పబాణ విలాసము-యామినీ పూర్ణతిలక-శ్రీ లక్ష్మీనృసింహస్తోత్రము మొదలైనవి, వీరి అముద్రిత కృతులు.

కవిగారి సాహిత్యసేవను మెచ్చి హిందూపురము నందలి శ్రీరాయల కళాపరిషత్ పక్షమున శ్రీ శారదాపీఠమువారు 'కవిభూషణ' యను బిరుద మిచ్చి సత్కరించిరి. అట్లే 1960వ సంవత్సరములో శ్రీ కూడ్లీ శృంగేరి శ్రీమజ్జగద్గురు శ్రీసచ్చిదానంద శ్రీశంకర భారతీస్వాములవారు హిందూ పురమునకు వచ్చినప్పుడు వీరి కవిత్వమును మెచ్చి విందుసభలో 'కవితిలక' బిరుదము నిచ్చి, ఆశీర్వదించిరి. వీరికి బరోడా మహారాజుగారి ద్వారా దైవికముగా ఒక బంగారు పతకము లభించినది.

శ్రీ కల్లూరు వారి కృతులలో భావతరంగములు—పూదోట ప్రసిద్ధ ఖండకావ్యములు. వారనేక విషయములనిందు ప్రస్తావించిరి. భావప్రదర్శ నకు వీరు ప్రాముఖ్యత నిచ్చిరి.

స్వాతంత్ర్య సముపార్జనలో రాట్నమెట్లుపయోగపడినదో తెలు పుచు ఒకపద్యమిట్లు వ్రాసిరి.

సీ॥ రాటమా! కాదు—పోరాటంబు బిడిగించు
విష్ణుచక్రంబిద్ది పృథివి యందు
రాటమా! కాదు—ఆరాటంబు బోకార్చు
కల్పవృక్షంబిద్ది ఖండితముగ
రాటమా! కాదుపో! కాటకంబుల ద్రోలి
కడుపు నిండించెడి కన్నతల్లి
రాటమా! కాదుపో-రమణీయ సుస్వర
సంగీతముల బాడు - శారదాంబ!

గీ॥ కట్టగా మేలిరకముల బట్టలొసగి
పొట్ట నింపంగ బట్టెడు బువ్వనిచ్చి
కడుపు చల్లకదలనీక కాచిబ్రోచు
రాట్నలక్ష్మినిసేవింప రాదె మనకు? (పూదోట)

వీరి 'భక్తమందారము' బహుముఖముగా పండిత ప్రశంసపొందినది. మహాకవి సవ్యసాచి శ్రీ భీమరాయకవిగారు తమ అభిప్రాయము నిట్లు వ్రాసిరి.

ఆ. వె॥ నీసపద్యమాల—సృష్టించి నేర్పుతో
సద్వితీయు నభవు నమలరూపు
భక్తి గొలిచి నావు భక్తమందారుని
కలరె నీకుసాటి? కవివిభూష!

కవిగారు భక్తమందారమునందు శ్రీకృష్ణతత్త్వము నిట్లు వర్ణించిరి.

సీ॥ పాలకుండలఁజేసి పాలజీవము బోసి
పాలించు కుమ్మరి వాడవీవు
పాలకుండలలోని పాలపాపలకిచ్చి
తనివితో బోషించు తల్లివీవు
పాలకుండలురెండు పద్మాక్షుల కొసంగి
జగము లేలించెడు చతురుడీవు
పాలకుండల నున్న పరిపక్వమైనట్టి
వెన్నమీగడలిచ్చు విభుడవీవు

గీ॥ పాలకుండలపై నున్న భ్రాంతిద్రోలి
కుండలోపలి మధువు నాకుండజేసి
పాలకుండవు! రక్షింపు పరమ పురుష!
భక్తమందార నీకిదే వందనంబు.

శ్రీ కల్లూరివారు 1919వ సం॥ నుండి (అనగా తమ 19 యేండ్ల వయస్సు) నుండియే ఉగాదిపండుగ సందర్భముగ తమ బంధు మిత్రులకు ఉగాది శుభాకాంక్ష పద్యములు వ్రాసి, ముద్రించి పంపువాడుక పెట్టుకొనిరి. ఇయ్యది వారికి వారి గురువులైన శ్రీ యన్. కూరత్తాళ్వారు అయ్యంగారి

నుండి సంక్రమించిన ఆనవాయితి. అవి శుభాకాంక్షపద్యములు మాత్రమే కావు. గత సంవత్సరమునందు ప్రజానీకము బడిన కష్టనష్టములకు, దేశ కాలపరిస్థితులకు,దర్పణము బట్టిన ఖండికలు. వీరీకృషి నిప్పటివరకు సాగించు చుండుట వీరి అకుంఠితదీక్షకు పట్టుదలకు సాహసమునకు నిదర్శనము. ఈ ఉగాది కానుకల కిప్పటికరువది రెండేండ్లు పూర్తిగా నిండినవి. వీరు యాభై ఏండ్ల ఉగాదికానుకలను 'ఉగాది స్వర్ణభారతి'గా ప్రకటించిరి. ఇందు నాన్ కోపరేషన్ సమరమునుండి బాంగ్లాదేశ్ అవతరణవరకు భారతదేశములో జరిగిన సంఘటనలను, రాజకీయవిషయములను దేశపరిస్థితులను ప్రజల ఇక్కట్లను యథాతథముగా వివరించిరి.

తదుపరి వీరి కృతి 'శ్రీరామకర్ణామృతము' ఇయ్యది సంస్కృత మూలమునకు భావానువాదము. ఇందు శ్రీరామభక్తికి ప్రాధాన్యత కలదు పద్యనడక బమ్మెరపోతన పోకడలో సాగినది. ఈ కావ్యముయొక్క విశిష్ట తను చదివి రసజ్ఞులైన పాఠకులు తెలుసుకొనవలసినదే తప్ప వ్రాయ వలవి కాదు. ఇయ్యది బహుముఖములుగా పండితులచేత, పత్రికలచేత, ఆకాశవాణి చేత, ప్రశంసలను పొందినది.

తదుపరి వీరి వచన రచనకు రాయలసీమ రచయితల చరిత్రసంపుటములే మచ్చుతునకలు. పాఠకుల చేతిలో నున్న ఈ గ్రంథకర్త గ్రంథమును గూర్చి వ్రాయబూనుట "తినబోవుచు, కూరల రుచుల నడుగనేల" అను సామెత జ్ఞప్తికి తెచ్చును.

తన్నుగూర్చి తానుచెప్పుకొను స్వభావముకాని, ఇతరులు తన్ను పొగడ వలెననెడి జిజ్ఞాస కలవారుకాని కారు. ఒకరు పొగడినంతనే పొంగి పోవు మనస్తత్వము వీరికి లేదు. మాటలు కాక చేతలలో కార్యములు చేసి చూపవలెననుట వీరి ఆదర్శము. పట్టుదలతో పనులు చేయుట వీరికి బాల్యమునుండి అలవడిన ఒక సద్గుణము. 80 యేండ్లు నిండు వయసుతో కూడ వీరు సాహిత్య కార్యక్రమములు వదలక కొనసాగించుట ఆ భారతీ

దేవి ఆశీర్వాదము వల్లననియే చెప్పవచ్చును. శ్రీశారదాదేవి తనకండగా నెల్లవేళల నుండవలెనని వారు నిత్యము ప్రార్థించు చుందురు.

# కవికుమార సమితి



## శ్రీ మరం వాసుదేవమూర్తి

జననము 15-5-1910

జన్మస్థలము:- అనంతపురము ఆంధ్రప్రదేశ్

తల్లి :- శ్రీమతి సుందరమ్మ

తండ్రి:- శ్రీమరం నారాయణాచార్యులు

మతము, కులము :- హిందూ-బ్రాహ్మణ - మాధ్వ-వశిష్ఠ గోత్రము

1930 వ సం॥ నందు అనంతపుర పట్టణమున 'కవికుమార సమితి' అను సంస్థ ముగ్వురు యువకవుల కృషితో ఏర్పడిన దన్న విషయ మే కొద్దిమంది సాహితీపరులకు మాత్రమే తెలిసి యుండుననుటలో సందేహము లేదు. ఈ ముగ్వురు నవయువకులలో శ్రీ మరం వాసుదేవమూర్తిగా రొకరు. వీరి తండ్రిగారు న్యాయవాదులగుటచే పెనుకొండ నుండి తమ కుటుంబమును అనంతపురమునకు మార్చిరి. శ్రీ వాసుదేవమూర్తిగారి ప్రాథమిక విద్యాభ్యాసము పెనుకొండలో కొంతవరకు జరిగి, తదుపరి ఉన్నత పాఠశాల విద్యాభ్యాస మనంతపురములో సాగినది. వీరనంతపురము సీడెడ్ డిస్ట్రిక్ట్సు కళాశాలలో తమ బి.ఏ., చదువును ముగించిరి. హైస్కూలు విద్యాభ్యాసకాలములోనే తెలుగు పండితులైన శ్రీ గద్వాల సుబ్బాశాస్త్రిగారి

ప్రోత్సాహముతోను, కాలేజీలో, శ్రీ ప్రయాగ వేంకట రామశాస్త్రివారి ఆశీర్వాద బలముతోను, ప్రాచీన పోకడలలో కవితలను వ్రాయుట నేర్చిరి. బి. ఏ., ముగించులోపల తెలుగు సాహిత్యమును పూర్తిగా అవగాహన చేసుకొనిరి. సులువుగా పద్యములు వ్రాయుట నేర్చిరి. ఆంగ్లమునందు కూడా అప్పుడే వారికి కవిత అల్లుటలో నేర్పు కుదిరినది.

శ్రీ మూర్తిగారు తమ సహ పాఠకులైన శ్రీ వెల్లాల ఉమామహేశ్వరులు, శ్రీ పి. సుబ్బణాచార్యులు, తదితరులైన శ్రీ విద్వాన్ విశ్వం, శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులతో కలసి అప్పుడప్పుడు కవితా గోష్ఠులను జరిపెడివారు, అప్పుడే కవికుమార సమితి ఏర్పాటున కంకురార్పణ జరిగినది. అనంతపురములో విద్యాభ్యాసానంతరము శ్రీమూర్తిగారు బొంబాయి రీసర్చి స్కూలులో 'సామాజిక శాస్త్రమును' అభ్యసించు విద్యార్థిగా నెలకు 200 రూప్యముల ఉపకార వేతనముపై చేరిరి. అప్పుడు వారు "హైందవ యుద్ధమీమాంస' అను విషయముపై ఆంగ్ల గ్రంథము నొకదానిని వ్రాసి పి. హెచ్ డి. పట్టమును పొందిరి తదుపరి వీరు 1943 లో బొంబాయి 'టాటా ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ సోషియల్ సైన్సు' శాఖలో లెక్చరర్‌గా చేరిరి. ఉద్యోగము చేయుచు వారు కొన్ని ఉత్తమ వ్యాసములను సామాజిక శాస్త్రముపై వ్రాసి వివిధ పత్రికలలో ప్రచురించిరి. ఆ వ్యాసము లందలి యథార్థ విషయములను న్యూయార్క్, అంతర్జాతీయ విద్యాసంస్థ గుర్తించెను వారి ఆహ్వానముపై శ్రీ మూర్తిగారు ఉపకారవేతనముపై చికాగో విశ్వవిద్యాలయములో 1946–48 వరకు, పరిశోధనా కార్యక్రమములలో పాల్గొనిరి తదుపరి స్వదేశమునకు తిరిగి వచ్చిన తరువాత మనదేశపు విశ్వవిద్యాలయములందు సహితము సామాజిక శాస్త్రపు కోర్సులు ప్రవేశపెట్టుటకు బహుళ కృషి గావించిరి. ఫ్యాక్టరీ యాజమాన్య విషయములు, కార్మిక సంఘములు సంఘటనలు–వాటి పద్ధతులు మొదలగు పాఠ్యాంశములను పోస్టు గ్రాజుయేట్ విద్యాస్థాయిలో ప్రవేశపెట్టిరి. క్రమముగా ఈ కోర్సులు గౌహతి-బరంపూర్-ఆంధ్ర-కర్ణాటక మొదలగు విశ్వవిద్యాలయములలో ప్రవేశపెట్టిరి. తదుపరి అధికారులు శ్రీ మూర్తిగారిని అధ్యాపకులుగా నియమించుట జరిగినది.

1962 వ సం॥లో U. N O. (అంతర్జాతీయ సంస్థ) కు చెందిన సాంకేతిక విజ్ఞాన విభాగము నుండి వీరు కార్మిక పరిపాలక వర్గము యొక్క (Personal Management team) జాతీయ నాయకుడుగా ఎన్నిక కాబడిరి. ఆ సందర్భమున జపాను, అమెరికా, (పూర్తిగా) ఇంగ్లాండు ఫ్రాన్స్, స్విజ్జర్లాండు, మున్నగు విదేశములలో పర్యటించి అక్కడ కార్మిక యాజమాన్యముపై పరిపాలనపై, ఒక గ్రంథము వ్రాసిరి. ఈ విధముగా వీరికి విదేశ పర్యటనజేయు సదవకాశమును భగవంతుడనుగ్రహించెను.

1963 వ సం॥లో 'ఆంధ్ర విశ్వవిద్యాలయము' వారు వీరి విద్యా ప్రౌఢిమను గమనించి అధ్యాపకునిగా ఆహ్వానించిరి. అక్కడే 1969 లో విశ్వవిద్యాలయాధిపతిగా పనిచేసిరి. 1976 లో పదవీ విరమణగావించి, మరల కాశీ విద్యాపీఠమువారు వారణాశిలో అధ్యాపకులుగా నుండ నాహ్వానింపగా ఇట్లు 1970 వ సం॥ పూర్తి విరామమెరుగక కృషిచేసి, తుదకు బెంగళూరులో తమ స్వగృహమునందు స్థిరపడిరి. ఈ విరామ సమయములందు కూడా వీరప్పుడప్పుడు బెంగళూరు యూనివర్శిటీ వారిచే తాత్కాలిక అధ్యాపకులుగా నుపన్యసించుటకాహ్వానింప బడెడివారు.

శ్రీ మూర్తి వర్యులు సంస్కృత భాషపై అభినివేశము సంపాదించిరి. అందులకు వీరి 'హైందవ యుద్ధ మీమాంస' అను గ్రంథమే దోహదకారియైనది. వీరు సంస్కృతమున చిన్నచిన్న కథలను వ్రాసి సంస్కృత భవితవ్యం' అను పత్రికలో ప్రకటించిరి. సంస్కృత పండితుల ఆదరణ పొందిరి.

శ్రీ మూర్తిగారి కొన్ని ఆంగ్ల గ్రంథములు ఎం. ఏ., పరీక్షకు పరిశీలనా గ్రంథములుగా ఎన్నిక చేయబడినవి. వాటిలో కొన్ని

(1) Principles of Labour welfare.

(2) Beggers' Problem.

(3) Philosophy Friends of Social work.

(4) Work participation in welfare

(5) Social Action.

మొదలైనవి. ఇంకనూ వీరు కొన్ని పుస్తకములను వ్రాసి, ప్రకటింపబోవుచున్నారు. అనంతపురము వదలిన తరువాత వీరి రచనా వ్యాసంగమంతయు ఆంగ్లమునందే అధికముగా జరిగినది. ఈ విషయము వీరిని ప్రశ్నించగా వారిట్లు జవాబిచ్చిరి.

"అనంతపురము వదలిన తరువాత తెనుగులో వ్రాయుట మానివేసితినని చెప్పుటకు లజ్జించుచున్నాను. ఇప్పుడు కేవలము సంస్కృతాధ్యయనమే నాకు పరిపాటియైనది. ఇంగ్లీషు రచనయే అనివార్యమైనది. అనంతపురమునందు వ్రాసి ప్రచురించిన కొన్ని ఖండికలే తప్ప మఱల నేనేమియు వ్రాయలేదు. ఆ ప్రచురణలే నన్నొక తెనుగు కవిగా సాహిత్యలోక మాదరించినది. తెలుగు కవినని చెప్పుకొను సాహసము నాకులేదు

'కవికుమార సమితి' వెలువరించిన ఖండకావ్యములు రెండు. మొదటిది 'తొలకరిచినుకులు' రెండవది క్రొక్కాఱు మెఱుగు' ఈరెండునూ, కవికుమారులైన శ్రీ వెల్లాల ఉమామహేశ్వరరావు-శ్రీ మఠం వాసుదేవమూర్తి శ్రీ పాళ్ళూరు సుబ్బణాచార్యులు వ్రాసినారు. కళాశాల కులపతులైన డాక్టర్ చిలుకూరి నారాయణరావుగారు ఈకవికుమారుల విట్లు సంబోధించిరి.

కవికుమారకులార — కదలి రండయ్య
కన్నుల పండువై — కనిపించె జగతి
తొలకరి మాలక్ష్మి — తొంగి చూచింది
తొల్లింటి తాపము — తొలగి పోయింది
కాపు పాటలలోన — కలదురా తీపి
కాపు చేతులలోన — కలదురా లచ్చి
కాపు మాటలలోన — కలదురా తీపి
కాపు మానసములో — కలదురా తేట

కాపు పాటలు మెచ్చి—కాపు చేతల జొచ్చి—కాపు మాటల జొక్కి—

కవికుమారకులార — కదలి రండయ్య
కాపు కైతల గూర్చి — కలసి పాడుదము

శ్రీ మూర్తిగారిని గూర్చి కీ॥ శే॥ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మగారిట్లు తమ అభిప్రాయములను వ్రాసిరి.

'శ్రీమూర్తిగారు కవనమందు చెప్పవలసిన మాటనేదో యొక క్రొత్త తీరున జెప్పుదురు. గంభీరమైన యోచనలు, అపూర్వమగు పోకడలు, నిరర్గళమగు నుత్సాహము, వీరి రచనలలో కలదు' వాడిన ఒక శుష్క పుష్పమును గూర్చి శ్రీ మూర్తిగారిట్లు వాపోయిరి.

సీ॥ మొగ్గయై పెఱిగిన—మొదలు క్రొంబువ్వగా
ప్రేమపెంచిన తల్లి—రెమ్మ యేది?
మకరందమును బొంద—మధురంబుగా వాడు
నెలతేటి బయకాండ్ల—బలగ మేది?
చల్లతెమ్మెర వల్ల—నెల్లతావుల గొల్ల
గా విలసిల్లు నీ—తావు లేది?
చేత నంటిన యంత—జెడి వాడి జెందెడి
లలిత తావక కోమ—లత్వ మేది?

గీ॥ పూర్వ వైభవంబుల నెల్ల-బోవ నాడ
నీకు గలిగెనే? చెల్లబో!—నీదు జాడ
యెఱుగ నయ్యెను పుష్పమా! యీ పువాడ,
స్వల్పజీవికాదె మనోజ్ఞ-వస్తు వేది?

తానే బ్రహ్మదేవుడై యున్నచో యిట్టి స్వల్పజీవుల కెల్లరకును విందుకాలము ఆయువు పోసియుందునని కవిగారు ధైర్యముగా 'అజాడనైతే' అను శీర్షికలో వ్రాసుకొనిరి.

ప్రాణములు వోయగల యట్టి యజాడనైన
బసరు టాకుల తెరలలో ముసిముసి నగి
పదవడి మలిన స్థండిల పతితమై, కృ
శించు, మృదుల పుష్పము చిరంజీవిజేతు.

తదుపరి కవిగారు అందమైన వస్తువు లతి శీఘ్రముగా హతమారుటకు గల కారణము లేవియో తెలిసుకొనుటకు ప్రయత్నింతురు. కవిగారు 'తల్లీ, బిడ్డ' అను ఖండికలో తల్లి తన బిడ్డ నిట్లు ఓదార్చు చున్నది.

ఉ॥ కంటిర నిన్ను నా కడుపు కష్టమునోరిచి పెంచినానురా
చంటిని చేపి నాయెడద చల్లగ, చెల్లగ నాదు కోరికల్
మంటివిరా విరాకులపు మక్కు జగాల జయించునట్టి నా
యింటి వెలుంగ! యశ్రులు వహింపకు,కాంచి సహింప లేనురా

ఇట్లు వీరి పద్యములు చక్కని భావ ప్రయుక్తములై వ్రాయ వెలసినవి.

శ్రీ మూర్తి గారి భార్య శ్రీమతి వీరజాదేవి. ఈమె సంగీత సాంప్రదాయ మెరిగిన కుటుంబము నుండి వచ్చిన యువతి. తండ్రిగారి వద్ద వీణవాయించుట, చక్కగా, గానముచేయుట నేర్చుకొన్నది.

ఆమెగారి ప్రోత్సాహము శ్రీ మూర్తిగారికి పూర్తిగా లభించినది. వీరు అన్యోన్యానురాగ దంపతులు వీరు అతిథి అభ్యాగతుల నాదరించు సహృదయులు వీరికిద్దరు పుత్రులు. అంబరీషరాజా, నహుషరాజా అను ముద్దు పురాణ పురుషులపేర్లు పెట్టిరి. ప్రస్తుతము వీరు బెంగళూరు నగరమున నివసించు చున్నారు. వీరిని, వీరి కుటుంబమును, సర్వేశ్వరుడు సదా రక్షించుగాత

## శ్రీ పాళ్ళూరు సుబ్బణాచార్యులు



జననము:— 1912

జన్మస్థలము - హారేసముద్రము, మడకశిర తా॥ అనంతపురం జిల్లా

తల్లి:—శ్రీమతి గుండమ్మ

తండ్రి:—శ్రీ పాళ్ళూరు హనుమంతాచార్యులు

మతము, కులము - హిందూ - బ్రాహ్మణ - మధ్వ

అనంతపురములో 1930 సం॥ నందు వెలసిన కవికుమార సమితిలో ఒక్కరైన శ్రీ పాళ్ళూరు సుబ్బణాచార్యులవారు, నేడు పి. యస్. ఆచార్యగా శ్రీకాకుళంలో, హిందూ పత్రికాప్రలేఖరులుగా వ్యవహరింప బడుచున్నారు 'కవికుమార సమితి' ప్రచురించిన 'తొలకరి చినుకులు', 'క్రొక్కారు మెరుగులు' వీరి కవితలు. వీరు 'లేపాక్షి శిల్పకళాక్షేత్రము' 'ప్రణయ సమాధి' యను మరి, రెండు కవితా సంపుటములను ప్రచురించిరి.

ఈ కవికుమారులు తమ తొమ్మిదవ సంవత్సరము వఱకు కల్యాణ దుర్గము తాలూకాలోని తూర్పు కోడిపల్లి గ్రామములో నుండిరి. వీరి తాత ముత్తాతల స్వస్థళము పాళ్ళూరు. తండ్రిగారి కాలమునకు వీరి కుటుంబము తూర్పు కోడిపల్లికి వలస వచ్చిరి. పౌరోహిత్యముచే కుటుంబ పోషణ జరుగుచుండెను. ఆ గ్రామములో చదువు సంధ్యల కవకాశము లేనందున ఆ గ్రామమునకు రెండు మైళ్ళ దూరములోగల 'భట్టువానిపల్లె' వీధిబడిలో ఆచార్యులు చదువుకొనిరి. ఇంటివద్ద శ్రీ కరణం వెంకోబరావుగారు ఆంగ్లము బోధించిరి. తొమ్మిదవ యేటనే వీరి తండ్రిగారు గతించుటచే కుటుంబభారము వీరి తల్లిమీద పడెను. అప్పుడామె కుమారుని చదువు సంధ్యల కొఱకై కల్యాణదుర్గము చేరి, మ ధ్యాహ్నిక వారకాలపు తన కుమా

దునికి చదువు చెప్పించినది. తదుపరి అనంతపురం కళాశాలలో చేరి బి. ఏ., పట్టము పొందిరి. 'నా తల్లి నా విద్యాజ్యోతిని వెలిగించిన చదువుల తల్లి' అని తల్లిపై కృతజ్ఞత ఈ క్రింది పద్యములో తెలుపు కొన్నారు.

ఉ॥ వేకువ వేగుజుక్క కనిపించిన తోడనె నిద్రలేచి, య
త్యాకలికోర్చి శాంతము రవంతయు వీడక జేయు రాత్రి యౌ
దాకను చాలకార్యములడల్లి, యదెట్టుల తీర్చికొందునో?
నాకది తోచదా ఋణ మనంతము సత్యసమిత్ప్రబోధకా! (క్రౌ. మె)

కళాశాలలో వీరు శ్రీ వాసుదేవమూర్తి, శ్రీ వెల్లాల ఉమామహేశ్వరరావులతో కలసి మెలసి తిరుగుచూ సాహిత్యపరిచయ మావించుకొనుచుండెడివారు. వీరి కాసమయమున 'టాల్స్టాయి' రచనల మీద మంచి అభిప్రాయ మేర్పడినది. దానికి తోడు కీ॥ శే॥ నివర్తి వెంకటసుబ్బయ్యగారితో సాహచర్య మేర్పడి, టాల్స్టాయి రచనలు చదువుట యందాసక్తి ఎక్కువాయెను.

కళాశాలలో చదువు చున్నప్పుడే ఆచార్యులు రాజకీయ దుమారములో చిక్కుకొనిరి. విద్యార్థు లెవ్వరు గాంధిటోపీని ధరించి కళాశాలకు రాకూడదని ప్రిన్సిపాలుగారొక వుత్తరువు జారీ చేసిరి. అప్పుడాచార్యులు తమ స్నేహితులతో కలసి గాంధీ టోపీలను ధరించి కళాశాలకు వెళ్ళి తదితర విద్యార్థులు ధరించుట కొఱకై టోపీలను పంచిరి. ప్రిన్సిపాలుగారు దిగ్భ్రాంతులై తమ ఉత్తర్వు నుపసంహరించుకొనునట్లు చేసిరి. కళాశాల విద్యాభ్యాసానంతరము నిరుద్యోగ సమస్య ఆచార్యులవారిని పీడించెను. సంసార భారము భరింపరానిదయ్యెను. అట్టి క్లిష్టకాలమునందు సాహిత్య రచనకు పూనుకొని మనశ్శాంతి పొందిరి. అప్పటి వీరి రచన లన్నియు 'తొలకరి చినుకులు' — 'కొర్రిక్కారు మెఱుగు' లుగా వెలువడినవి.

వీరు కీ॥ శే॥ కల్లూరు సుబ్బరావుగారి 'రాజకీయ శిష్యులైరి'. వారివెంట 1936లో బెజవాడకు వెళ్ళి అక్కడ దేశోద్ధారక కాశీనాథ నాగేశ్వరరావు

గారితో పరిచయ మేర్పరచుకొనిరి. ఆ పరిచయము వారిని ఆంధ్రపత్రికా విలేఖరిగా మార్చినది. రెండు సంవత్సరములు వారనంతపురములో పాత్రికేయులుగా వ్యవహరించిరి. 1937 వ సం॥లో వీరి జీవితము నందొక పెద్ద మార్పు సంభవించెను. పుట్టి పెరిగిన అనంతపురం జిల్లా విడిచి శ్రీకాకుళమునందు 'Hindu' ఆంగ్ల దినపత్రికకు విలేఖరిగా స్థిరపడిరి. 1937 నుండి 1942 వరకు 'ప్రజావాణి' వారపత్రిక కుపసంపాదకులుగా పనిచేసిరి.

అనంతపురంలో ఉన్నప్పుడే వీరు సాధన పత్రికలో కథలు వ్రాయు చుండిరి. ఈ కథావళిని నూతలపాటి పేరరాజుగారు నడపు చుండిన 'మారుతీ గ్రంథమండలి' ప్రచురించెను. 1977 లో "లేపాక్షి శిల్పకళా క్షేత్ర"మను పద్యకావ్యమును ప్రచురించిరి. ఈ కావ్య ప్రచురణకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు ద్రవ్యసహాయ మొసఁగిరి.

ఆచార్యుల కవితలో తీవ్రభావములు, కొన్నిటిలో యథార్థ జీవిత సత్యములు కనబడును. ఆచార్యుల ఖండికలలో 'పుష్పము' లోని భావనను కొంత చూతము

చం॥ అమృతము నిత్తు వేడకయె ప్రాణవిభుండని యెంచి నిన్ను, దే
హమున కలంద పుప్పొడి వహర్నిశమున్ మదమారనిత్తు స్నే
హమున మెలంగనెంచితి నవంగుని బాధల కోర్వజాల నో
భ్రమర కులేంద్ర! యిట్టినను వంతల మున్గగ జేయ బాడియే ?

(తొలకరి చినుకులు)

ఆచార్యవర్యులకు కవి పండితులపై అభిమాన మెక్కువ వారి నొకచోట తమ ఆతిథ్యమున కాహ్వానించిరి, మరియొకచోట వారిని ప్రశం సించిరి. పింగళి సూరనను 'భవ్య రచనా ధురంధర - భవ్య చరిత ! పింగళి కులాబ్ధి చంద్ర ! కవీంద్ర చంద్ర ! అని స్తుతించిరి ఒక కవిని తన పర్ణశాలకిట్లు ఆచార్యు లాహ్వానించు చున్నారు.

చం॥ గిరిగహనంబులం దిరిగి ఖిన్నుఁడ వందితి కన్గొనంగ, నీ
చరణయుగంబు పొక్కె, ఘనచంద్రిక లీను ముఖమ్ము గందె, బం
గరుమెయి ఘర్మబిందువుల గ్రమ్మెను, గాన కవీంద్రచంద్ర! నీ
వరమరలేక నేనొసగు నర్ఘ్యమును, పాద్యము గొమ్ము నెమ్మదిన్
(తొలకరి చినుకు)

ఈ కవిగారు చిన్నతనమునుండి పేదరికము ననుభవించిన వారు. ఆ బీదరికపు బాధలతనికి బాగుగా తెలియును. దీనుల, ననాథులను జూచినప్పు డతని మనస్సు ద్రవించును. అందుకే ఆయన తన ఖండికలో తాను గాంచిన యొకానొక యనాథుని గూర్చి ఇట్లు ప్రశ్నించు చున్నాడు.

ఉ॥ మాసిన తుండుగుడ్డ, యొకకాసెయు మానము గప్పిపుచ్చగా,
దోసిలిలోని చిప్ప యతి దుర్దశ దెల్పగ, పొట్ట కూటికై
వేసరకుండ నిండ్లకడ వేకువ నుండియు గాచియుండెదో
దాసరి! యెవ్వరీవనిన ధారగ కన్నుల నీరు గార్చుచున్.(క్రొ-మె)

ఆ అనాధుడు తనగోడును కవీంద్రునకు చెప్పుకొన్నాడు.

వీరి 'లేపాక్షి-శిల్పకళా క్షేత్రము'ను ఖండకావ్యమొక ఉత్తమ భావ సంపుటి. కవి హృదయ మిందు మనము గాంచగలము. లేపాక్షి శిల్పి రాతి కమరత్వము నిచ్చిన కళాతపస్వి - ఆచార్యులవారు రాతిశిల్పము లను పలికించినారు. 'భావకవుల కవిత్వమునకు స్పష్టత ముఖ్యము ఆధునిక భావ కవులకు నితరుల ననుకరించ వలెననెడి తపన హెచ్చు. అది అంతగా సరియైనది కాదు' అని శ్రీ రాళ్ళపల్లివారు 'క్రొక్కాఱు మెఱుగు' నందు ఆచార్యులవారి విషయములో వ్రాసిరి. ఆ మాటల నాచార్యులవారీ కావ్యము నందు వమ్ము చేసిరి. ఆ ఉద్వేగముతోనే ఈ రచన, ఆచార్యులు సాగించిరేమో! లేపాక్షిలోని అసంపూర్ణ కల్యాణ మంటపమును, విరుపణ్ణ కంటి

ధారను చూచిన వారెవ్వరు కంట తడిపెట్టకపోరు. రాతిగుండె కూడ కఱగి పోగలదు. ఎంతటి శాంతమూర్తి యైనను రుద్రుడు కాగలడు. ఈ భావన చూడుడు.

శివుని పెండ్లాడ కూర్మాద్రి జేరు సరికి
జీర్ణ కల్యాణమండప స్థితిని జూచి
గిరిజ వేసారి గుండె నిబ్బరము మాని
తీవ్ర తపమున దుర్గగా తేజరిల్లె

ఇదొక అద్భుత భావన. లేపాక్షిలో వెలసినది, దుర్గా పాపనాశేశ్వరులుగాని శివపార్వతులు కారు.

రాజుగారి యాజ్ఞను విన్నంతనే విరుపణ్ణ యిట్లు నేలకొరిగినాడు.

భీకరాజ్ఞను విరుపణ్ణ విన్నయంత
సర్ప దంష్ట్రాప్రసార సంజనిత వహ్ని
దగ్ధదేహుండుంబలె చేష్టదప్పి వ్రాలె
మదకరీంద్రము కూలిన మాడ్కి నేల

లేపాక్షి శిల్పములో బసవణ్ణ ఒక అపూర్వ కళాసృష్టి దానిని శిల్పులు దేవాలయము బయట కొంత దూరములో ఒకే రాతిలో అందముగా చెక్కినారు. అందువారి యుద్దేశ్యమేదియో మనకవగతము కాదుకాని, కవిగారి భావన మాత్రమిట్లున్నది.

కూర్మశైలంబు తొలిపించి గుళ్లుకట్టు
పనికి యెవరేవి నాటంక పరతురనుచు
పగతు గుండెను చీర్రేయు పగిదిగాను
నూరి బయటన కావలియుండు నంది.

ఈ కవిగారిట్టి మనోజ్ఞ భావములతో కవితాపుష్పములను వెదజల్లి ఆంధ్ర రసజ్ఞ లోకమును రంజించెదరు గాత!

*

# శ్రీ వెల్లాల ఉమామహేశ్వరరావు



జననము:- 30-8-1912

జన్మస్థలము - పుంగనూరు.
చిత్తూరు జిల్లా

తల్లి - శ్రీమతి కృపాలక్ష్మమ్మ
తండ్రి - శ్రీకంఠయ్య

మతము కులము:- హిందూ-బ్రాహ్మణ

1934 సం॥ ఆ ప్రాంతపు సినీ ప్రేక్షకులలో 'కాంచనమాల' నెఱుగని వారుండరు. ఆ మహానటి ప్రక్కన కథానాయకుడుగా తొలిచిత్రములో నటించు అవకాశము శ్రీ వెల్లాల ఉమామహేశ్వరరావు గారికి కలిగినది. చిన్నతనము నుండియు నాటకరంగముపై అభిమానము పెంచుకొని, చిన్న చిన్న పాత్రలను ధరించుచు, తాను కూడ చిత్తూరు నాగయ్య, బళ్ళారి రాఘవాచార్యుల భంగి ఉత్తమ నటుడుకావలెనని కుతూహలపడి, అందు కొఱకై శ్రమించిన వారు, శ్రీ వెల్లాలవారు వీరు నటులే కాదు, సాహిత్య లోకమున వీరొక మంచి రచయితలు, అనువాదకులుగా రాణించిరి. 1932 వ, సం॥ ప్రాంతములో అనంతపురమున నందేర్పడిన 'కవికుమార సమితి' లోని ముగ్గురు కవులలో వీరొక్కరని వేరుగా చెప్పపని లేదు.

శ్రీ వెల్లాలవారు 4వ ఫారము వరకు చిత్తూరులో చదివి, తదుపరి ఉన్నత విద్యాభ్యాసమును కడపలో ముగించిరి, ఇంటర్ మీడియేట్ విద్యను మద్రాసులోను, తదుపరి బి ఏ, చదువు అనంతపుర, దత్తమండల కళాశాలలోను ముగించిరి. ఇంటర్, బి ఏ ల యందు వీరు తెలుగున యూనివర్సిటీకెల్ల మొదటివారుగా ఉత్తీర్ణులైరి. అప్పుడే వారికి తెలుగు సాహిత్యముపై మక్కువ ఏర్పడినవి, శ్రీ మతం ఆచార్యులతో, సన్నిహిత మేర్పడి 'కవికుమార సమితి' ద్వారా 'తొలకరి చినుకులు' 'క్రొక్కారు మెఱుగు'

లను రెండు ఖండకావ్యములు వెలువరించిరి. బి ఏ., తదనంతరం న్యాయ వాద పరీక్షను మద్రాసులో ముగించి అక్కడే న్యాయవాదిగా కొంతకాల ముండిరి.

వీరి రచనలన్నియు ఉద్రేక పూరితములైనవే శ్రీ రాళ్ళపల్లి వారు వీరి ఖండికలపై ఇట్లు అభిప్రాయము నిచ్చిరి "ఉద్రేకము కార్యకారి యగునేమో కాని కావ్యకారి కానేరదు పీరి కవిత్వమునందు పలుచోట్ల నాయుద్రేకపు మహత్తు కానవచ్చును"

వీరి కవితా ఖండికల నొకసారి పరిశీలించినచో వీరి భావోద్వేగము గోచరము కాగలదు. 'ఆంధ్రవీరుడా!' 'ఆర్యపుత్రా' యను శీర్షికలలో తమ గుండెలలో నిండుకొన్న యుద్రేకరక్తమును తోడి వీర రసముతో రంగరించి ఆంధ్రుల కందించిరి రసపుత్రుల వీరత్వమును గూర్చి వారిట్లు వ్రాసిరి

పైనిక పిశాయమెల్లను - సమసినపుడు
అన్నపానంబులును నరుదైన యప్డు
శతృవులు వచ్చితాకిన - జంకినాడె?
అమిత వీరవరేణ్యుడౌ - నా ప్రతాపు
డమ్మహాత్ముని మ్రొక్కుమా ఆర్యపుత్రి! — (తొలకరి చినుకులు)

'ఆంధ్ర వీరుడా!' యని సంబోధించుచు, తెలుగు వీరుడు కూడా రసపుత్రుల కేమాత్రము తీసిపోడని, వారి బలపరాక్రమములు మహోన్న తములని చాటి చెప్పిరి,

చం॥ మణచితివో దిగంతముల మానుష బాహుబలాతి రేకతన్
స్ఫురితము జేసినట్టి యల భూరియశోధరు బాలచంద్రునిన్
స్మరణకుదెచ్చు కొంచతని చండపరాక్రమ విక్రమంబు నీ
ఖరకరవాల ముంగొని వికాసత లెమ్మిక నాంధ్రవీరుడా!

కవిహృదయ మొక వెన్నముద్ద. లోకమున ప్రజలు జీవయాత్ర సాగించుట కెంతటి కష్టపడుచున్నారో తెలుసుకొన్నప్పుడది నిజముగా ద్రవించును. ఆ కష్టజీవులకు కొంత విశ్రాంతి అవసరము అది కవులహృదయములకు, కలములకు మాత్రమే అందగలదేమో। శ్రీ పెల్లాల వాకట్టి వారియెడ అభిమానము, ప్రేమ, వాత్సల్య కవికరములను తమ కవితలలో చూపిరి. 'బిడ్డనేల కొట్టితివి ;' — 'వారు' 'రక్షకువి ప్రాపు' — 'రక్షక' మొదలగు ఖండికలలో పై గుణములు పాఠకులకు ద్యోతకము కాగలవు

చం॥ ఉదయమునుండి యిందనుక నొక్కెడ నిల్వక కూలిసేయగా
నొదవిన నాల్గణాలగొని యుద్ద కొమాళ్ళను భార్య గూతు, నే
విధమున బెంచుదున్ అడుగు పెట్టిన దాదిగ నింటిలోన నా
కదియిది కావలెజా నను నార్చెడు బిడ్డల నెట్లు తన్పుదున్(క్రొ-మె)

ఈ కవి గారానాడే, 'అంటరానివారి' అనాథ దశల, మనసు కలుగునట్లు వ్రాసిరి,

అంటరానివాడ — ననరానివాడను
చేరరానివాడ — చెనటివాడ
తొలుత పుట్టువందు — శిలలతో దేవుని
బూజచేసినట్టి — పుణ్యజనుడ ; ౧

బిచ్చమైననెత్తి — బిడ్డలకైనను
వింత గంజిచేసి — యిత్తమన్న
నిండ్లదరికి నన్ను — నేను రానీయరు
కాన చచ్చుటొకటె — యౌనెతెలుగు ; ౨

అని వాపోవుచు, క్రైస్తవ మతముజేరి, ప్రాణ రక్షణ మొనర్చుకొనుట శ్రేయమని వాంఛించు హిందువుల, నార్షమత మెంతవరకు రక్షించుచున్నదని కవిగారు వాపోవుచున్నారు,

"పసిపిల్లల పలుకులు పంచదార చిలుకలు. ఆ ముద్దుపలుకులు కన్న తల్లిదండ్రులకే కాదు, సర్వులకు శ్రవణానందములు. ఒకటిన్నర సంవత్సరపు వయసుగల 'రుక్కు' పలికెడి ఛొక్కువలుకులు, సంగీత సాహిత్యములకు నిలయములు' ఆ పలుకులను పలికించెడి నేర్పు కవులకు లేదు. కోయిలకు లేదు. వీణాగానమున కంతకంటే లేదు. అందుకే కవిగారిట్లనుచున్నారు.

సీ॥ తిక్కనార్యుని తేట — తెలుగందొలికెడు
 తియ్యతియ్యని తీనె — తెరలకన్న
 పోతనామాత్యుని పొంకంపు కవితలో
 నమరు సుధాతరం — గములకన్న,
 షేక్స్పియర్ నుడులలో — చిప్పిల్లు వివిధ గం
 భీర బంధురభావ — వితతికన్న,
 తిరుపతి వేంకటే — శ్వరుల వాగ్ధారలో
 గల 'నయగార' వే — గమున కన్న
తే॥ అధికమగుచు జొక్కించు తి — య్యందనమ్ము
 అమృతమాధురి గాంభీర్య — మతులవేగ
 మలరు గద 'రుక్కు' నీపల్కులందు ఏమి
 శక్తియో నీది తలప నాశ్చర్యమమ్మ! (క్రొ-మె)

'శంకర! హైమవతీ వశంకరా!' అను మకుటముతో కొన్ని పద్యములు, వీరు 'తొలకరి చినుకులు' క్రొక్కారు మెఱుగు' అందు వ్రాసినారు.

ఈ కవిగారికి, మద్రాసులో, చలనచిత్రములో నటించు అవకాశము దొరికినది కాని, డైరెక్టర్ల మనస్తత్వమునకు వీరికి సరిపోనందున తానే స్వయముగా నొక చిత్రనిర్మాణమునకు పూనుకొని, అందులో ఎక్కువగా నష్టపడి, తుదకా కార్యము విరమించుకొనిరి.

ప్రస్తుతము వీరు కడపలో ప్రశాంత చిత్తులై కాలక్షేపము జేయుచున్నారు 'లేపాక్షి' అను పేర ఒక డాక్యుమెంటరీ ఫిల్ము తీసియున్నారు.

శ్రీ సర్వేశ్వరుడు, వీరికి వీరి కుటుంబమునకు సదా, ఆయురారోగ్య భాగ్యము లొసంగి గాపాడు గాత!

# కడప రచయితలు.



## శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డి

జననము:— 1937 ఆగష్టు

జన్మస్థలము:— అలిమెల వెంకటగిరి తా॥ నెల్లూరు జిల్లా,

ప్రస్తుత నివాసము — కడప పట్టణము

నెల్లూరు జిల్లా 'జమీందార్' ఉద్యమములో పాల్గొన్న యోధులు, విద్యానిలయములకు భూదానము లొసగిన దాతలు, 'జమీన్ రైతు' పత్రికా నిర్వాహకులైన శ్రీ మల్లెమాల రామస్వామిరెడ్డిగారి పేరు విననివారుండరు. వీరి పూర్వీకులు చిత్తూరు జిల్లా కాళహస్తి తాలూకా పులటూక గ్రామ నివాసులు. శ్రీరామస్వామిరెడ్డి గారికైదుగురు పుత్రులు; ఒక కుమార్తె. వారిలో ప్రథములైన శ్రీ మల్లెమాల సుందరరామిరెడ్డి గారు తెలుగు చలనచిత్ర నిర్మాతలుగా, సినీ రచయితలుగా వాసికెక్కిరి. ద్వితీయులు, మన కథారచయితలు శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డిగారు.

శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డిగారు నేడు కడపలో 'లక్ష్మీనర్సింగ్ హోం' అను పేర పెద్ద వైద్యశాలను స్వంతముగా నడుపుచున్నారు. వీరి భార్యామణి శ్రీమతి డాక్టర్ వరలక్ష్మి, యం. బి. బి. యస్. గారు కూడా ఈ వైద్యశాలలోనే పనిచేయు చున్నారు. ఈమె కడపలో ప్రముఖ న్యాయవాదిగా పేరుపొందిన శ్రీ కే॥ శే॥ వి. నారాయణరెడ్డిగారి పుత్రిక

శ్రీ వేణుగోపాలరెడ్డిగారు తమ ఉన్నత విద్యాభ్యాసమును నెల్లూరు జిల్లా గూడూరు హైస్కూలులో ముగించి, తదుపరి నెల్లూరు వి.ఆర్. కాలేజీలో ఇంటర్ వరకు చదువుకొనిరి నెల్లూరులో కళాశాల విద్యార్థిగా ఉన్నప్పుడే వీరికి తెలుగు సాహిత్యముపై ఎనలేని అభిమాన మేర్పడినది.

అందుకు కారణము వారచ్చటి కవిపుంగవులతో పండితులతో చేసుకొన్న పరిచయ భాగ్యమని చెప్పవచ్చును.

కళాశాల విద్యాభ్యాసానంతరం 1956 నుండి, కాలేజీలో ఎం బి బి.ఎస్. చదివిరి. ఈ ఆరేండ్ల కాలములో వైద్యవిద్యనేకాక సాహిత్యమును కూడా సుప్రసిద్ధ కవులైన శ్రీ జంధ్యాల పాపయ్యశాస్త్రి జాషువాగారికి శిష్యులై నేర్చుకొనిరి. గుంటూరులో చదువు చున్నప్పుడే తమ 21 వ సంవత్సరమున సంఘసేవా కార్యక్రమములో పాల్గొని, ఒకసారి 1958 లో ఢిల్లీలో యువజనోత్సవమునకు మెడికల్ ప్రతినిధిగా వెళ్ళిరి.

గుంటూరులో వైద్యవిద్యను ముగించి విశాఖపట్టణములో ఐదేండ్లు యం. యస్. వైద్యవిద్యలో శస్త్రచికిత్సను ప్రత్యేకముగా నేర్చిరి. ఏగూటి పక్షి ఆ గూటికే చేరునన్నట్లు శ్రీ మల్లెమాల వారి సాహితీ మల్లెలు విశాఖలోని సాహితీ నందనోద్యానమున వైశాఖములో విరిసినవి. అచ్చట శ్రీ పురిపండ అప్పలస్వామి, శ్రీ రాచకొండ విశ్వనాథశాస్త్రి మున్నగు వారి సాహచర్యముతో వారి సాహిత్య సౌరభ మినుమడించినది. విశాఖరచయితల సంఘము (వి. ర. సం) లో సభ్యులుగా చేరి ఆంధ్రభాషకు సేవ లొనర్చిరి.

తదుపరి శ్రీ మల్లెమాలవారు డా॥ శ్రీమతి వరలక్ష్మి యం.బి.బి యస్. గారిని వివాహమాడి కడపలో స్థిరపడిరి.

కడపలో సాగిన వీరి సాహిత్యకృషి వీరి జీవితమందొక కలికి తురాయి. పుష్పించిన వీరి జీవితాశయము లిచ్చటనే ఫలించినవి. డాక్టరుగా ధనార్జన సాగించుటయే విధిగా పెట్టుకొనక, పాత్రత నెఱిగి దానమొనర్చుచు, బీద సాదల కుచితముగా చికిత్సల నొనగూర్చి 'మానవసేవయే మాధవసేవగా' తలచిన మహనీయ గుణసంపన్నులు.

1972 వ సంవత్సరములో శ్రీయుతులు జానమద్ది హనుమచ్ఛాస్త్రి, సాంబశివయ్య, జే. పి. సుబ్బయ్య మొదలగు సాహితీమిత్రుల సహాయ

సహకారములతో కడప జిల్లా రచయితల సంఘము నొకదానిని స్థాపించిరి. ఆ సంఘమున కధ్యక్షులై రచయితలను, కవులను, పండితులను సన్మానించిరి. నేడీ రచయితల సంఘమునకు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాంతమున ఒక ప్ర త్యే క స్థానమున్నది. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ దీనిని గుర్తించినది. శ్రీమల్లెమాలవారు సాహిత్య అకాడమీ కార్య నిర్వాహక సభ్యులుగా ప్రస్తుతము అనేక సాహితీ కార్యముల నెరవేర్చు చున్నారు. ఈ జిల్లా రచయితల సంఘము కడప జిల్లా పౌరులనేకాక రాయలసీమలోని సాహితీప్రియుల మన్ననల నందినది. వీటన్నిటికినీ అధ్యక్షులు శ్రీ మల్లెమాల వారు, కార్యదర్శులు శ్రీ జానమద్దివారు. వీరిరువురి అనుబంధము బంగారునకు పరిమళ మబ్బినట్లుండును.

శ్రీ మల్లెమాలవారు కడపలో నిర్వహించని సాంఘిక సేవాకార్యక్రమము లేదు. సంఘసేవా కార్యక్రమ నిర్వహణలో మేటిసంస్థగా ఎన్నికైన 'లయన్స్ క్లబ్' ను కడపలో స్థాపించి కొంతకాల మద్దానికి అధ్యక్షులుగా పనిచేసిరి. తదుపరి వీరు 1977 లో లయన్సు క్లబ్బుల జోనల్ ఛేర్మెనుగా నియమింపబడిరి. లయన్సు క్లబ్ అధ్యక్షులలో వీరుత్తములుగా ఎన్నికగుట వీరి సేవా గుణవిశేషములకు నిదర్శనము. అరవిందుని ఆదర్శములను వీరు పాటించిరి. కడప చిన్మయ మిషన్ కార్యదర్శిగా ఆధ్యాత్మిక రంగములో సేవలు చేయుట వీరి తాత్విక దృష్టికి తార్కాణము. ప్రస్తుతము సామాజిక చైతన్యమునకు కళాత్మకమైన విలువలు గల చలన చిత్రము లెంతేని అవసరమని యూహించి, 'కడప ఫిల్మిం సొసైటీ'ని స్థాపించి ఉత్తమ చలన చిత్రములు ప్రదర్శింప జేయుటకు కృషిచేసిన లౌకికులు. జీవకారుణ్య సంఘమునకు కార్యవర్గ సభ్యులైరి. శ్రీ సాయిబాబా అనాథ శరణాలయ నిర్వహణలో సభ్యులుగా పాలుపంచుకొనిరి. అందలి అనాథ బాలురందరికి ఉచిత వైద్య సహాయములను గావించిన దాతలు. 'ఆల్ ఇండియా సర్జన్సు అసోసియేషన్' లో సభ్యులుగా రాణించిరి ఇట్లనేక సంఘసేవా కార్యక్రమములందు తల మునకలగుచు, తీరికేలేని ఈ విశ్వసంసారమందు తాము కూడ ఒక కుటుంబ సభ్యులై, తమ తోడివారికి తోడుపడుచూ, దిన

మునకు 18 గంటలు నిర్విరామకృషి సాగించుచున్న ప్రజాసేవకులు. సాహిత్య విజ్ఞాన కోశాధికారులు—ప్రియ మితచతుర భాషులు-సౌమ్యులు-నిరాడంబరులు శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డిగారు. వీరిని 1976 లో, ఉగాది పండుగ సందర్భమున ఆంధ్రరాష్ట్ర ప్రభుత్వము హైదరాబాదులో ఘనముగా సన్మానించినది.

శ్రీ మల్లెమాలవారు సాహితీ ప్రియులేకాదు, మంచి కథకులు. వక్తలు కూడ. వీరు 'శిరీష' అనే కలముపేర కొన్ని కథలు వ్రాసిరి. అవి వార, మాసపత్రికలలో ప్రకటింపబడినవి. వాటిని 'ఉ(దా)త్త పురుషుడు' అను పేర కథల సంపుటిగా ప్రకటించిరి.

వృత్తి చేత డాక్టరుగా, ప్రవృత్తిచేత కథకులుగా సంఘసేవకులుగా శ్రీ మల్లెమాలవారు రాణించిరి. వారి హృదయము శిరీష కుసుమపేశలము. వారి కథలలో వారి సహజగుణములు ప్రతిబింబించుట గమనార్హము. ఈ కథలు వారి స్వీయానుభవములే. ప్రతి కథలోను డాక్టరుగారి ప్రతిరూపము మనకు గోచరించగలదు. 'మరో ప్రేమకథ' ఈ కథలో 'జీవితాంతము ఒక వ్యక్తిని 'ప్రేమ' అనే పేరుతో ఆరాధించే మజ్నూలాంటి మనుషులు నేడున్నారు' అంటూ పరాత్పరరావుకు ఒక డాక్టర్ చేత తాండాస్త్రీఊర్మిళ కథను చెప్పించి, ఆ ప్రియుని మనస్తత్వమును మనముందొక చమత్కారపు మాటతో ప్రదర్శించినారు. ఆ రెండు మాటలే ఆ కథకు ప్రాణములు. 'వికలత్వము' కథలో, 'ప్రతిమ' పాత్ర విషయముగా ఆ కథలోని డాక్టర్ కృష్ణమోహన్, హృదయ విదారకముగా చింతించిన తాత్వికుడు. డాక్టరుగా కాకుండా, మనిషిగా కదలి పోతాడతడు. మనసులోని భావము నా అమ్మాయి మామగారి ముందు డాక్టరు, విశద పఱచును. కాని ఆయన మనసుమారదు. తుదకు "నీవు కేవలం డాక్టరువి.. అంతే" అని అతని చేత. మాటపడు తాడు డాక్టరు. ఇందు శ్రీ మల్లెమాలవారు డాక్టరు కృష్ణమోహనుగా, తారస పడతారు.

ఋణగ్రస్తుడనే కథలో, కన్నబిడ్డకు కష్టకాలములో రక్తమివ్వ డానికి వెనుకాడి, తన దగ్గఱ పనిజేసే రిక్షావాలా తీర్చవలసిన బాకీకుగాను రక్తము తీసుకొన్న ఒక నికృష్ట యజమాని. రిక్షావాలా ఎప్పుడూ ఋణ గ్రస్తుడే. అతడు మోపిన నిందలో, రిక్షావాల ఖైదీగామారి రక్తదానము చేయుట, డాక్టరుగారి హృదయమును ద్రవింపజేసినది.

ఉ(దా)త్త పురుషుడెవరు? ఉత్తమపురుషుడెవరు? ఈ ప్రశ్నలకు జవాబు చక్రపాణి పాత్రద్వారా రచయిత వెల్లడింపజేసిరి. సుచరిత, పురు షోత్తములు ఆదర్శ అన్యోన్య దంపతులు. ఆ దంపతులపై, చక్రపాణి కొక గౌరవ భావము కలదు. సుచరిత అగ్నిప్రమాదానికి గురికాగా, ఆమె కొఱకు, పురుషోత్తముడు పరితపించిపోయి, బిడ్డల కన్యాయము చేయనని మాట ఇచ్చును. సుచరిత మరణించిన తర్వాత జరిగిన మార్పులకు చక్ర పాణి ఆశ్చర్య పడతాడు. అతడు మంజుళ అనే ధనిక అమ్మాయిని పెండ్లాడి, పిల్లలను వాళ్ళ అమ్మమ్మ తాతగార్లవద్ద వదలి పెట్టినాడని తెలుసు కొని బాధపడతాడు. అతని దృష్టిలో పురుషోత్తముడు, పురుషోత్తముడు కాడు. ఉదాత్త పురుషుడు కాడు. అతడుత్త పురుషుడుగా, నిలిచిపోయినాడు.

ఇట్టి మంచి కథల నెన్నింటినో వ్రాయుటలో, శ్రీ మల్లెమాలవారు, సిద్ధహస్తులు, చక్కని భావగేయములు వ్రాయగల సమర్థులు. కలము, హలము బట్టిన రచయితలు, మన తెలుగు సాహితీ లోకములో కలరుగాని కలము తొలుతబట్టి, స్టెతస్కోపు తదుపరి బట్టిన రచయిత లరుదు. వీరి కథలను, శ్రీ రా. వి. శాస్త్రి తులసీకృష్ణ, శ్రీ మధురాంతకం రాజారాం, కీ॥ శే॥ కె. సభాకేతు విశ్వనాధరెడ్డి, మున్నగు ప్రసిద్ధ కథకులందరి చేతను మెప్పును గొన్నవి. శ్రీ మధురాంతకం వారు వీరి కథల సంపుటికి, పరి చయ వాక్యములు వ్రాయుచు సునిశితమైన జీవిత పరిశీలన ఆరోగ్యకరమైన హాస్యధోరణి, ఆహ్లాదకరమైన కథాకౌశలము, ఈకథలలో యున్నదనియు, ఇంతకన్నా కావలసిన శక్తియుక్తులు మరేమి కలవని వ్రాసినారు.

వారి, సాహితీ మల్లెమాల విరబూసి సుగంధ పరిమళ మాంధ్ర సాహితీ లోకములో వెదజల్ల బడుగాత!



## డాక్టర్ శ్రీ రేవూరు అనంతపద్మనాభరావు

జననము - 1947 రథసప్తమి పర్వ దిII

తల్లి:- శ్రీమతి శారదాంబ

తండ్రి:- లక్ష్మీకాంతరావు

జన్మస్థలము:- చెన్నూరు.

కొవ్వూరు తాII నెల్లూరు జిల్లా

ప్రస్తుత నివాసము: కడప పట్టణము.

రాయలసీమ.

కడప ఆకాశవాణి కేంద్రమునుండి ప్రసారమగుచున్న 'బావగారి కబుర్లు' విని ఆనందించని శ్రోతలు లేరు. సామాజిక జీవితములోని లోటుపాట్లను సామాన్య ప్రజాదృష్టికి దెచ్చు ఈ హాస్య ప్రసంగములు వినిపించు బావమరదులలో శ్రీ రేవూరు అనంత పద్మనాభరావుగారొకరు.

వీరు 1975 నుండి కడప ఆకాశవాణిలో తెలుగు శాఖ ప్రొడ్యూసరుగా ఉన్నారు. కీII శేII దేవులపల్లి కృష్ణశాస్త్రి, జాషువా పింగళి లక్ష్మీ కాంతం. మున్నగు ప్రముఖులు, నిర్వహించిన ఈ ప్రొడ్యూసరు, పదవిని అతి చిన్న వయస్సునకే వీరు పొందియుండుట అదృష్టము.

వీరు నెల్లూరులో బి.ఎ., ముగించి, తిరుపతి శ్రీ వేంకటేశ్వర విద్యాలయములో యం.ఏ, (తెలుగు) పరీక్షలో కృతార్థులైరి. వీరు కళాశాల విద్యార్థిగా నున్నప్పుడే కవిత చెప్ప నారంభించిరి నెల్లూరు కళాశాలలో, ఆంధ్ర శాఖాధ్యక్షులైన శ్రీ పోలూరి హనుమజ్జానకీ రామశర్మగారికి శిష్యులై సాహిత్యములో ప్రకాశించిరి 1967 నుండి 1975 వరకు వీరు కందుకూరు ప్రభుత్వ కళాశాలలో, తెలుగు అధ్యాపకులుగా పనిచేసిరి. అప్పుడు వీరికి అష్టావధానములపై అభిరుచి యేర్పడి, అవధానములు చేయనారంభించిరి.

కందుకూరు తాలూకా రచయితల సంఘము నేర్పరచిరి, ఆ మండల కవులను ప్రోత్సహించి' వారి సాహిత్య వికాసమునకు తోడ్పడిరి. ఎఱ్ఱన, పిల్లలమఱ్ఱి రుద్రకవి మున్నగు ప్రాచీనకవుల జయంతుల నెఱపిరి. కళాశాల విద్యార్థులలో సృజనాత్మకశక్తి వినుమడింప జేయుటకై విరసీవిరియని మొగ్గల'నబడు' కవితాసంపుటమును, తాలూకా రచయితలను ప్రోత్సహించు నుద్దేశ్యముతో 'కుసుమ మంజరి'-'శారద నవ్వింది' అనుకవితా సంకలనము లను వెలువరించిరి. వీరు గావించిన సాహిత్యసేవకివి తార్కాణములు.

తదుపరి వీరు 1969 సంవత్సరం జనవరి 31వ తేదీన కందుకూరులో శ్రీ అన్నాప్రెగడ లక్ష్మీనారాయణగారి అధ్యక్షతన తొలుత అష్టావధానము గావించి పలువురి పండితుల ప్రశంసలను పొందిరి. అదే సంవత్సరము నవంబరులో, కందుకూరు ప్రభుత్వ కళాశాలలో రెండవసారి అవధానమును దిగ్విజయముగా కొనసాగించి అవధాన రంగమున మంచి అవధానులుగా లెక్కింపబడిరి. 1976 వ సం॥ నాటికి ఈ కార్యక్రమములను ఆకాశవాణి ఉద్యోగ నిర్వహణ ఒత్తిడివల్ల మానుకొనిరి.

ఏడేండ్లు సాగిన ఈ అవధాన కార్యక్రమములో వీరు తీర్చిన కొన్ని సమస్యలు' కూర్చిన కొన్ని దత్తపదులు, ఒప్పించిన కొన్ని అప్రశ్నలు, మెప్పించిన కొన్ని అప్రస్తుత ప్రసంగ సమాధానములు శ్రీ పద్మనాభరావు ఆశుధోరణికి, సమయస్ఫూర్తికి, ధారణకు నిదర్శనములుగా చాటుచున్నవి. అందు కొన్నింటినైనను ఇందు పొందుపరచు టెంతేని అవసరము. వారు శ్రీ సరస్వతినిట్లు స్తుతించిరి.

ఉ॥ కాంచన పద్మమందు-చిలుకల్ మదికింపుగఁ బాడుచుండ, నీ
వంచిత వేడ్కతోడ-చతురాననునంకము చేరబోవ, చే
లాంచిత మంట పద్మభవుడంగజ భృత్యుడుగాగ-నీకటా
క్షాంచల వీక్షణమ్ముల సమాదర ముంచుము తల్లి! భారతీ!

[illegible] నందివ్వబడిన కండ, రండ, దండ, ముండ పద [illegible] ని రాతఃబార ఘట్టము నిట్లు, అభివర్ణించిరి.

ఉ॥ కండలు పొంగ, సంధిపనిగాదని యన్నను యుద్ధభూమికే
రండ[illegible]కృష్ణ! వేగిరము రావలె; ఆహవభూమి పార్థు కో
దండ[illegible] ధార్తరాష్ట్రుల మదంబడపం గలదంచు రౌద్ర భీ
ష[illegible]ందరి భీష్మఁడంచనము - ముందు సుయోధను డాలకింపగన్ !

ఈ విధముగా శ్రీరావుగారు అవధానములను నిర్వహించి డాక్టర్ శ్రీ బెజవాడ గోపాలరెడ్డి గారిచేత నెల్లూరు వేద సంస్కృత కళాశాలలో సన్మానింపబడుట వీరి జీవితమున ఒక మధురస్మృతి. బెంగళూరు ఆంధ్ర సారస్వత సమితి పక్షమున శ్రీ వరాల రామిరెడ్డిగారి అధ్యక్షతన జరిగిన అవధానము మరొక మైలురాయి.

శ్రీ పద్మనాభరావుగారు, 'రుద్రకవి'-వారి రచనలపై ఒక సిద్ధాంత వ్యాసము పరిశోధించి శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమునకు సమర్పించి, 'డాక్టరేట్' పట్టమును పొందిరి. కందుకూరులో పనిచేయుచున్నప్పుడే కందుకూరి రుద్రకవి రచనలపై ఆసక్తి జనించి, వారినిగూర్చి పరిశోధన సాగించి సత్ఫలితము నొందిరి. ప్రబంధములోగల ప్రకృతి వర్ణనలు గూర్చి, వీరు వ్రాసిన 'ప్రకృతికాంత' వీరి బహుముఖ గ్రంథ పరిచయమునకు తార్కాణము. శ్రీ పద్మనాభరావుగారు నవలలు వ్రాయుటయందు కూడా ఆరితేరిన వారే. 'మారని నాణెము' నవల నేటికళాశాల అధ్యాపకవృత్తికి దర్పణము పట్టినది. 'సంధ్య వెలుగు' నవల గ్రామీణ జీవితమును, 'వక్రించిన సరళ లేఖ' నవల విశ్వవిద్యాలయాలలో మురా రాజకీయములను దూయబట్టుచున్నవి.

శ్రీ పద్మనాభరావుగారు ఆకాశవాణి కడప కేంద్రములో తెలుగు శాఖ ప్రొడ్యూసరుగా చేరిన తరువాత చేసినకృషి సర్వదా ప్రశంసింపదగినది. 1975 అక్టోబరు 2. గాంధీజయంతి నుండి 'సూక్తి ముక్తావళి' కార్యక్రమ

మును ఆకాశవాణి ద్వారా ప్రసారముచేయ రూపొందించిరి. ప్రసంగముల ద్వారా, కవితల ద్వారా రాయలసీమలో మరుగుపడిన మాణిక్యములను ఆకాశవాణి ద్వారా ప్రకాశింపజేసిరి. ధ్వని సాహిత్య సంచిక కార్యక్రమ ద్వారా ఉత్తమ ప్రసంగములను ప్రసారము చేసిరి. 1977_1980 సంవత్స రములలో సుప్రసిద్ధ కవులనందరిని ఆంధ్ర దేశపు నలుమూలల నుండి రావించి, కవి సమ్మేళనములను ఆహూతుల సమక్షమున ఏర్పాటు చేసి, ఆకాశవాణి ద్వారా ప్రసారము గావించిరి. ఈ రేడియో కార్యక్రమము లన్నియు సాహితీప్రియుల శ్రోతల మన్ననలను పొందినది. వృద్ధ కవి పండితుల కంఠములను భద్రపఱచు కార్యక్రమములను వీరు చేపట్టుట శ్లాఘింపదగిన విషయము. విజయవాడ'లో పనిచేసిన కొద్ది కాలములోనే వీరెందరినో కళాకారుల నాహ్వానించి, 'భువన విజయ' మను కార్యక్రమ మును ప్రసారము చేసిరి. 'ధర్మసందేహాల' కార్యక్రమములో 'హరి వంశం' అను వచన కావ్యమును ధారావాహికగా శ్రోతల కందించిరి అది పుస్తక రూపంలో వెలువడినది. 'రాయలసీమ రత్నాలను' పేర సుప్రసిద్ధ వ్యక్తుల జీవిత విశేషములను సంక్షిప్తముగ ప్రతి వారము శ్రోతలకు వివి పించిరి. ఇది కూడ పుస్తక రూపము దాల్చబోవుచున్నది. ఈ విధముగా ఆకాశవాణి ద్వారా వీరు సాహిత్యకృషి గావించిరి. శ్రీ రేవూరు అనంతపద్మ నాభరావుగారి వయస్సు నేటికి ముప్పది నాలుగువత్సరములు మాత్రమే. పిట్టకొంచెము కూతఘన మన్నట్లు' ఇంత చిన్న వయస్సునకే వీరు తమ ప్రతిభా పాండిత్యములను చాటి చెప్పుట పూర్వపుణ్య భాగ్య విశేషమనియే, చెప్పవచ్చును.

శ్రీ రేవూరి అనంతపద్మనాభరావుగారి ఎడతెగని సాహిత్య కృషి సాగించుచున్న యువకవులలో అగ్రగణ్యులు. వీరు 1980 లో 'డిప్లొమా ఇన్ జర్నలిజం' పట్టాను సంపాదించి, ప్రస్తుతము 'లా' న్యాయపట్టాను సంపాదించు కృషిలోనున్నారు. వీరికృషి ఫలించుగాక! నవలా రచయితగా, కథకుడుగా, కవిగా, అష్టావధానిగా, విమర్శకుడుగా డాక్టర్ పద్మనాభరావు గారు మూడుపదుల జీవితములోనే ప్రతిభా పాండిత్యములను చాటి చెప్పి

నారు. వీరి ధర్మపత్ని శ్రీమతి సౌ॥ శోభాదేవి, బి ఏ., పట్టభద్రురాలు. భర్తగారి రచనలకు శుద్ధ ప్రతులు తయారు చేయుటలో, ఈ విదుషీమణి సిద్ధహస్తురాలు. ఈ దంపతులు చిరకాలమిట్లే సాహిత్యసేవ నొనర్చుచు అల్లారు ముద్దుగా, సంతాన భాగ్యముచే శోభించుచు, ఆయురారోగ్య సౌభాగ్యములంది, యశోవంతులై వర్ధిల్లెదరుగాత !

## శ్రీ వంగీపురం వేంకట శేషాచార్యులు



జననము 5–12–1910

జన్మస్థలము – కంపసముద్ర అగ్రహారం - చిట్వేలి, రాజంపేట తాలూక, కడప జిల్లా

తల్లి –శ్రీమతి కమలమ్మ

తండ్రి -శ్రీ నరసింహాచార్యులు

మతము, కులము - హిందూ. బ్రాహ్మణ, వైష్ణవులు మౌద్గల్యస గోత్రులు.

శా॥ అమ్మా! భారతి! రమ్మ! మద్రసనపై-నాసీనవై ప్రేమమై
గొమ్మా! మత్సుమన స్సుమాంజలిని-జేకొమ్మా! సుహృద్వీణ, గా
నమ్మన్ భక్తిసుతంత్రికా లలిత విన్యాస స్ఫురన్నాద సే
కమ్మున్ సీనుల విందొనర్పుము జగత్కల్యాణ కృత్కావ్యముల్.

అని యిష్టదేవతా ప్రార్థన గావించి, అపూర్వకథాసంవిధాన చాతుర్య విలసిత. శ్రీరామదీక్షితుల సంస్కృతనాటకమగు 'జానకీ పరిణయమును'

దక్కుట మరొక విశేషము. తమ గురువులైన శ్రీ చేట్లూరి శేషాచార్యుల వారి యందున్న భక్తి ప్రపత్తులకు తార్కాణముగా, దీనిని కవిగారు శేష రామాయణముగా నామకరణము చేయుట మరియొక విశేషము.

మూలదృశ్య కావ్యమును పద్యములందు చొప్పించుటలో కవిగారు కొంత నేర్పు చూపిరి. మూలమునందలి విచిత్ర కల్పనా కమనీయమగు ఇతి వృత్తమును మాత్రమే ప్రధానముగా గొని అటనట వర్ణనలను స్వతంత్రముగా గావించిరి, ప్రతి పద్యములోని సంభాషణాచాతురి అటనట చొప్పించిన తెనుగు నానుడులు మెచ్చదగినవి. అనవసర పద్యములిందులేవు. ప్రతిపద్యము కథలో గట్టిముడిని పెనవేసుకొని యున్నది. ఇందలి యొక వట వృక్ష వర్ణన యిట్లున్నది.

సీ॥ చలిదిబోనమునకై నిలిపికొన్న శవాలు
 వ్రాలు గొమ్మల మధ్య వ్రేలుచుండ,
నర్ధభక్షితములై యవల ద్రోచిన కళే
 బరములు నేలపై దొరలు చుండ ,
దివియగా రాక సంధిగతమాంసములైన
 యెమ్ములకై కాకు లెగురు చుండ ,
దాహమారగ దేటద్రావ విల్చిన మద్య,
 మునకు నీగల గుమి ముసురుచుండ

తే॥గీ॥ దొరయు బొలకంపు కలుకంపు బెరపిపీచు
వాయువులు ప్రాణబంధువు పగిది దమ్ము
నందు రమ్మని పిలిచిన యట్టులుండ
నుండు పెనుమట్టి వృక్షంబు నొకటి జేరి.

ఈ శేషరామాయణ మందలి సశేషకాండలను కవిగారు ముద్రించి, ఆంధ్రులకు అపూర్వకథా సంవిధానముగల ఇట్టి విశేష రామాయణమును త్వరలో అందింతురు గాత.

శ్రీ వంగీపురమువారు పద్యరచనలే కాక ప్రబంధ కావ్యములను వచన రచనలుగా బాలుర ఉపయోగార్థము తీర్చిదిద్దిరి. వీరి బొబ్బిలి వీరులు సార్వభౌములు మున్నగు కొన్ని చారిత్రాత్మక కథలను ఉన్నత పాఠశాల విద్యార్థుల ఉపవాచకములుగా రచించిరి వీరనంతపురము, కడప మండల చరిత్రములను, గుత్తిదుర్గ చరిత్ర విశేషములను వ్రాసినారు. ప్రస్తుతము అనంతపురమునందు నివసించుచు విశ్రాంతి తీసుకొను చున్నారు. వీరు సౌమ్యులు. సంభాషణా చతురులు. సాహిత్య గోష్ఠులందు ఉత్సాహముతో పాల్గొను సాహిత్యపరులు.

చం॥ గడచిచిన వెన్ని జన్మములో కల్గునవెన్నియొ ? ఏ నెఱుంగ నా
కిడుములు సాజమౌట సహియించెద నెన్నిటివేని దేవ ! నీ
యడుగుల నాశ్రయించు శరణార్థి పరాభవ ఖిన్నుడైన మా
ర్న్నడువగ నేల నీకు ననురూపము గాదది వేంకటేశ్వరా !

అని శ్రీ వేంకటేశ్వర శతకములో చెప్పు కొన్నారు. శ్రీ వేంకటేశ్వరు డాయురారోగ్యముల నొసంగి రక్షించు గాత.



## శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రి

జననము — 5—9—1926

జన్మస్థలము:— రాయదుర్గము
అనంతపురం జిల్లా

తల్లి:—శ్రీమతి జానకమ్మ

తండ్రి —శ్రీ కె. సుబ్రహ్మణ్యశాస్త్రి

మతము, కులము.— హిందూ-బ్రాహ్మణ ములికినాడు.

శ్రీ జానమద్ది హనుమచ్ఛాస్త్రిగారి వ్యాసములు ఆంధ్రప్రభ, ఆంధ్ర పత్రిక, ఆంధ్రజ్యోతి, మాసీమ పాఠకులకు సుపరిచితములు. వీరు 1970 వ సం॥ నుండి తమ వ్యాసములను విరివిగా పత్రికలకు పంపి పేరు గడించిరి వీరు కడపలో ప్రభుత్వ సాంఘిక కళాశాలలో ఆంగ్ల భాషాధ్యాపక పదవిలో ప్రస్తుతమున్నారు. వీరికి హిందీ, కన్నడ భాషలందు కూడ ప్రవేశము కలదు.

శ్రీ జానమద్దివారు రాయదుర్గం జిల్లా బోర్డు హైస్కూలు నందు యస్ యస్. యల్ సి. ముగించి ప్రైవేటుగా బి ఏ, లో ఉత్తీర్ణత పొంది, బి.ఇడి. పూర్తి చేసిరి. తరువాత స్వయంకృషితో ఆంధ్ర, ఆంగ్ల భాషలలో ఎం. ఏ, పట్టము పొందిరి. కడపలో ఉద్యోగము చేయుచున్నప్పుడు, శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డి, శ్రీ రాచపల్లి రాజగోపాలరెడ్డి, శ్రీ పి. రామకృష్ణారెడ్డి శ్రీ వై. పి వి. రెడ్డి శ్రీ పేరాల భరతశర్మ మున్నగు ప్రముఖ వ్యక్తులందరితో పరిచయము లేర్పడినవి. శ్రీ రాజపల్లి రాజగోపాల రెడ్డిగారు 'మాసీమ' యను పేర నొక పక్ష పత్రికను ప్రారంభించుచు శ్రీ జానమద్దివారిని రాయలసీమ కవులను గూర్చి వ్యాసములు వ్రాయమని కోరిరి ఆ ప్రోత్సాహముతో ఉత్తేజులై, రాయలసీమలో మఱుగు పడిన కవుల చరిత్రములను వ్రాయుటకు సిద్ధపడిరి. ఈ వ్యాసములు వరుసగా 'మాసీమ' యందేకాక తదితర దినపత్రికల ద్వారా, ఆకాశవాణి యందును వెలుగు చూచినవి. దీనితో శాస్త్రిగారి పేరు ఆంధ్రదేశమునకు పరిచయమైనది, కీర్తిప్రతిష్ఠలు తెచ్చినది తదుపరి వారు ఆ కవుల వ్యాసములన్నింటిని 'మా సీమకవులు' గా పుస్తక రూపములోనికి దెచ్చిరి.

శ్రీ జానమద్దివారు మంచి గేయ రచయితలు 'అమృతం గమయ' శీర్షికతో వ్రాసిన గేయమాలిక మానవులానంద మయు లగుటకు, భారతీయ విజ్ఞానులు చూపిన పథమెట్టిదో ఇందు వివరించిరి.

.... .... .... .... .... .... .. ... .... ... ....

.... .... .... .... .... .... .... .... .... .... ....

గంగాతరంగాల కమ్మతెమ్మెర మాచి,—
ఓషదీ లతలలో వనదేవతల మాచి,
సెలయేటి అలలపై ప్రకృతి కన్నెల మాచి,
చల్లగా ప్రాణాల, నుల్లసిల్లగ జేతురెవరో?

.... .... .. . .... .... .... .... .... .... .... . .

.... .... .... .... .... .... .... .... .... .... ....

భారతీయుల మమ్మమేమూ
మాభాగ్యకల్పనా, కామధేనువులు మీరు
అన్నమయ, ప్రాణమయ, మనోమయ
విజ్ఞానమయ, ఆనందమయ, కోశముల వోలె
మాదేశ ప్రణాళికా కోశముల చిత్తశుద్ధియు,
నిత్యనూత్న చైతన్యము, స్వార్థ రాహిత్యమ్ము
మాలోన లేవంచు దరియంగ రారేమి.... ....

దిగిరండు, దిగిరండు దేవ సురభుల్లార!
భారతక్షేత్రాల పసిడి విగ్గులుధేల,

.... .... .. . .... .... .... .... .... ....
అమృత ప్రదానమ్ము నమరింప రారండు! రారండు!

శ్రీ జానమద్దివారు కన్నడ భాషాప్రియు లగుటచే 'కన్నడ భారత కర్తలు' — 'కన్నడ గురుజాడ కైలాసం' — 'ప్రజాకవి సర్వజ్ఞుడు' — జ్ఞానపీఠ బహుమతి గ్రహీత శ్రీ డా॥ దత్తాత్రేయ రామచంద్ర బేంద్రే మున్నగు వారిని గూర్చి వ్యాసములు వ్రాసిరి. అట్లే కన్నడమందలి 'గణపతి' పుస్తకమును తెలుగులోని కనువదించిరి. రాయలసీమ నటుడైన శ్రీ బళ్లారి రాఘవనుగూర్చి పత్రికలకు వ్రాసిరి, రేడియోలలో ప్రసంగములు గావించిరి.

శ్రీ జానమద్దివారు కడప జిల్లా రచయితల సంఘ కార్యదర్శిగా చేసిన సాహిత్యకృషి అపారము. వారి కార్యదర్శి పదవి ఆదర్శప్రాయమైనది. రచయితల సంఘపు కార్యక్రమములలో వారు రాత్రింబవళ్ళు తలమునక లగుచున్నారు. వీరికి శ్రీ మల్లెమాల వేణుగోపాలరెడ్డిగారి అండదండలెంతేని కలవు. వీరిరువురి సారధ్యములో రచయితల సంఘ కార్యక్రమములు చురుకుగా జరుగుచున్నవి. కార్యదర్శి పదవి నలంకరించుటకు తగిన ఓర్పు, నేర్పు, దీక్ష, దక్షత, నమ్రత వినమ్రతలు శ్రీ జానమద్ది వారిలో మూర్తీభవించినవి. వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యము లొసంగి చిరకాలము సారస్వతసేవ చేయు శక్తి ఆసక్తులను విచ్చుగాత!



## శ్రీ రావినూతల శ్రీరాములు

జననము:- 12—10—1936

జన్మస్థలము:- శ్రీకాకుళం జిల్లా

జనని — శ్రీమతి అనసూయమ్మ

జనకులు:— శ్రీ రావినూతల సత్యనారాయణ

ప్రస్తుత నివాసము:- వేంపల్లి కడప జిల్లా

చిన్నతనమునుండి పత్రికారచనలో ఆరితేరి కొన్నేండ్లు ఆంధ్రపత్రికా విలేఖరిగా పనిచేసి, నేడు పత్రికా రచయితగా పేరుదెచ్చుకొన్న శ్రీరావినూతల శ్రీరాములవారి నెరుగని పాఠకులుండరు. వేటపాలెంలో టీచర్స్ ట్రైనింగ్ చదువు చున్నప్పుడే కథక చక్రవర్తి శ్రీ మునిమాణిక్యం నరసింహారావుగారు వీరికి గురువులైరి. చరిత్ర, ఆంగ్ల, ఆంధ్ర సాహిత్యాభిమానులై 1968 లో ప్రైవేటుగా బి. ఏ., పట్టమును ఆంధ్ర విశ్వవిద్యా

లయమునుండి స్వీకరించిరి. ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి ఎల్. ఎల్. బి. పట్టము పొందిరి. రిజిస్ట్రేషన్ శాఖలో ఉద్యోగిగా తొలుత చిత్తూరులో చేరి 1977 నుండి సబ్ రిజిష్ట్రారుగా రాయలసీమ మండలములలో నియమితులై రాయలసీమలో స్థిరనివాసులైరి

చారిత్రాత్మిక స్థల పరిశోధనలపై అభినివేశముగల శ్రీరాములుగారు ఉద్యోగరీత్యా తామున్న ప్రాంతములను, పరిసరములను పరిశీలించి, పరిశోధనాత్మక వ్యాసములు వ్రాసి ఆంధ్రపత్రిక, ఆంధ్రప్రభ వారపత్రిక, ఆంధ్రప్రదేశ్ పత్రికలలో ప్రకటించిరి. ప్రముఖవ్యక్తుల జీవితచరిత్రలను వీరు వ్యాసములుగా వ్రాసి 'ఇండియన్ ఎక్స్‌ప్రెస్' – 'ఆంధ్రపత్రిక' మున్నగు పత్రికలకు ప్రతివారము పంపి ప్రచురింపజేసిరి. రాయలసీమకు వచ్చిన తరువాత పద్మశ్రీ కల్లూరు సుబ్బరావు, పప్పూరు రామాచార్యులు, పుట్టపర్తి నారాయణాచార్యులు, బెళ్లూరి శ్రీనివాసమూర్తి, తూముకుంట భీమసేనరావు, రేవూరి అనంతపద్మనాభరావు, గుత్తి కేశవపిళ్ళే మున్నగు ప్రముఖులపై వ్యాసములు వ్రాసి మరుగుపడిన రాయలసీమ వ్యక్తులను, పత్రికాముఖముగా కొనియాడిరి. వీరి ఈ కృషి ప్రశంసింపదగినది.

వీరు వ్యాసకర్తలేకాదు నాటక కర్తలుకూడ. అస్పృశ్యతా సమస్యపై వీరి నాటకము 'ఇన్ ది కోర్టు ఆఫ్ యమ' హైదరాబాదు ఆకాశవాణి కేంద్రము నుండి, 'పున్నామ నరకం' నాటిక కడపరేడియో కేంద్రమునుండి ప్రసారము కాబడినవి. వీరి సోదరులు శ్రీనాథరాయకవి రచించిన హిరణ్య హృదయ' మను కావ్యమును నాటికగా రూపొందించి 'వైకుంఠంలో కవి సన్మాన' మనుపేర హైదరాబాదు నుండి ప్రసారము గావించిరి. వీరికథలు 'నోమినేషన్' 'క్రొవ్వొత్తి' కడపరేడియో కేంద్రమునుండి ప్రసారమైనవి.

1977 వ సం॥ కేంద్రప్రభుత్వము విద్యాశాఖ వీరి రచన 'మంచిని పెంచుదాం' (నూతన చదువరులకు) ఉత్తమమైనదిగా ఎన్నికచేసి వేయి రూపాయల బహుమతి నందించిరి. ఇది హిందీ, తమిళ, కన్నడ భాషల

లోనికి కూడ అనువదింపబడుట ఒకవిశేషము. సరళమైన భాషలో బాలలకు వయోజనులకు ఉపకరించే విధముగా వీరు రచించిన 'జాతీయపతాకం-గీతం' 'తరతరాల భారతం' 'జాతిపురోగమనం' 'ప్రకాశం జీవిత చరిత్ర' మున్నగు నవి ముద్రణలో కలవు.

ప్రస్తుతము వీరు రమణమహర్షి పట్ల ఆకర్షితులై వారి జయంత్యుత్సవములు నిర్వహించుటలోను, వారి సందేశములను వివరించు రచనలు చేయుటలోను నిమగ్నులైనారు. వృత్తి రీత్యా ప్రభుత్వ ఉద్యోగులైనప్పటికి ఎల్లవేళలందు సాహితీ మిత్రులతో కాలక్షేపము చేయుచు, ప్రముఖుల పరిచయములతో, వారి ఆశీస్సులతోను పైకి రావలెననెడి కుతూహలముగల్గి, దానికి తోడు తగిన కృషిచేయగల నవయువకులు శ్రీరాములుగారు. వీరిపత్రికారచన కృషి రాయలసీమవాసులకొక వరప్రసాదమైనదనుటలో అతిశయోక్తి లేదు. పెద్దలయెడ భక్తిభావములుగల యిట్టి యువకులు భవిష్యత్తులో మంచిని పెంచగలరను దృఢవిశ్వాసమెల్లరకు కలదు. వీరికి భగవంతుడు ఆయురారోగ్యభాగ్యము లిచ్చి కాపాడుగాత!



# అనంతపుర మండల రచయితలు



వేద విద్యావినీత, విద్వచ్ఛిరోమణి

**శ్రీ యం. బాల విశ్వనాథశర్మ**

జననము.- 1933 ఆగష్టు నెల

జన్మస్థలము:- అనంతపురం జిల్లా బుక్కపట్నము

తల్లి – శ్రీమతి చెన్నకృష్ణమ్మ

తండ్రి – శ్రీ యం. విశ్వనాధశాస్త్రి

మతము, కులము. హిందూ – బ్రాహ్మణ – కాశ్యపగోత్రులు.

శ్రీ శర్మగారు గొప్ప కవిపండిత కుటుంబమునకు చెందినవారు, పౌండరీక వాజపేయాదులు చేసిన, తపస్సంపన్నమైన వంశము వీరిది. సారస్వత ప్రియులు, వేదవిద్యయందు, సాహిత్యమునందు, పితామహులు, తపస్వులునైన, శ్రీ రొద్దం మొదలి కృష్ణశాస్త్రిగారు వీరి గురువులు. తరుశాత కొంతకాలము చెంగల్పట్టు జిల్లా కాకవాక అగ్రహార సమీపమున బ్రహ్మశ్రీ గోడా సుబ్రహ్మణ్యశాస్త్రి గారివద్ద కావ్యనాటకముల నభ్యసించిరి. తరువాత నెల్లూరు వేద సంస్కృత కళాశాలలో విద్యాభ్యాసము చేసి 'సాహిత్య శిరోమణి' 'భాషాప్రవీణ' పరీక్షలయందు పట్టభద్రులై బి. ఏ., డిగ్రీని కూడా అందుకొనిరి. యజుర్వేదమున శీతి ద్వయమును అధ్యయనము చేసినారు.

సంస్కృతాంధ్రముల యందు చక్కని కవిత చెప్పగలరు. గ్రంథకర్తలు. ఆగమ విద్యను బాగుగా నభ్యసించిరి. ప్రసిద్ధులైన వక్తలుగా ఆంధ్రదేశమువందు కీర్తి గడించిరి. ఆగమ శాస్త్ర విషయమున కార్య నిర్వహణమునకై ఎండోమెంటు వారిచే భద్రాచలమునకు ఆహూతులైరి,

1973 లో న్యూఢిల్లీలో జరిగిన అఖిలభారత వేద విద్వన్మహా సమ్మేళనము నందు పాల్గొనిరి. వేద శాస్త్రములందు బహుళ పాండితిని గడించిరి.

ఈనాడు వీరి శిష్యులనేకులు దేశమునందంతట అధ్యాపకులై, ఉపన్యాసకులై కళాశాల అధ్యక్షులై యున్నారు. శ్రీ బాల విశ్వనాథశర్మగారు సత్త్వగుణ సంపన్నులు. వీరి గ్రంథములు (1) ప్రకృతి ప్రభాకరము (2) వ్యుత్పత్తి భాస్కరము (3) సంస్కృతవల్లరి (4) వివేకానంద జయము (సంస్కృత పద్యములు) (5) సంస్కృత వ్యాకరణ ప్రవేశిక (6) అలంకార శబ్దానుశాసనము (తెలుగు వ్యాకరణము) (7) వ్యాస సంపుటి (సంస్కృత వ్యాసములు) (8) గురుదక్షిణ (సంస్కృత నాటిక) (9) శ్రీ శారదా సుప్రభాతము (10) ఆదిశంకర భగవత్పాద జీవిత చరిత్రము (తెలుగు పద్యములు) (11) సోమవార వ్రతమహాత్మ్యము.

ముఖ్యముగా వీరు చేయుచున్న సంస్కృతసేవ దేశమునందు గణనీయము. 1970 వ సం॥ నుండి ఇంతవరకు సుమారు 600 శిష్యులు వీరి వద్ద సంస్కృతాధ్యయనము చేసినారు. వీరిటీవల ఉచిత సంస్కృత పారశాల నెలకొల్పి దానిని నిర్వహించుచు ఏడుగ్రంథములను సమితి పరముగా ప్రచురించిరి. ఇప్పుడు వీరు రచించిన "విత్యానుష్ఠాన చంద్రిక" ముద్రణ మగుచున్నది. వీరు ప్రస్తుతము అనంతపురము శ్రీ సాయిబాబా జూనియర్ కళాశాలయందు సంస్కృతోపన్యాసకులుగా పనిచేయుచున్నారు. వీరిసాహితీ సేవ, సంస్కృతభాషా సేవ, వేద పారశాలపోషణ, మున్నగునవి మిక్కిలి ప్రశంసార్హములు. దేశమునందలి సుప్రసిద్ధ విద్వాంసుల చేత మన్నన లందుకొనిన వీరి జీవితము ధన్యము. వీరికి శంకరుడు ఆయురారోగ్య భాగ్యములిచ్చి, కాపాడుగాత !



# డా॥ జి. యస్. మోహన్,



జననము - 3-11-1949

తండ్రి:- గుమ్మగట్ట శ్రీనివాసరావు

తల్లి:- కీ॥ శే॥ గుమ్మగట్ట రమాబాయి

మాతామహులు.-

'మహామహోపాధ్యాయ' 'కళాప్రపూర్ణ'
డా॥ చిలుకూరి నారాయణరావుగారు

మతము-కులము-హిందూ-బ్రాహ్మణ
మాధ్వులు-కాస్యప గోత్రులు.

జన్మస్థలము - మ ల య నూ రు,
అనంతపురము జిల్లా

డాక్టర్ గుమ్మగట్ట శ్రీనివాసరావు మోహన్‌గారు, చిలమత్తూరు, పామిడి, ధర్మవరములలో హైస్కూలు విద్య, హైదరాబాదు న్యూసైన్సు కళాశాలలో బి. ఎస్. సి. (1968) ఉస్మానియా విశ్వవిద్యాలయము నుండి ఎం. ఏ., తెలుగు పట్టము (1972) బెంగళూరు విశ్వవిద్యాలయము నుండి 1979 ఫిబ్రవరిలో 'స్త్రీల పాటలు - అనంతపురమండలము' అను విషయముపై పరిశోధన గావించి పి. హెచ్ డి. పట్టము పొందిన విద్యావంతులు.

1968-69 లో అనంతపురం జిల్లా ధర్మవరము జూనియర్ కళాశాలలో జూనియర్ తెలుగు పండితులుగను, 1974-75 లో గౌరిబిదనూరు నేషనల్ కాలేజి మరియు ఆచార్య జూనియర్ కళాశాలలలో తెలుగు ఉపన్యాసకులుగాను పనిచేసిరి. 1975 ఆగష్టు నుండి 1980 అక్టోబరు వరకు బెంగళూరు విశ్వవిద్యాలయము తెలుగు విభాగములో రీసర్చి అసిస్టెంటుగా పని చేసి, ప్రస్తుతము ఆదే విభాగములో ఆంధ్రోపన్యాసకులుగా ఉన్నారు.

వీరు డా॥ చిలుకూరి నారాయణరావుగారి దౌహిత్రులు. వీరి తండ్రిగారు, శ్రీ జి. యస్. రావు, ఎం.ఏ., ఎం.ఇ.డి , బి.కామ్ , ఎల్.ఎల్.బి.,

గారు ధర్మవరం జూనియర్ కళాశాలలో ప్రిన్సిపాలుగా పనిచేసి 1974 లో రిటైరైనారు.

వీరి ముద్రిత గ్రంథములు. (1) కన్నడ-తెలుగు గాదెగళు-సమానార్థకగళు', ఇది కన్నడములో ముద్రితము. కన్నడ తెలుగు భాషలలో సమానార్థకములైన సామెతలు; ఆంగ్ల, హిందీ, తెలుగు, కన్నడభాషలలో సమానార్థకములైన కొన్ని సామెతలు ఇందు కూర్చబడినవి. సామెతలపై ఉపోద్ఘాతము వ్రాయబడినది.

(2) 'జానపద విజ్ఞాన వ్యాసావళి' దీనికి ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు రెండువేలరూపాయలు గ్రాంటుగా ఇచ్చిరి. ఇందు జానపద విజ్ఞానమునకు సంబంధించిన 17 వ్యాసములు గలవు. తెలుగులో జానపద విజ్ఞానమునకు సంబంధించిన ఇన్ని వ్యాసములు శాస్త్రీయముగా గ్రంథరూపమున వెలువడుచుండుట ఇదియే ప్రథమము. శ్రీ మోహన్‌గారు దీనిని కీ॥ శే॥ లైన వారి మాతృమూర్తికి ప్రేమతో సమర్పించి ధన్యులైరి. ఈ గ్రంథము 1981 జనవరిలో విడుదలైనది.

వీరి తెలుగు, కన్నడ, ఆంగ్లభాషలలో జానపద విజ్ఞానము, భాషా విజ్ఞానములపై నలుబదికి పైగా వ్యాసములు ప్రచురింపబడినవి. వాటినన్నింటిని 'జానపద విజ్ఞాన వ్యాసమంజూష' పేర్లతో పుస్తకరూపమున తెచ్చుటకు ప్రయత్నములు చేయుచున్నారు. 'స్త్రీల పాటలు (అనంతపుర మండలము) సిద్ధాంత వ్యాసముకూడ అముద్రిత గ్రంథముగా నిలిచి ఉన్నది. 'కన్నడ-తెలుగు గాదెగళు-సమానార్థగళు ముద్రించిన విధముగానే - తెలుగు - కన్నడ సామెతలు సమానార్థములు, ప్రచురించు ప్రయత్నములో ఉన్నారు.

వీరు ఆంధ్రప్రదేశ్ జానపద సాహిత్య పరిషత్తు, హైదరాబాదు, కార్యదర్శులలో ఒకరు. అనేక భాషాసాహిత్య సదస్సులలో పాల్గొని పరిశోధన వ్యాసములను చదివిరి. 1978 డిసెంబరులో కటక్ (ఒరిస్సా)

లో జరిగిన 'International Seminar on folk Culture' కు బెంగళూరు విశ్వవిద్యాలయము నుండి ప్రతినిధిగా పంపబడిరి. హైద్రాబాదు, బెంగళూరు ఆకాశవాణి కేంద్రముల ద్వారా వీరి ప్రసంగములు వెలువడినవి. జానపద విజ్ఞానముపై ఆసక్తి మెండుగా గలిగి విమర్శనాదృష్టి అధికముగా కలిగిన యువకుడు శ్రీ మోహన్‌గారు. చిన్నవయసుననే పెద్దకార్యమును సాధించిన ఘటికులు వీరు. మాతామహులైన కీ॥ శే॥ డా॥ చిలుకూరి నారాయణరావుగారికి తగిన మనుములు వీరు. వీరి కృషి, ఆచంద్రతారార్కము నిలుచునది, భావితరములవారికి బంగారుబాట కాగలిగినది. వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యము లిచ్చుగాత !



సాహితీబంధు-దేశికసార్వభౌమ

శ్రీ తూముకుంట భీమసేనరావు

జననము - 1911 జూన్ 27

జన్మస్థలం -కల్యాణదుర్గం తా॥ తూ ము కుం ట.

జనని:—శ్రీమతి వెంకమ్మ

జనకులు:—శ్రీ గుండూరావు

మతము, కులము — హిందూ - బ్రాహ్మణ

అనంతపురము జిల్లాలోని ఉన్నతపాఠశాలలలో భారీఎత్తున సాహితీ వ్యాసంగములకు నాందిపలికి, విద్యార్థులకు సాహిత్యాభిరుచి కలిగించిన వారు శ్రీ భీమసేనరావుగారు. వారు (1960-71) వఱకు అమరాపురం, మడకశిర, కల్యాణదుర్గం ఉన్నత పాఠశాలల ప్రధానోపాధ్యాయులుగా పనిచేసి, పాఠ

శాలల సర్వతోముఖాభివృద్ధికే గాక ఆయా ప్రాంతపు సాంఘికాభివృద్ధికి కూడ కృషిచేసిరి.

వివిధ విషయములపై తమ అభిప్రాయములను పత్రికల ద్వారా పాఠకుల కందించ వలెననెడి తపన వీరిని రచయితగా మార్చినది. తదుపరి వీరికృషి పరిశోధనలపై మరలి 'ద్రౌపదీ స్వయంవరము' 'సౌగంధికాపహరణము' లపై భారతికి వ్యాసములు వ్రాసిరి. శ్రీ రూపావతారం నారాయణ శర్మగారి 'నీలకంఠ విజయము' నకు విమర్శనాత్మకమైన పరామర్శ వ్రాసిరి. శ్రీ రూపావతారం గారితోకలిపి పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారి జీవిత చరిత్రను 'కర్మయోగి కల్లూరి' అను పేర చక్కని వచన రచన గావించి రాయలకళాపరిషత్ పక్షమున ప్రకటింపనున్నారు.

శ్రీ భీమసేనరావుగారు రచయితేకాదు, కృతిభర్తలు కూడ. కవి సవ్యసాచి కలుగోడు అశ్వత్థరావుగారు వేమన పద్యములను కన్నడీకరించి శ్రీ భీమసేనరావుగారి కంకితమిచ్చిరి. కృతికర్తను శ్రీరావుగారు స్వర్ణకంకణముతో సన్మానించిరి. చిరకాలమైత్రికి చిహ్నముగా శ్రీ రూపావతారం నారాయణశర్మగారు 'దేవయాని' కావ్యమును శ్రీ రూపావతారం వారికంకితమిచ్చిరి. రావుగారి సప్తతి శాంతి సందర్భముగా వీరి శిష్యులైన శ్రీ జి. చెన్నయ్య కవి తమ గురువుల జీవితమును 'గురుసంకీర్తన' మను పేర ఒక శతకమును వ్రాసి వారి కంకితమిచ్చిరి.

పద్మశ్రీ కల్లూరు సుబ్బరావుగారి కనుచరులై వారిచే స్థాపింపబడిన రాయల కళాపరిషత్తునకు అధ్యక్షులై ఆసంస్థ పక్షమున రాయలసీమలోని ప్రముఖ కవిపుంగవులను, నటశేఖరులను ఘనముగా సన్మానించిరి. వీరు నిర్వహించిన సాహితీకార్యక్రమములలో 1964వ సం॥లో కల్యాణదుర్గంలో తొమ్మిది దినములపాటు నిర్వహించిన సభలో ఆంధ్ర-కన్నడ సోదరుల ఐక్యతాభావము వెల్లివిరిసినది.

1979 లో శ్రీరావుగారికి కల్యాణదుర్గం సాంస్కృతిక సంఘమువారు శ్రీ చేబ్రోలు సుబ్రహ్మణశర్మ అధ్యక్షతన జరిగిన సభలో 'సాహితీబంధు'

బిరుదము నిచ్చి సత్కరించిరి. 1980 మార్చి 23 వ తేది అనంతపురములో వీరి సప్తతి శాంతిమహోత్సవ సందర్భమున ఆనాటిసభకు అధ్యక్షత వహించిన శ్రీ బోలూరి హనుమజ్జానకీరామశర్మ గారి సమక్షమున పలువురు కవి పుంగవులు వీరిని 'దేశిక సార్వభౌమ' అను బిరుదుతో సత్కరించిరి.

విద్యావేత్తగా, ఉపాధ్యాయ ఉద్యమనేతగా రచయితగా, కృతిపతిగా సాహితీబంధువుగా రాణించిన శ్రీ తూముకుంట భీమసేనరావుగారికి నేటికి ఏడు పదుల వయస్సు. ఈ వయస్సులో కూడవారు సాహితీ వ్యాసంగమును వదలక ఉత్సాహవంతులై నిర్వహించుచుండుట ఎంతయో ముదావహము.

వీరు కవిపండితులయెడ ఆదరణచూపు స్వభావము గలవారు. వీరిని శ్రీ సర్వేశ్వరుడు సదా రక్షించుగాత.

## సరసకవి
## శ్రీ బండమీదపల్లి భీమరావు



జననము:- 1-7-1912

తల్లి:- శ్రీమతి భాగమ్మ

తండ్రి:- శ్రీ హనుమంతరావు

జన్మస్థలము :-

మరూరు బండమీదపల్లె, అనంతపురం జిల్లా

మతము, కులము:- హిందూ-బ్రాహ్మణ- ఉలచకమ్మ-శౌనక గోత్రులు.

అనంతపుర పట్టణమున శ్రీ బండమీదపల్లి భీమరావును గూర్చి తెలియనివారులేరు. వీరు అనంతపురము శ్రీ సాయిబాబా జూనియర్ కళా

శాలలో 1944 నుండి సెకెండరీ గ్రేడు ఉపాధ్యాయులుగాచేరి అచ్చట 1972 వరకు పనిచేసి, విశ్రాంతి తీసుకొనిరి. చిన్నతనము నుండియు భీమరావు గారికి తెలుగు సాహిత్యముపై అభిలాషమెండు పీరికి పీరి మేనమామ దేశాయి రామచంద్రరావుగారు ప్రాథమిక విద్యతోబాటు తెనుగు పద్యపఠనముపై పునాది వేసిరి. స్వగ్రామములో ఎనిమిదవతరగతి వరకు చదివి. పిదప మదనపల్లె దివ్యజ్ఞాన ఉన్నతపాఠశాలలో ప్రవేశించి, యస్. యస్. యల్. పి. వరకు చదివి ఉత్తీర్ణులైరి. 1931_33 సం॥లో బళ్లారిలో సెకెండరీగ్రేడ్ ఉపాధ్యాయుడుగా శిక్షణ పొందిరి.

చిన్నతనము నుండియు నాటకప్రదర్శనపై అభిలాషగల భీమరావు గారు పిన్నవయసుననే 'దుర్వాస గర్వభంగము' - 'బాలతపస్వి' - 'భక్త ప్రహ్లాద' మున్నగు నాటకములు వ్రాసి పలుచోట్ల ప్రదర్శించి మెప్పు పొందిరి. బాలతపస్వియైన ధ్రువుడు తండ్రితొడ యెక్కబోగా, సవతితల్లి వానిని క్రిందికీడ్చినది. అప్పుడాతని మనసు క్రుంగి ఏకధారగా కన్నీరుగార్చినది. ఆ బుడుతడు తనతల్లి కడకువెళ్ళగా ఆమె ఆ చిన్నారివాని నెత్తుకొని ఇట్లు ప్రశ్నించినది.

సీ॥ పసరంబు పొడువరా బరుగువాఱుచు జాఱి
పడితివో యెందైన బుడుత ! నీవు ?
తోడి బాలురగూడి యాడెడివేళల
గొట్టిరే వారలు పట్టి నిన్ను ?
'పెనుబూచి యిదెవచ్చెగను' మంచు బెదరింప
వెఱపొందితే చిన్నబిడ్డ ! నీవు ?
నీయాట వస్తువుల్ నేస్తగాండ్రెవరేని
దస్కరించిరె ముద్దుతనయ ! తెల్పు

గీ॥ మేల ? పాల్గారు చెక్కిళు లెఱ్ఱవాఱె ?
సిగ, యదేలొకొ ముడివీడి చిక్కువడియె !
కంట తడివెట్టగా నేమి కారణంబొ ?
చెప్పుమా ! యేడ్వవలదు ; నాచిన్నియన్న !

ఇట్లతి సరళముగా వ్రాయుటచేతనే వీరికి సరసకవి బిరుదము లభించినది. వీరి పద్యములలో భావములుకూడ అద్భుతములే. వీరు రచించిన శ్రీ చంద్రమౌళీశ్వర శతకము'నందలి ఒకపద్యమును చూతము.

కంటమంటలు, గళమున గరళముండ
చూపులో చల్లదనమును, తీపుమాట
యుండునాయని సందియ మొందుచుందు,
వృషభపురివాస ! చంద్రమౌళీశ ! శ్రీశ !

'స్వాతంత్ర్యసమర విజయము' — 'ఏకాంతవాసి' వీరి యితర అముద్రిత కృతులు.

శ్రీ భీమరావుగారు నిపుణులు, నిరాడంబరులు, నిస్వార్థసేవాపరాయణులు, కర్తవ్యదీక్షాదక్షులు. సద్గుణ సంపన్నులు. అనంతపురములో ముద్రింపబడు జిల్లాకవుల పుస్తకములందలి తప్పొప్పులను సరిదిద్దు ముఖ్యమైన పనిని వీరు చేబట్టి కవిపండితులకొక గొప్పసహకార మొనర్చిరి. వీరు కొన్నాళ్ళపాటు 'లక్ష్మీస్వదేశీప్రెస్'లో మేనేజరుగా పనిచేసిరి. ఏడు పదుల వయసులోకూడ పీలు కల్గజేసుకొని, తామార్జించిన విద్యను విద్యార్థులకు ధారబోయుచు, సాహితీ సేవజేయుచు శాంతముగా తమ జీవితమును కడపుచున్నారు. వీరికి శ్రీ పరమేశ్వరుడు, ఆయురారోగ్య భాగ్యము లొసగి రక్షించుగాత !





(ఆధ్యాత్మిక తత్వ ప్రబోధకవి)

## శ్రీ బి. బసప్ప

**జననము:- 13-4-1903**

తల్లి -శ్రీమతి మల్లమ్మగారు

తండ్రి -శ్రీబెళగల్లు పెద్ద ఆగులూరప్ప

మతము, కులము'-హిందూ - కురుబ

స్వస్థలము -బెళగుప్ప-కల్యాణదుర్గము తాలూకా అనంతపురం జిల్లా

కవిగారి ఇంటిపేరు బెళగల్లు వారు. వీరి కులవృత్తి నేతపని. పేద కుటుంబములో పుట్టిపెరిగి కష్టపడి చదువు నేర్చుకొన్నవారు. చదివినది నాల్గవ తరగతి స్వయంకృషితో నేర్చుకొన్న భాషలు తెనుగు, కన్నడము. వీధిబడి ఉపాధ్యాయుడుగా కాలము గడపుచు, లోయర్‌గ్రేడ్, హైయర్ గ్రేడ్ ట్రయినింగులు ప్యాసైరి. కన్నడ-తెనుగుభాషలలో పాండిత్యము సంపాదించి 'ఉభయ భాషా ప్రవీణ' బిరుదును పొందిరి. 14 సంవత్సరములు ఉపాధ్యాయునిగా పనిచేసిరి. వైద్యమునేర్చి రోగులను కాపాడిరి.

బసప్పగారు ఆధ్యాత్మిక చింతనాపరులు. వారికబ్బిన కవిత్వమును ఆధ్యాత్మిక ప్రబోధమునకే ఉపయోగించిరి. 'సద్గురు హితబోధే' అను శతకమును కన్నడభాషలో వీరు ఆటవెలది వృత్తములతో వ్రాసిరి. ఈ శతకము ద్వారా కవిగారు ''గ్రంథములు చదివి జ్ఞానము సంపాదించవచ్చును, బుద్ధి వికసింపజేసుకొని పండితుడు కావచ్చును, సభాసన్మానములు పొందవచ్చును - అంతేకాని ఆత్మవికసింపదు. నీవు ధర్మపరుడైన స్వర్గసుఖములు అధర్మపరుడైన నరక దుఃఖములు తప్పవు.'' అని ప్రబోధించిరి. ఈ శతకమును వీరి గురువులైన 'ఎరిస్వామి' గారికంకిత మిచ్చిరి. తదుపరి వీరి నీతి శతకములోని ఈశ్వరుని వర్ణన చూతము.

సీ॥ కట్టపుట్టము లేక - కరితోలు, పులితోలు
కటిచుట్టు బిగియించి గట్టినావు.
వాయువేగముగల్గు - వాహనంబులు వీడి
ఎద్దుపై మోజుతో నెక్కినావు
పాలన్నమును బాసి - పాయసాన్నము వోలె
మేలైన విసమును మెక్కినావు
బంగారు తొడవులు బాగుగానవి ద్రోసి
పాముల సొమ్ముగా - పలచినావు

గీ॥ ఎవరు ఎరిజేర నీయని హేతువనుచు
తెలియదరం మౌనె : నిదగుతెలివిగాదె,
సత్యమనుజాటు, వినరయ్య సకలజనులు
పూజ్యబసవేశ ! బెళగుప్ప — పురనివాస ।

వీరి పద్యములన్నియు నరసింహ శతకమైలివి బోలి ధారాళముగ ప్రవహించినవి. అన్నియు అముద్రితములు.

శ్రీ బసప్పగారి 'బసవరాజు శతకము' లోని ఆటవెలదులు వేమన్న ఆటవెలదులవలె ఆడిపాడిసవి, అందువారు తొలుత గణపతినిట్లు ముద్దుగా ప్రార్థించిరి.

ఆ॥వె॥ మదన దమన తనయ - మటుమాటలాడక
దొసగు బొసగ నీక — తోడుకమ్మ,
కవిత వ్రాయనేమ - కలము బట్టినపుడు
పరమయోగితేజ ! - బసవరాజ.

ఈ కవిగారు యోగులు; భక్తులు నిరాడంబరులు. వీరజ్ఞాతముగా మారుమూల కుగ్రామమునందు గుట్టుగా జీవించుచున్న ఆధ్యాత్మిక తత్త్వ ప్రబోధ కవులు. ఇట్టివారి కృషిఫలితముగా గ్రామములందలి కష్టజీవులు దైవభక్తిని, ఆధ్యాత్మిక చింతను పెంపొందించు కొనుచున్నారు. ఇట్టి నిస్వార్థసేవాపరాయణులగు కవులనుగూర్చి మనము తెలుసుకొనుట ఎంతేని అవసరము. వీరి రచనలు వెలుగుజూడ గోరుచున్నాము. వీరికి బసవేశ్వరుడు సంపూర్ణ ఆయురారోగ్యములనిచ్చి కాపాడుగాత !



లలిత కవికోకిల - విద్యారత్న
విద్వాన్
శ్రీ తలమర్ల కళానిధి
జననము:— 1915
జన్మస్థలము:— తలమర్ల, పెనుకొండ తా॥ అనంతపురం జిల్లా
తల్లి - శ్రీమతి ఓబాంబ
తండ్రి —శ్రీ ఓబన్న
మతము, కులము —హిందూ - హరిజనులు.

"శారదా ! నన్నేల వరియించితో
ఓ సుభాషిణీ ! సుగుణాంబుధీ ! నన్నేల వరియించితో?
కొఱగాని కులమని, తెలిసితెలిసీ, కోరి నన్నేల వరియించితో
భారతీ! నన్నేల వరియించితో?

మంజుల వీణా నాదముతో, నాయిలు సేరితి వనుచు
ఆడివోసుకొను యిర్ష్యాలోకమున కదనొసగి
నన్నేల వరియించితో—శారదా! నన్నేల వరియించితో॥"
(గేయ సుమమాల)

అని వాణికడ తనమనసులోని ఆవేదనను తెల్పుకొన్న కవికోకిల, మరెవ్వరో కాదు; గతమున 'శ్రీకొల్లప్ప' నామధేయుడుగా నుండి, నేడు సాహితీ లోకమున 'కళానిధి'గా వ్యవహరింపబడు చున్నవారే. శ్రీ శారదా మాత వరించుటకు కులముతో పనిలేదు. ఆమెకు సద్గుణ సంపన్నుడవసరము. అట్టివాని జిహ్వాగ్రమున ఆమె యిలుగట్టుకొని వసించును. అతనికొక ఘనకీర్తినే తెచ్చిపెట్టును. శ్రీ కళానిధి నేడామె వరప్రసాదమున బహు గ్రంధ కర్తయై సాహితీప్రక్రియ లన్నింటియందును సిద్ధహస్తులైరి.

తలమర్ల గ్రామము కవికుమారులకు నిలయము. ఇక్కడ పుట్టిన శ్రీ బెళ్లూరి, శ్రీ వేదాంత నరసింహారెడ్డి మొదలైన కవులు ప్రకృతి సౌందర్యోపాసకులై కవితల్లిరి. కళానిధిగారుకూడ వీరి సాంగత్యమున ప్రభావితులై తొలుత భావగేయములను వ్రాసిరి. తదుపరి వచన రచనలు వ్రాయతలపెట్టి - కథలు, కథానికలు, నాటకములు, బాలసాహిత్యములు వ్రాసిరి. ఇహపరదాయకమగు రామాయణకథను 'శ్రీ రామాయణనిధి' గా వచనము నందును, శ్రీరామకృష్ణ పరమహంస దివ్యచరితమును 'దక్షిణేశ్వర భాగవతము'గా మంజరీ ద్విపదలో రెండు సంపుటములుగా వ్రాసి ముద్రించి ధన్యులైరి. వీరిరచనల యందిది తలమానికము. ఇది కవి పండితుల ప్రశంసలనందుకొన్న గ్రంథరాజము. దీని ముద్రణకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ వారి సహాయము లభించినది. ఇందలి రచనా విధానము పాఠకుల మనసులనెట్లు నాకట్టు కొనుచున్నదో చూదుడు. రామ కృష్ణుని భూతదయనిట్లు కవిగారు అభివర్ణించిరి.

ఒకనాడు నైవేద్య మొప్పారు నట్లు
కాశిక కర్పించు వేళలో నొక్క-
మార్జాల మరుదెంచె మ్యావ్‌మ్యావు మనుచు
మాతను జేరంగ మమత లూరుచును;
గురుదేవు డద్దాని కొమరార గాంచి
అమ్మరో ! ఆహార మవసర మనుచు
త్వరపడు చుంటినా కరుణాలవాల !
ఇదిగొ తినుమనుచు హృదయంబు బొంగ
పిల్లికా యన్నంబు ప్రియమార బెట్టె !

తమకుగల సంస్కృత పరిచయముతో శ్రీ కళానిధిగారు శ్రీ లీలా శుకునిచే రచింపబడిన శ్రీ కృష్ణకర్ణామృతము' నందలి ప్రతిశ్లోకమునకు 'మధుకణము'లను పేర చక్కని వచనరచనను భావయుక్తముగా వివరముగా సర్వుల కర్థమగునట్లు వ్రాసిరి. శ్రీశంకరాచార్యుల విరచితంబగు శివానందల హరి - సౌందర్యలహరులను కూడ సులభతరమగు వచనములను వ్రాసిరి. హిందూ, ముస్లిం మతములమధ్య అనుసంధాన సేతువుగా నిలిచిన కబీరు దాసు సూక్తులను 'కబీరుసూక్తి నిధి, పేర తేట గీతపద్యములు వ్రాసిరి. కబీరు తన 'సాఖీ'లో మనుజునకు చూపిన ఆనందసామ్రాజ్య తత్వమును కళానిధి గారిట్లు పద్యములలో వ్రాసిరి.

ఆకసము నంటుచెట్టుకు నందరాని
ఏ చిటారు కొమ్మలలోనొ ఇంపులొలుక
ఫలము ఫలియించె - దానిని భవ్యమలర
తినగ నోచిన పక్షులు గనగ నరుదు.

అరుదుగానుండు నాపండు అమరమూర్తి
అదియె ముక్తియు జీవంబు నదియె మిగుల
సంతసంబొన గూర్చెడు సంబరమును
అదియె, ఆనంద సామ్రాజ్య మగును జగతి.

వీరి కథలు ప్రేమపూజ, మణిమనోహరులు, కథానిధి మొదలగు సంపుటములుగా వెలువడినవి. అట్లే 'హరిజనోద్ధరణ' - 'వర్ణాంతర వివాహాలు' మొదలగు నాటకములు వ్రాసిరి.

హైయ్యర్ గ్రేడు ఉపాధ్యాయవృత్తిలో ప్రవేశించిన శ్రీ కళానిధిగారు స్వయంకృషితో 1915లో విద్వాన్‌లో ఉత్తీర్ణతపొంది, అనంతపురమునందు తెలుగు పండితులుగా పనిచేసి, 1970 లో రిటైరై విశ్రాంతి తీసుకొనుచున్నారు. 1965 లో శ్రీ సరస్వతీ పుత్ర పుట్టపర్తి నారాయణాచార్యులవారు వీరి కవితను మెచ్చి 'లలితకవికోకిల' అను బిరుదము నిచ్చిరి. 1970 లో శ్రీ వేంకటేశ్వర ఆనందస్వాములవారు 'విద్యారత్న' బిరుదమిచ్చిరి.

మొదటినుండియు బీదతనముతోనే జీవితమును గడపుకొనుచు వచ్చిన కళానిధిగారు నిరాడంబరులు, సుగుణసంపన్నులు, పెద్దలయెడ గౌరవ భావము కలవారు. అనంతపురమునందు మహాదాతలుగా పేరెన్నికగన్న శ్రీయుతులు జూగప్ప-ఎద్దీరప్ప-గొంగడిరామప్ప-టి. కోదండరామయ్య మున్నగువారందరు వీరికృతుల ముద్రణకు సహాయపడిరి. వీరి కృతులన్నియు ముద్రితములే. మంచిమనిషిగా, విలువగల విద్వన్మణిగా పేరుదెచ్చుకొన్న కవితానిధి మనకళానిధి. వజ్రము మట్టిలోనున్నను రాశిలోనున్నను దాని విలువ తరగనిది. పద్మము బురదలో పుట్టినంతమాత్రమున అది శ్రీమన్నారాయణుని పదకమలము జేరలేదా? పూర్వజన్మ సుకృతముతో శ్రీవాణి అనుగ్రహమున సంపాదించిన కవిత్వముతో శ్రీ కళానిధిగారు ఇహపర సుఖములకు దోహదకరములగు ఉత్తమ సద్గ్రంథములను వ్రాసి జన్మను సార్థకము చేసుకొనిరి. వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యము లిచ్చి కాపాడుగాత!



సర్వతంత్ర స్వతంత్రవిద్యానిధి
విద్వాన్ - వైద్యవిద్వాన్

# శ్రీ అలుకూరు గొల్లా పిన్ని వాసుదేవశాస్త్రి

జననము:- 19-2-1917

జన్మస్థలము - చిన్నముష్టూరు- అనంతపురం జిల్లా

తల్లి -శ్రీమతి సుబ్బమ్మ

తండ్రి:-శ్రీ గొల్లాపిన్ని సీతారామశాస్త్రి

మతము, కులము:- హిందూ- బ్రాహ్మణ - స్మార్త.

శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రిగారు సంస్కృతాంధ్ర కవులేకాక జ్యోతిష్య ఆయుర్వేద శాస్త్రములందు ఉద్దండపండితులు. వీరు చాలకాలము అనంతపురము జిల్లా ఉన్నత పాఠశాలలందు తెలుగు పండితులుగా పనిచేసి పేరుగాంచిరి. శ్రీ గొల్లాపిన్నివారిది పండితవంశము. ఈ వంశము వారెల్లరు పండితులు, కవులు, వైద్యశిఖామణులే. శ్రీ వాసుదేవశాస్త్రిగారు చిన్నతనమునందే పితృపాదులవద్ద ఆరేండ్లు నాటకాంత సాహిత్యము జ్యోతిషశాస్త్రము నేర్చిరి. తదుపరి తిరుపతి శ్రీ వేంకటేశ్వర సంస్కృత కళాశాల యందు తర్క, వ్యాకరణములు, అలంకారశాస్త్ర పాఠములు నేర్చిరి. వారణాశిలో పండితవర్య శ్రీ గణేశ విద్యావాగీశుల యొద్ద పూర్వోత్తర మీమాంస శాస్త్రాభ్యాసము, మరియు సాంఖ్యయోగాది తదితరదర్శనము లభ్యసించిరి.

ఆయుర్వేదము వీరికి అభిమానవిద్య. ఆ విద్యను వీరు విజయవాడలో అభ్యసించి 'వైద్యవిద్వాన్' పరీక్షలో ఉత్తీర్ణులైరి. 1939 లో

మద్రాసు యూనివర్శిటీనుండి 'విద్వాన్' పట్టము పొందిరి. ఆయుర్వేదము నందలి రసశాస్త్రముపై వీరు పరిశోధనకూడ గావించిరి. తంత్రశాస్త్రము నందుకూడ వీరికి పరిచయము కలదు

శ్రీ గొల్లాపిన్నివారికి పదునారవ ఏటనే కవిత్వమబ్బినది. వారుచిన్న తనమున గోదేవిపై వ్రాసిన ఒకపద్యము చూడుడు.

గీ॥ పూరి కడుపార లేకున్న – పొదుగులోన
పాలు కొంతకు కొంతయై పలుచబడిన
నీ విసుంగుకు, యింతయో నింతయిచ్చి
ముద్దుసేయుదు వమ్మరో – మోమువంచి

వీరు తొలుతనుండియు 'భారతి' మాసపత్రికకు అనేకవిషయములపై వ్యాసములు వ్రాయుచుండిరి అట్లే ఆయుర్వేదముపై 'ఇండియన్ మెడిసన్' అను మాసపత్రికలో 'కాన్సరు' పరిశోధన వ్యాసములు ప్రచురించిరి. ఇవియేగాక 'భూగర్భజలజ్ఞానశాస్త్రము' నకు వీరు టీకను వ్రాసిరి. అను రుకము నాంధ్రీకరించిరి. జ్యోతిషార్ణవము, ఆయుర్వేద సర్వస్వము ఆంధ్రీకృత ఔచిత్య విచారచర్చ అష్టావధాన, శతావధాన చాటుపద్యములు వీరి యితర రచనలు. వీరు వ్రాసిన అముద్రిత రచనలలో 'మదన సుందరీ పరిణయమను 8 అశ్వాసములుగల పద్యకావ్యమొకటి. ఇందు వీరి రచనా విధాన మిట్లున్నది.

చం॥ ముగుదరో ! సర్వకాలమును ముగ్ధత పోకడ పెట్టెదేల ? పెం
పగు గరువంబు గన్పరుపు భావమునన్ ధృతిబూను మార్దవం
బిగురగ జేయు, మంచు సఖి ప్రేముడి బోధనజేయ. ముగ్ధ మె
త్తగ వనె భీతిహృద్గతుడు దావినునో విభుడంచు నెంతయున్.

వీరనేక విద్వద్గోష్ఠులలో పాల్గొని చర్చలుగావించి విద్వాంసుల మన్న

నలనుపొంది 'సర్వతంత్ర స్వతంత్ర' 'విద్యానిధి' బిరుదములను పొందిరి. అనంతపురం ఆర్టు కళాశాలలో శ్రీ చిలుకూరు నారాయణరావుగారు వీరిని సత్కరించి విద్వాంసుల సమక్షమున 'కవిసింహ' బిరుదము నొసంగిరి. వీరు ఆంధ్రసభ (బళ్లారి) సాహిత్యశాఖకు జాయింట్ సెక్రెటరీగా పనిచేసిరి. హిందూపురం శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలకు ప్రస్తుతము అధ్యక్షులుగా ఉన్నారు. నేటికి అరువది నాలుగేండ్లు వయసునిండిన శ్రీ గొల్లాపిన్నివారు కడు ఉత్సాహముతో సాహిత్యగోష్ఠులందు, సభలందు పాల్గొని చర్చలు గావించి, సందేహములను దీర్చుచున్నారు. వీరు ఆయుర్వేద, జ్యోతిశ్శాస్త్రములను తమ అభిమాన వృత్తులుగా పెట్టుకొని కాలముబుచ్చుచున్నారు. వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యములిచ్చి కాపాడుగాత !



శ్రీ గొల్లాపిన్ని

రామకృష్ణశాస్త్రి

జన్మస్థలము - చిన్నముష్టూరు- అనంతపురం జిల్లా.

తల్లి.—శ్రీమతి సుబ్బమ్మ

తండ్రి:—శ్రీ గొల్లాపిన్ని సీతారామశాస్త్రి

మతము, కులము:- హిందూ - బ్రాహ్మణ - స్మార్త.

సీ॥ కాకతి క్ష్మాపతి కాంచుచున్నాడు హా
ర్షాశ్రు ముక్తామాల సంతరించి,
హరిహర బుక్కరాయలు కాంచుచున్నారు
తెలినవ్వు చలువ వెన్నెలల బరపి

ఘనుడు విద్యారణ్యముని పల్కుచున్నాడు
　　　　పిరిలొల్కు వైదికాశీస్సు గురిపి
శ్రీకృష్ణరాయలు వాకొనుచున్నాడు
　　　　శకుృతో నాంధ్ర ప్రశస్తియేమొ

గీ॥ గురుని కెఱిగించు చుండె తిమ్మరుసుమంత్రి
ఆంధ్రమంత్రుల సాహసౌదార్యములను
గతచరిత్రకు నీకు దార్కాణవారె!
వచ్చియున్నారు నీయుత్సవంబుఁజూడ.

అనుచు ఆంధ్రప్రదేశ్ అవతరణ దినోత్సవమున 'మహాంధ్రోదయ' మను పేర పద్యములనువ్రాపి కమ్మగాపాడి వినిపించిన కవివరేణ్యులు శ్రీ గొల్లాపిన్ని రామకృష్ణశర్మగారు. వీరు గొల్లాపిన్ని సోదరత్రయములో ఒకరు. పెద్దవారు శ్రీ గొల్లాపిన్ని వాసుదేవశాస్త్రిగారు, రెండవవారు శ్రీ గొల్లాపిన్ని రామచంద్రశాస్త్రిగారు. వీరిది పండితవంశము. శ్రీరామ కృష్ణశాస్త్రిగారికి కవిత్వము ఉగ్గుపాలతోనే అబ్బినది. ఆయుర్వేదశాస్త్రము నందుకూడ అనుభవము సంపాదించుకొన్నారు. అబ్కారీ డిపార్టుమెంటులో పలుతావులందు మఱియు కడపలో చాలాకాలము పనిచేసిరి.

శ్రీ రామకృష్ణశాస్త్రిగారు "బుద్ధదేవా! నమః" అను శీర్షిక క్రింద వ్రాసిన పద్యములు కడురమ్యముగా నున్నవి. గమనింపుడు.

సీ॥ కొనకొమ్మ కోయిల - కొసరు కూతలలోన
　　　　ప్రియురాలి పిల్పు - విన్పింప లేదె?
నిండు జాబిల్లి పండించు, వెన్నెలలోన
　　　　వెల్లనౌ మోము కాన్పింపలేదె?

చేరువ సరసిలో - చెంగల్వ రేకులో
చెమరించు, కమల లక్షింపలేదె?
రాయంచ నడలోన - రవళించు పల్కులో
నినదించు నందెల వినగలేదె?

గీ॥ నీవు తపియించు చుండ, మైనీడబోలె
ప్రకృతిలో, లీనమౌచు, నద్వైతభక్తి
జంటఁబాయక నీవెనువెంటనున్న
నీ యశోధరనైన మన్నింప లెమ్మ.

ఉ॥ వృద్ధుఁడు తండ్రి - నిన్ను కనిపెంచిన వాడికమీద, నీకె-యా
వద్ధరణీ భరమ్ముఁదలపైవిడి, ఐహికకాంక్షవీడి, ఏ
సిద్ధపదాశ్రమమ్ములనొ, శేషవయస్సు, వ్యయింపజేయ, స
న్నద్ధత నుండ - నీకు దగునా। యిలువీడగ శాక్యదీపకా?

ఇట్టి కవిగారిని గూర్చి మనమెఱిగినది కొంత. అతడు లోకమునకు చెప్పినది కొండంత; అతనిలో దాగియున్న భావములు సంద్రమంత. లోక మతనికిచ్చు ప్రతిఫల మిసుమంత. అందులకాతడు ఆశింపకుండుట కడు వింత. కవులనైజగుణమ్ములిట్టివేగదా। వీరిప్పుడు ఉద్యోగవిరమణానంతరము అనంతపురములో విశ్రాంతి తీసుకొనుచు, ఉన్నంతలో సాహిత్యసేవ నల్పు చున్నారు. వీరికి భగవంతుడు ఆయురారోగ్య భాగ్యములిచ్చుగాత!





సాహిత్య విమర్శకులు

## శ్రీ సర్దేశాయి తిరుమలరావు

జననము:- 1928 జూలై
జన్మస్థలము:- జోహరాపురం.
ఆలూరు తాలూక, కర్నూలు జిల్లా,
తల్లి - శ్రీమతి కృష్ణవేణమ్మ
తండ్రి.- శ్రీ నరసింగరావు
మతము, కులము.-హిందూ-బ్రాహ్మణ
దేశస్థ-మాధ్వ-కాశ్యపగోత్రులు.

రాయలసీమలో రచయితలున్నంతగా, సాహితీ విమర్శకులు లేరు. విమర్శకుల కొఱతవలన సాహిత్యపు విలువలు తరుగునను మాట అందరెరిగినదే. విలువలేని సాహిత్యము భూమిపై నిలువనేరదు. విమర్శకులుగా రాణించుట బహుకష్టమైన విషయము. విమర్శకుడు తరతమ భేదము లేనివాడుగా, బహుభాషాకోవిదుడుగా, మంచిచెడ్డలను కుండబద్దలు కొట్టినట్లు చెప్పగలుగు ధైర్యశాలిగా, విలదొక్కుకొనగలుగు సమర్థవంతుడుగా నుండవలెను. అట్టి సమర్థులు రాయలసీమ సాహిత్య చరిత్రలో కొద్దిమందేకలరు. వారిలో శ్రీమాన్ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, కట్టమంచి రామలింగారెడ్డి, చిలుకూరు నారాయణరావుగారు అగ్రగణ్యులు. ఈ సాహితీ విమర్శకాగ్రేసరులందరికీ 'భారతి' పత్రిక స్వగృహముగా రాణించినది ఇట్టి విమర్శక శిఖామణులలో అనంతపురము వాస్తవ్యులు, మరియు అనంతపుర మండల శైలసాంకేతిక పరిశోధనాసంస్థ డైరెక్టరుగా పనిచేయుచున్న శ్రీ సర్దేశాయి తిరుమలరావు గారొకరు.

శ్రీ తిరుమలరావు గారిపేరు నేటి పత్రికాలోకమునకు సుపరిచితమైనదే. ఇటీవలనే ఆంధ్రపత్రిక దినపత్రికలో 'బసవేశ్వరుడు కాయకమే కైలాస మనెనా ?' అను విషయముపై సోదాహరణ పూర్వకమగు సుదీర్ఘ చర్చను లేఖల ద్వారా వీరు గావించిరి. ఇట్టి విమర్శనాత్మక వ్యాసములువీరివి భారతి - ఆంధ్రపత్రిక - ఆంధ్రప్రభల వంటి ప్రసిద్ధ తెలుగు పత్రికలలో

వెలువడినవి. వారి ప్రసిద్ధ వ్యాసములలో కొన్నింటి పేర్లైనను పేర్కొన్న వారి విషయ పరిజ్ఞానము, విమర్శనాదృష్టి, వారి అభిరుచులు మనకవగతము కాగలవు.

(1) భారత, రామాయణ, భాగవతముల ఆద్యంతముల అంతర్యము (ఆంధ్రపత్రిక)
(2) తిక్కన శ్రీ పర్వములోని ఛందో వైవిధ్యములోని అంతర్యము (ఆంధ్రపత్రిక)
(3) వేదవ్యాసుడు బ్రాహ్మణేతరుడా ? (భారతి)
(4) మేఘసందేశంలో మేఘుని మార్గము (భారతి)

భారతి సంచికలలో గురజాడ వారిపై వీరు వ్రాసిన విమర్శలు ఎల్లరూ చదువదగినవి.

(1) కన్యాశుల్కంలో అసభ్యత ఉన్నదా ?
(2) గురజాడకు ఎర్రమైన భారతీయ సంస్కృతి.
(3) కన్యాశుల్కం - రియాలిజం.
(4) గురజాడ విదూషకుడా ?

శ్రీ విశ్వనాథవారి నవలలపై ఒక సమగ్ర పరిశోధన గావించి 'విశ్వనాథనవలలు - సమాన లక్షణములు' అను విషయముపై వ్యాసము వ్రాసిరి. భాషా శాస్త్రమునకు సంబంధించిన 'తెలుగులిపి' - 'అమ్మ, అప్ప, అయ్య శబ్దస్వరూప చర్చలు' మున్నగు వ్యాసములు, ఆధునిక కవులైన శ్రీదేవులపల్లి వారిపై 'శ్రీకృష్ణశాస్త్రి-రొమాంటిసిజం' అను విమర్శనాత్మక వ్యాసము భారతిలో అచ్చుకాబడినవి. 'భారత' దేశమునకా పేరు ఎట్లు వచ్చింది ?' అను చారిత్రాత్మక విషయముపైకూడా వ్యాసము వ్రాసిరి. ఇట్లు వీరనేక విషయములను లడవి క్షుణ్ణముగా పరిశోధించి, విమర్శించి అందలి మంచి చెడుగులను పాఠకుల ముందుంచిరి.

శ్రీ తిరుమలరావుగారు గావించిన మరొక ముఖ్యమైన విషయము వివట పేర్కొనవలసి ఉన్నది. 'మహాకవి' శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రిగారు అందించిన 'శివభారత' మను చారిత్రాత్మక ఉద్గ్రంధమునకు 'సాహిత్య తత్వము—శివభారత దర్శనము' అనుపేర మహావిమర్శనాత్మకమైన గ్రంథమునే వ్రాసిరి. తరువాత 'కన్యాశుల్క నాటకకళ' అను సమగ్రపరిశీలనా గ్రంధము నొకదానివి వెలువరించిరి. ఈ రెండు విమర్శలు, ప్రాచ్య, పాశ్చాత్య, ఆలంకారిక దృక్పధముల బట్టి రచింపబడినవి. ఇవి పండితుల చేత ప్రశంసలను పొందినవి.

శ్రీ తిరుమలరావుగారు ఆకారమున కొట్టిగారు, మితభాషులు, సోమరి తన మెరుగనివారు, నిత్యము స్వదేశ, విదేశపత్రికలను విరివిగా చదువు వారు సందేహాస్పదమగు విషయములను వెంటనే పత్రికలకు తెలుపుట, సందేహములు గలవారికి ఆ సందేహములను పత్రికాముఖమున తీర్చుట వీరి ముఖ్యమైన వినోదకృషి. ది హిందూ - ఇండియన్ ఎక్స్‌ప్రెస్-బ్లిజ్ ఇలస్ట్రేటెడ్ వీక్లీ, మున్నగు ఆంగ్లపత్రికలతో అనేక భావగర్భిత ఆలోచనాత్మక లేఖలు, వీరు వ్రాయుచుందురు. ఇప్పటికి వీరిలేఖలు శతాధికము లైనవేమో? వీరేమి వ్రాసినను, ఏమి చెప్పినను అందు విజ్ఞానము, వినోదము, ఆలోచనా మౌలికలతో కూడియుండుట ప్రత్యేకవిశేషము. గ్రాంథిక వ్యవహారిక భాషలందు చక్కనిశైలిలో వ్రాయగలుగుట వీరి పదను కలము నకుగల ఒరవడి.

ఆదోని, అనంతపురం పట్టణములయందు హైస్కూలు కాలేజీ చదువులను ముగించి, రాజస్థాన్ విశ్వవిద్యాలయమునందు రసాయన శాస్త్రములో ప్రథమశ్రేణి యందుత్తీర్ణులై ఎమ్ ఎస్. సి. పట్టమును పుచ్చుకొనిరి. తరువాత అనంతపురము, మైసూరు కళాశాలల యందు రసాయనిక శాస్త్రోపన్యాసకులుగా పనిచేసి, ప్రస్తుతము అనంతపురం "తైలసాంకేతిక పరిశోధనా సంస్థ" యందు డైరెక్టరుగా ఉన్నారు. వీరు తైలసాంకేతిక రంగమునందు అంతర్జాతీయ ఖ్యాతిగల శాస్త్రజ్ఞులు. ఈ శాస్త్రమునందు ఏడు మూడువందలకు

పైగా పరిశోధనలు గావించి అపత్రములను బ్రిటిష్, అమెరికన్, ఫ్రెంచి, జర్మన్, ఇటాలియన్ భారతీయ శాస్త్రీయ పత్రికలలో ప్రచురించిరి. అనేక జాతీయ అవార్డులు, బంగారు పతకములను గెల్చుకొనిన మేధావులు వీరు. ఇంతటి మేధావి పుట్టిన ఈ సర్దేశాయి వంశము ఈనాటిది కాదు. 17వ శతాబ్దములో ఆదోని నవాబుకు దివానుగా ఉండి, మంత్రాలయములో శ్రీ రాఘవేంద్ర స్వాములవారికి ద్వైతమత పీఠస్థాపనకు తోడ్పడిన శ్రీ సర్దేశాయి వెంకన్నగారు వీరి పదవతరము వారగుట గొప్ప విషయమే కదా!

సాహిత్య, శాస్త్రరంగముల యందు సవ్యసాచులుగా వెలుగుచున్న శ్రీ సర్దేశాయి తిరుమలరావుగారు P E N All India Centre లో సభ్యులు హిందుస్థాన శాస్త్రీయ సంగీతాభిమానులై హాస్య ప్రియత్వం, నిర్భయత్వం క్రియాపటతగల శ్రీ సర్దేశాయివారిని సాహిత్య మెట్లుండవలెనని ప్రశ్నించినపుడు వారు చెప్పిన మాటలివి.

"తొలకరి చినుకులు చిటపట పడునపుడు, పిల్లలు తలమీద చేతులు పెట్టుకొని 'బుడుగో-బుడుగు' అని అలుచుచు గుండ్రముగా తిరుగునప్పటి ఉత్సాహమీయనవలెను. అశక్తులను, శక్తులుగా, మార్పగల్గి ఉండవలెను. కవిత్వమొక Spring Board దానిమీద నిలబడి మనుష్యుడు ప్రగతి పథమున కెగురగలిగి ఉండవలెను."

ఇంతకంటెను వేరు నిర్వచనములు ఈ విషయమున చెప్పలేము. వీరు వివాహ జంజాటములో, చిక్కుపడక నిశ్చింతగా, ఏకాంతవాసమున బ్రహ్మచర్యమును గడపుచున్నారు. వీరికి భగవంతుడు దీర్ఘాయువు నొసంగి వీరిచే ఇతోధికముగా సారస్వతసేవ జరిపించుగాక!

విద్వచ్ఛిరోమణి - విద్వాన్ - సరసకవిరత్న - అభినవ నీలకంఠదీక్షిత



## శ్రీ రూపావతారం నారాయణశర్మ

తల్లి:—శ్రీమతి పార్వతమ్మ
తండ్రి —శ్రీ కృష్ణశాస్త్రులు
జన్మస్థలము:— పా వ గ డ. కర్ణాటక రాష్ట్రము.
మతము, కులము:— హిందూ బ్రాహ్మణ-భారద్వాజసగోత్రులు

తెనుగు సాహిత్యము తొలుత అనువాదక్రియ తోడనే ఆరంభమైనది. కొంత కాలమువరకు సంస్కృతము నుండియే పెక్కు కావ్యములు తెనుగున ఉత్పన్నమగుచుండెడివి. సంస్కృత కావ్యపురాణాదుల నన్నింటిని ఏరి కవులు తెనుగు భారతికి అమూల్య కావ్యరత్నాలంకార భూషణములుగా తొడవిరి. ఈ ఆంధ్రీకరణకృషి ఈ ఇరువదవ శతాబ్ది వరకు జరుగుచునే యున్నది. ఈ విధముగా సంస్కృత పుష్పగుచ్ఛ సువాసనా సొబగులు తెలుగు మాగాణములందు వ్యాపించి, తెనుగువారినందరిని పారవశ్యమున ముంచెత్తినవి. ఇట్లు మహత్తర కృషిగావించిన మహనీయులు పెక్కురున్నారు. అందులో అనంతపురమండలమున ఆంధ్రపండితులుగా వాసికెక్కిన శ్రీ రూపావతారం నారాయణశర్మగారొకరు. వీరభినవ నీలకంఠదీక్షిత బిరుదాంకితులు. 17వ శతాబ్దపు సంస్కృతకవి శ్రీ నీలకంఠదీక్షితుల కృతులనమవదించిన ఖ్యాతి వీరికి దక్కినది.

దీక్షితులవారి కలివిడంబనము, సభారంజన, వైరాగ్యశతకములను శర్మగారు 'సుభాషితత్రిశతి' యనుపేర అనువదించి ముద్రించిరి. ఇందు లనీతులు వివిధ శీర్షికలలో, సర్వజనులకు విదితమగునట్లు తేటతెనుగున రచించిరి. వక్రోక్తి, సునిసిత హాస్యము, సరస చమత్కృతి, మందలింపు ఈ

పద్యములందు మనకు పూర్తిగా గోచరించగలవు. కలివిడంబనమున 'కుటుంబ' మను శీర్షికలోని ఒక చిన్నపద్యము చూతము.

నాతి తనవారి మితముగా నాజ్యముగల
భోజనము సేయుదురటంచు బొగడుచుండు
చోరు లనియును భోజన వీరులనియు
మగని చుట్టాల వేవేళదెగడు చుండు.

ఇది స్త్రీలకుగల సహజ గుణములే కదా! కలికాలమునందు పూజ్యులకుగల విలువ ఎట్టిదో యిట్లు చెప్పిరి.

రూక యొకటి పండితునకు
రూకలు పదికవికి, నూరురూకలు నటికిన్
రూకలునువేయి దంభికి
పోకయపో కాన్కు వేదపూజ్యునకు కలిలా

ఈ త్రిశతి యందలి పద్యములన్నియు కంద, తేట, ఆటవెలదులలో సాగినవి ఇట్టి నీతిప్రబోధక శతకములు తెలుగునందునూ లేకపోలేదు. చెప్పెడి తీరు, భావములలో మాత్రమే వైవిధ్యము గోచరించు చుండును.

వీరి తదుపరి ఉద్గ్రంథము 'నీలకంఠ విజయము'. నీలకంఠదీక్షితుల సంస్కృత గ్రంథమునకిది అనువాదము. ఇందు పంచమాశ్వాసములు కలవు. ప్రబంధ తీరులో, అతిసరళముగా సాగిన పద్యగ్రంథమిది. పేరున కనువాదమేకాని తరచి చూచిన స్వతంత్రకావ్యమున కేమాత్రము తీసిపోదు. తెనుగు వాఙ్మయమున జరిగిన యాంధ్రీకరణ పద్ధతిలో శ్రీనాథుని నైషధాంధ్రీకరణ పద్ధతినే కవిగారనుసరించిరి. ఒక్కొక్క శ్లోకమును నొక్కొక్క పద్యముగా మలచుటయేకాక అటనట వచనమునందలి భావములనుకూడ పద్యములలో నిమిడ్చిరి. నీలకంఠ విజయమున హరుడు నీలకంఠుడై హాలాహల

భక్షణము గావించి విజయము పొందుట యిందలి ప్రధాన విషయము. పరమశివుడు హాలాహల భక్షణము గావించిన విధమును కవిగారిట్లు వర్ణించిరి.

హాలాహల విషమియ్యది
నే లోగొనుచుంటి నింకనేచదు, మిమ్ము, నిం
కేలా భయ? మంచు హరుడు
గ్రోలెన్ విషమున్ దయాపరీతుండగుచున్

మాధవుడు వెన్నుని వలె, మ
మాధవుండా విషము గ్రోలి మెచ్చుచు భయమున్
బోధించుచు ధైర్యమ్మును
సాధించె జగములందు శాంతి సుఖంబుల్.

వీరి 'శాంతివిలాసము' కూడ నీలకంఠ దీక్షితుల కృతికనువాదమే. పనిగట్టుకొని నీలకంఠదీక్షితుల కృతుల నాంధ్రీకరించుట ఒక పెద్ద కృషియే. స్వతంత్రముగా కావ్యములల్లు సమర్థతగల నారాయణశర్మగారు అనువాద క్రియతోనే తమసాహిత్య కృషిని చాలించక, స్వతంత్రకావ్యము వ్రాయని లోటును భర్తి చేసిరి. వీరు వ్యాసభారతాంతర్గత కథా వస్తువగు కచదేవయానులను గూర్చి ఒక స్వతంత్ర పద్యకావ్యమును 'దేవయాని' యనుపేర రచించి ముద్రించిరి. కవి తనకుగల స్వతంత్ర భావములను చెప్పుటకీకావ్యము వేదికైనది. అటనట కావ్య ధర్మానుగుణముగా కథలో కొన్ని మార్పులు చేయుట జరిగినది. కవిగారు ఈ కావ్యమునందలి ప్రతి అంశమును వ్యాసభారతము నాధారము చేసుకొనియే చిత్రీకరించిరి. ఇందు కచ, దేవయానుల సహ విద్యాభ్యాసము, కచుడు దేవయానికి నాట్యమును నేర్పుట క్రొత్తగా చొప్పింపబడినవి ఇందలి కథ కొందరి నాకర్షించిన, మరికొందరిని భాషా లాలిత్యము, రసాలంకారము, భావ గంభీర్యము లాకర్షించగలవు. దేవేంద్రుడు కచుని సంజీవనీవిద్య నేర్వబంపుచు చెప్పిన మాటలు చూతము.

"కలదా మౌనికి దేవయానియనగా కన్యాలలామంబు తా
నల ముల్లోకములందు సర్వహృదయాహ్లాదమ్ము గల్గంగ తా
వలమౌ నిత్యవినూత్న భవ్యతమ లావణ్యాద్భుతౌజస్సుచే
వలపించున్గవి శిష్యులన్ గనము తద్వాల్లభ్య లబ్ధార్థులన్.

శ్రీ రూపావతారం నారాయణశర్మగారికి ఆంధ్రగీర్వాణభాష లందే కాక, ఆంగ్ల కన్నడ భాషలందుకూడ పాండిత్యమున్నది. బాల్యము నుండియు వీరు కన్నడము నభ్యసించినప్పటికి వీరికి తెలుగే కన్నతల్లి. మాధ్యమిక విద్యాభ్యాసానంతరము శర్మగారు కర్నూలులోని ఇంద్రకంటి శేషావధానుల పాఠశాలలో, శ్రీ వెల్లాల శంకరశాస్త్రిగారివద్ద పంచకావ్యములు, నాటకాలంకార శాస్త్రములను, వ్యాకరణ సిద్ధాంత కౌముది నభ్యసించిరి. 1944లో విద్వాన్ పరీక్షలో వుత్తీర్ణులై అనంతపురము జిల్లాలో తెలుగు, సంస్కృత పండితులుగా పనిచేసి, 1969 లో ఉద్యోగవిరమణ గావించిరి. వీరి రచనల నన్నింటినీ ప్రోత్సహించి, వీరికి సాహిత్య జీవితమున స్థిరత నేర్పరచిన మహనీయులు పద్మశ్రీ కల్లూరు సుబ్బారావుగారు. తదుపరి 'దేవయాని' కావ్యమునకు శ్రీ తూముకుంట భీమసేనరావుగారిని కృతి భర్తగాచేసి వారితోగల సాహితీ బాంధవ్యమును మరింత యినుమడింపజేసు కొనిరి. వీరిరువురు పెక్కుసాహిత్య సభలను నిర్వహించి అనంతపుర మండలమున పేరుపొందిరి. ఈ జిల్లాలోని మడకశిరా తాలూకా వంటి మారుమూల ప్రాంతములందు వీరికృషిచే సాహిత్య సౌరభ మింత ప్రసరింప గల్గినది. ఇట్టి సరసకవి రత్నమునకా నీలకంఠుడు ఆయురారోగ్య భాగ్యము లిచ్చుగాత !



# శ్రీ నాగసముద్రం వాసుదేవరావు



జననము:— 1895

నిర్యాణము:— 22—9—1979

జన్మస్థలము:- నాగసముద్రము ధర్మవరం తా॥ అనంతపురం జిల్లా

తల్లి:—శ్రీమతి పిళ్లమ్మ

తండ్రి-శ్రీకరణం నారాయణరావు

మతము, కులము:— హిందూ బ్రాహ్మణ - స్మార్త.

శ్రీ నాగసముద్రం వాసుదేవరావుగారు అనంతపురము జిల్లాలో పేరు గాంచిన ఉపాధ్యాయులు, రచయితలు వీరికి చిన్ననాటి నుండియు సాహిత్యాభిలాష మెండు. ఆంధ్రాంగ్ల సాహిత్యములను చక్కగా అధ్యయనము చేసిన వారు. రాజమహేంద్రవరములో ఉపాధ్యాయ శిక్షణ పొందుకాలము (1915 వ సం॥) లోనే, వీరు 'కుసుమాంగి' యను నవలను ప్రకటించిరి. ఈ తొలి నవలారచన ద్వారా శ్రీ వాసుదేవరావుగారు సాహితీ లోకమునకు పరిచయమైరి. తదుపరి వీరు 'మనోహరవిజయ' మను పేర మరియొక నవల వ్రాసిరి. ఇది ఆంగ్లములోని 'Adventures of Ulysses' అను గ్రంథమునకు చక్కని ఆంధ్రానుసరణము. ప్రసిద్ధ సాహితీవేత్తలు విద్వాన్ శ్రీ శిరిపి ఆంజనేయులుగారు, తమ విజ్ఞాన వల్లికా గ్రంథమాలలో వాసుదేవ రావుగారి నవల 'విచిత్ర వివాహము' ను ప్రచురించిరి. నేడీ గ్రంథము లేవియు లభ్యము కాకపోవుట మన దురదృష్టము.

శ్రీ వాసుదేవరావుగారు ఉపాధ్యాయ వృత్తిని చేబట్టిన వారగుటచే విద్యార్థుల కనువగు జిల్లా చరిత్రను — భూగోళమును-చారిత్రాత్మక కథలను వ్రాయవలెననెడి తలంపుకల్గి 'అనంతపుర మండల చరిత్రకథలు' 'అనంత పురం జిల్లా భూగోళము' అను గ్రంథములు వ్రాసిరి. డా॥ చిలుకూరి నారా

యణరావుగారి 'మునలమ్మ' కావ్యావతరణకు ఈచరిత్రయందలి 'మునలమ్మ మరణము' అను కథ ఆధారమైనది.

ఈ కవిగారు వచన రచనలేకాక కొంతకవిత్వమును కూడ వ్రాసిరి. వీరు 'The Blind Boy' అను ఆంగ్లపద్యమును తెనుగులోని కనుసరణ గావించిరి. వారి పద్యరచన యిట్లున్నది.

తే॥గీ॥ ఎపుడు నిదురించు చుండిన నపుడె రాత్రి
పాటు పడియెడు సమయమే పగలునాకు
నిదుర పోకయె నేనుండ నేర్తునేని
అంతమే లేని పగలు నా కమరియుండు.
చింత లేవియు లేన్నట్టి స్వాంతమందు
క్రొత్త కోర్కుల నమకూర్చు కొనగ నేల ?
పొందజాలని దానికై పొక్కు లేల ?
గ్రుడ్డి బాలుడ ననుచునే కుందనేల ?
గాన మీరీతి చేయుచు కడుముదమున
పొద్దు పుచ్చుచు మనుటయే పొసగెనేని
సార్వభౌమునితో నేను సాటివగుదు.

(1916 ఆంధ్రపత్రిక వార్షిక సంచిక నుండి)

శ్రీ వాసుదేవరావుగారు అప్పుడప్పుడు వ్రాసిపెట్టిన చాటుపద్యము లనేకములు. అవి వారి నిత్యజీవిత సత్యములు; అనుభవైకవేద్యములు. రాయలసీమలో అనంతపురము జిల్లా కఱవు కాటకములకు నిలయము. త్రాగు నీటికికూడ కటకటలే. కల్యాణదుర్గమున ప్రజలు నీటికొరకై పడిన యవస్థను చూచి వారొక చాటుపద్యమును వ్రాసిరి.

అన్లే రాజమంద్రిలో శిక్షణ పొందుచున్నప్పుడు పడిన అగచాట్లను వారిట్లు ఏకరువు పెట్టిరి.

సీ॥ కడుపు నండాకలి కాదంచు కొన్నాళ్లు
కొత్త నీరనుచును కొన్నినాళ్లు
చర్మవ్యాధుల చేత చచ్చుట కొన్నాళ్లు
చన్నీళ్ళ స్నానంబు కొన్నినాళ్లు
విడువని భేదిచే విసుగుట కొన్నాళ్లు
కొవిన మందులు త్రాగి కొన్నినాళ్ళు
మితిలేని వానచే మిడుకుట కొన్నాళ్ళు
కొంపలో చెదలచే కొన్నినాళ్ళు

గీ॥ ఇటుల బాధలు పొందితి మింతెకాని
సుఖము చెందితి మనుమాట సున్న యకట
ప్రాణముండగ మావూరు బడితిమేని
రాణ్మహేంద్రిమ : యికమేము రాము రాము.

వీరిట్లు వచనరచనతో బాటు పద్యములను గూడ వ్రాసి గృహలక్ష్మి భారతి, మున్నగు పత్రికలకు పంపిరి. పత్రికలు వాటిని ఆదరించినవి.

శ్రీ వాసుదేవరావుగారి పుణ్యమున అనంతపురం జిల్లా చారిత్రాత్మక సంఘటనలు దేశవ్యాప్తమై బాల్యదశలోనే బాలుర మనోఫలకములపై ప్రతిష్ఠింపబడి ఎప్పటికివి మరువని విధముగా శాశ్వత యశస్సు నందుకొన్నవి. శ్రీ వాసుదేవరావుగారి రచనలలో ఈ వాచకములే మన కటనట కనిపించుచున్నవి వీరి అమూల్య నవలలు సేకరించి మనసాహిత్య చందనపేటికలో భద్రపరచుకొనుట ఎంతేని అవసరము వీరి కుమారులలో జ్యేష్ఠులైన శ్రీ ఎన్. సేతూరామారావుగారు ఈ కార్యమును చేసి ధన్యులగుదురు గాత.

మహాకవి

# తక్కెళ్లపల్లి పాపాసాహేబు

జననము — 1928

తల్లి:—శ్రీమతి ఫకుర్బి తండ్రి —శ్రీ ఫకరుద్దీన్‌సాబ్

జన్మస్థలము:- అప్పెచెర్ల - గుత్తి తాలూకా - అనంతపురం జిల్లా

మతము, కులము:— ఇస్లాం - ముస్లిము.

ముస్లిముగా పుట్టి 'ఇస్లాం' మతము నాదరించుచు, పరమతసహనముతో బాటు, పరమత దైవమును కీర్తించి "కులముతోనీకు బనియేమి? గుణము నగ్నిలో బరీక్షించి నిత్యనిరూఢి గనుము"అని ధీమాగా చెప్పుకొన్న యువక ముస్లిముకవి, మన పాపాసాహేబు. శ్రీ జోస్యము జనార్దనశాస్త్రి గారన్నట్లు 'పాండిత్య కవిత్వములకు జాతిమత విచక్షణ పనికిరాదు. పాపాసాహేబు మహమ్మదీయుడని పేరువలన తెలిసి కొనవలసినదేకాని, ఆతని భావములందును, భాషా సంస్కృతియందును, కవితా శైలియందును, చిక్కని తెనుగుదనము, చక్కని భారతీయ సంప్రదాయము జాలువాఱు చుండును. ఈ కవి స్వతంత్రి భావములుకలవాడు. ఇతరు లేమనుకొందురో యను జంకుకొంకులు లేక తన మనోవీధిని స్ఫురించు భావములను వెలువరించు సాహసి'—శాస్త్రిగారి మాటలు అక్షరాల సత్యములే. శ్రీపాపాసాహేబ్ గారి రచనలను పరీక్షించిన వారి స్వభావ స్వరూపములు ప్రత్యక్షముగా కాన్పించును.

శ్రీ పాపాసాహేబుగారు బాల్యమునందే కవితల్లుట నేర్చిరి. స్వయంకృషితో సంస్కృతాంధ్రములలో పరిచయము. ప్రవేశము సంపాదించు కొనిరి. యువతరమున కవిగారు రాజకీయముల లోనికి ప్రవేశించి జీవితమంతయు విశ్వశాంతిదూత పూజ్యబాపూజీ హృదయ ప్రతిబింబమైన, పవిత్ర కాంగ్రెస్సు సంస్థకు అంకితమై దానిద్వారా మాతృదేశమునకు, మాతృ భాషకు ఉడుతకుడుతా భక్తిగా శక్తికొలది సేవచేసిరి. అప్పటిలో కవిగారింట నిరంతరము 'ఇనుపగజ్జెల తల్లి' స్థిరనివాసము చేసికొన్నది. అయినను జంకక కొంకక, చెక్కుచెదరని భక్తివిశ్వాసములతో మొక్కవోని ఆత్మ

విశ్వాసముతో మాతృదేశమునకు సేవచేసిరి. తుదకు వీరికి రాజకీయములలో లభించినది, విరాళా విస్పృహాలే. 1964 వ సం॥ నాటికి ప్రభుత్వము వీరిని గుర్తించి గౌరవించుట ఒక ఎన్నదగిన విషయము.

శ్రీ పాపాసాహేబు గారి మత్సాహపరచినది, భావోద్రేకమున ముంచెత్తినది. ఆనందపరచినది కవిత్వమేకాని వేరుకాదు. వీరు అవధి, శకుంతల రాణీసంయుక్త ప్రేమవిలాసము, అంబ,సత్యాన్వేషణ, రసఖండముమొదలగు గ్రంథములు వెలువరించిరి. రాణీసంయుక్త ఒక వీరోచిత కావ్యము. వీరి పద్యములందు సుదీర్ఘ సమాసములు విరివిగా కానవగును. అటనట కవి, తన మనోభావములనే పాత్రలచేత వెల్లడింపజేసిరి. ఈ క్రిందిపద్యము చూడుడు.

సీ॥ కుటిల నీతిఖ్యాతి - కుంఠీ కృతోద్ధత
కౌటిల్య శేముషీ - పాటవుండు;
వరరాజకీయ సర్వస్వ సాగరయుగం
ధర సమ గురుకార్య కరణచణుడు;
గర్వత పరిపంథి - గణహృదయగ్రంథి
విఘటన చటులోగ్ర - విక్రముండు;
అగ్రహానుగ్రహాద్యధికృత వ్యవహార
విరహిత మానస విక్రియుండు;

గీ॥ పూర్ణి మాబ్జ సన్నిభ - సముదీర్ణకీర్తి,
అచ్యుతాంఘ్రి సేవాతత్పరామవర్తి,
ధూత సంశ్రిత జనసంచ యాతతార్తి,
దివ్యమూర్తి విస్ఫూర్తి పృథ్వీ విభుండు.

తదుపరి వీరికావ్యము 'అంబ'. ఇది అంద రెరిగిన భారత కథ. అంబ - భీష్ములిందు ముఖ్యపాత్రధారులు. అంబ ప్రతిజ్ఞపూనిన ఆడుది.

ఆమె యెంతటి ఉద్రేకము కలదో అంతకుమించిన భావోద్రేకము కలవాడు మనకవి. కవి తనకున్న నూతనావేశముతో ఇందలి పాత్రల స్వరూప స్వభావములలో క్రొత్తదనమును వింపిరి. కాని యది అందరికీ రుచించునని చెప్పలేము. ఈ కావ్యముపై శ్రీ గడియారం వేంకటశేషశాస్త్రి గారిట్లు తమ అభిప్రాయమును తెల్పిరి.

'కవిగారీ పొత్తమున అంబ నాదర్శ యువతిగా ఉజ్జ్వలముగా చిత్రింప జూచిన యభిమానము గనంబడుచున్నది. ఇది మంచిదేకాని ఈయావేశములో భీష్ము డధికార దుర్విదగ్ధుడుగా రూపొందినాడు. కవిగారి యుద్దేశమేమైనను ఆంధ్రభారత పరిచిత భీష్ముని పోలిక లిందు చెదరిపోయినవి. పురాణకథా ప్రసిద్ధ మహాపురుషుల జీవితస్వభావముల నందించుటలో కవి మిగుల జాగరూకత వహించుట అత్యావశ్యకము. ఈ అంబకావ్యము శ్రీవేంకటేశ్వరుని స్మరణతో ప్రారంభించుట కవిగారి పరమత దైవారాధన యెడగల విశ్వాసమునకొక ప్రతీక. ఈ పొత్తమును ఆంధ్రవిశ్వవిద్యాలయమువారు 'భాషా ప్రవీణ' పరీక్షకు పాఠ్యగ్రంథముగా నుంచుట ఎన్నదగిన విషయము.'

తదుపరి వీరి 'శకుంతల' కావ్యకథ పాఠకులకు సుపరిచితమైనదే. 'సత్యాన్వేషణము' కష్టజీవుల కన్నీటిగాధను తెల్పు రసమయ సాంఘిక యితివృత్తముతోకూడిన కావ్యము. ఇందు జాతీయములు సామెతలు లోకోక్తులు సంస్కృత న్యాయములు విరివిగావాడిరి. ఇందలి ఒకపద్యము చూడుడు.

ఉ॥ ప్రాణము పోవుచున్న దలవంచని పౌరుషసాహసాలు, వా
గ్దానమొసంగి తప్పని యుదార గభీరగుణమ్ము, లొంగుచే
గానని యాత్మగౌరవము, కంపముచెందని గట్టి చేవయున్
మానవరాయణత్వ మసమాన మఖండము నై విరాజిలుఁగా.

కవిగారు పై గుణగణములనే కలిగి యున్నారనుటలో సందేహములేదు. ఇట్టి ఈ మహాకవి గారికి భగవంతుడెట్టిలోటును కలిగించక ఆయురారోగ్య ఐశ్వర్యముల నిచ్చి కాపాడుగాత!



మహాకవి

శ్రీ

గుంటి సుబ్రహ్మణ్యశర్మ

జననము:— 1—11—1905

తల్లి:—శ్రీమతి జానకమ్మ

తండ్రి:—శ్రీ గుంటి భాస్కరప్ప

జన్మస్థలము - కల్యాణదుర్గం

అనంతపురం జిల్లా

మతము, కులము -హిందూ బ్రాహ్మణ

పెన్నేటిగట్టున పుట్టిన 'శ్రీకవిత్వవేది' పసుపు కలమునుండి వెలువడిన ఉద్గ్రంథము 'అశోకసామ్రాట్', ఆ సామ్రాట్ మనస్సున కూరట కల్గించిన శాంతిమూర్తి బౌద్ధమతస్థాపకుడు, విశ్వజ్యోతిగావెల్గిన బుద్ధదేవుని జీవిత చరిత్ర నొక ఉద్గ్రంథ రాజముగా మలచిన కవిశేఖరుడు శ్రీ గుంటి సుబ్రహ్మణ్యశర్మ. వీరిరువురు అనంతపురం జిల్లా సాహిత్య చరిత్రలో ఎన్నదగిన చారిత్రాత్మక కావ్యనిర్మాతలే. శ్రీ గుంటివారి 'విశ్వజ్యోతి' కావ్యము సుమారు రెండువేల పద్యములు కల్గి, ఐదాశ్వాసములుగా ప్రబంధ శైలిలో తేనెలూరు తేటతెనుగునుడికారముతో వెలువడి, జిల్లా సాహిత్య చరిత్రలో ఒక విశిష్ట స్థానము నందుకొన్నది.

శ్రీ సుబ్రహ్మణ్యశర్మగారు శతాధిక గ్రంథకర్తలు. పద్యరచనలోనే కాదు; వచనరచనలో కూడ వీరు సిద్ధహస్తులు. సంస్కృతాంధ్ర, ఆంగ్ల భాషలందు విద్యావంతులు. సంస్కృతమును గురుముఖముగా కాకుండ కేవలము స్వయంకృషితో వీరునేర్చిరి. క్రొత్తగా అపరాధ పరిశోధక నవలలు వెలువడుచున్న ఆనాటికాలములో వీరు'భూతగృహము' 'రహస్యశోధన' అనబడు నవలలు వ్రాసి పేరుదెచ్చుకొనిరి. 'భూతగృహము' నవలకు ఆంధ్ర ప్రచారణీ గ్రంథమాల కాకినాడ వారు మెచ్చి అకాలమున రూ॥ 116/— పారితోషక మిచ్చిరి. క్రమేపి నవలారచనతో ప్రారంభించిన వీరి కలము 18 నవలలు, 18 బాలసాహిత్యపు కథల పుస్తకములు 18 ప్రబంధ

నవన కావ్యములు 20 వరకు దేశనాయకుల జీవితగాథలు, 8 పద్యకావ్యములు 8. ఇతర గ్రంథములను వ్రాయగలిగి, జిల్లాలో పేరును, మెప్పును పొంది నది. వీరి 'మాధవాశ్రమము' నవల, రెండు భాగములుగా హిందూపురం శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాల ద్వారా వెలువడినది. ఇందెన్నియో, సాంఘిక సమస్యలు పరిష్కరింపబడినవి. ఈ నవల భారతి, గృహలక్ష్మి మున్నగు పత్రికల ప్రశంసల నందుకొన్నది.

శ్రీ శర్మగారి కవితాధార శుద్ధికలది. సంస్కృతాంధ్ర భాషాసమ్మేళన మైనది. వీరి పదములకూర్పు, పద్యముల నడక, భావముల పొందిక మెచ్చదగినది. బహుగ్రంథ పరిచయము గలవారగుటచే 'బుద్ధచరిత్ర' కొక చక్కని రూపము నిచ్చి, అతనిని విశ్వజ్యోతి స్వరూపునిగా నిరూ పించిరి.

సిద్ధార్థుని మనసునకు జీవితము నిస్సారమని తెలిసినది. అతడొకవింత ప్రవృత్తిలో పడి కొట్టుమిట్టాడు చున్నాడు. ఆతని అంతర్వాణి అతనిని ప్రబోధించినది. ఒకనాడు సిద్ధార్థుడు నిద్రమండి మేల్గాంచి భార్యనుద్దేశించి యిట్లన చున్నాడు.

ఉ॥ ఎన్నఁటికైన నమ్మ నిను నేర్పడఁజేయును మిత్తి; సంపదల్
మిన్నలుకావు; నేను మిడిమేలపు జీవితమొంది భూమిపై
గ్రన్నన బుద్బుదంబె, బలకాయ సముత్థిత శక్తి వెల్గ, నా
పన్నుల సేవఁజేతు; విడిపోడియ; మద్భవసార మిద్దరన్

ఆ॥ ఏమిసేతు నకట! ఎనలేని నీరూప
కాంతి, రెంట దీన కష్టజనుల
యోజ, చేరి మనసు మట్టాత లాగించు
సుదతి! విన్ను విడుతు సుకృతమెంచి

కం॥ తనయుడనై నీ యొడిలో
దనరారుచు నుందు నింక తలఁకక, నాపై
మనసుంచక, యేలోటును
గనుపించక సుతునితోడ గడుపుము దినముల్

ఇట్టి రసవత్తర ఘట్టములిందు పెక్కులున్నవి. మధురాహారము నందేభాగము మధురముగా నుండదు? రసగుళికల వంటి పద్యములిందు అసంఖ్యాకములు. గ్రంథమును చదివి రసాస్వాదన గావించుటయే సాహితీ రసికులు చేయవలసిన ముఖ్యపని 'విశ్వప్రేమ' యనుపేర శ్రీ బసవేశ్వరుని జీవితమునందలి అంతిమ ఘట్టము నొకచిన్న పద్యసంపుటిగా రచించిరి. అందలి బోధన లిట్లున్నవి.

మ॥ మృత్యుముఖమున దరిజేరి మేదినీశు
లొక్కటౌదురు, భువిలోన నుక్కిపిదప
నెవర లేమౌదురో దేవు డెఱుగు? నకట!
మురిసి పోదురు మూన్నాళ్ళ ముచ్చటలకు

ఈ కవిగారు అనంతపుర మండలమున అనేక స్కూళ్ళయందు పెక్కం డరీగ్రేడు ఉపాధ్యాయులుగా పనిజేయుచు ఇంటర్మీడియట్, బి.కాం., పరీక్షలు ప్రైవేటుగా చదివి ఉత్తీర్ణులైరి. తొలుతనుండియు వీరు ఆధ్యాత్మిక విచారమును కలిగి స్వప్రయోజనములందు నిస్పృహగలవారై ఉన్నంతలో జీవితమును సాగించు శాంతమూర్తులు. అనంతపురం రాయల కళాగోష్ఠివారు వీరి 'విశ్వజ్యోతి' కావ్యము నావిష్కరించి, శ్రీ గడియారం వేంకటశాస్త్రుల వారి సమక్షమున 'మహాకవి' యను బిరుదమును ప్రసాదించిరి. వీరి మరొక అముద్రిత ఉద్గ్రంథము 'శ్రీ రామకృష్ణ భాగవతము'—5000 పద్యములు గలది. త్వరలో వెలువడుటకు రాయలసీమలోని దాతలు చేయూత నిత్తురుగాక! ఒక గ్రంథము వ్రాయుట కెంత కష్టమున్నదో దానిని వెలుగునకు దెచ్చుటకు

పదింతలు కష్టమున్నదనియు, అమ్మడు పోవుటకు నూరింతలు తొందరయున్న దనియు కవులకే కాదు ఎల్లరకూ విదితమైన విషయమే, అట్లని కవులు వ్రాయకుందురా ?

నైజ గతమైన శక్తిచే వడ్డుదెలిపి
వ్రాయ కుండగ నుండ మా వశముగాదు
వ్రాసి ముద్రింపలేని యీ వ్రాతలెల్ల
శిథిలమౌగాదె మరుభూమి శిల్పమట్లు.

అని శ్రీ గుంటిసుబ్రహ్మణ్యశర్మగారు వాపోవుటలో అసత్యములేదు. ఆ కావ్యశిల్పములు శిథిలమగుట మన సంస్కృతికే లోటు. అందుకు మనము కారకులము కారాదు. దీనినెల్లరూ ఎఱిగి దివ్యనిర్మాణకృషికి భూరి దాతృత్వ గుణముకల్గి సజ్జను లుందురుగాత. భగవంతుడు సదా మహాకావ్య నిర్మాతలకు ఆయురారోగ్య భాగ్యములు ప్రసాదించుగాత !



శ్రీ జక్కా-
వెంకటరమణప్ప
జననము: 25-12-1936
తల్లి శ్రీమతి జక్కా-అక్కమ్మ
తండ్రి: శ్రీ జక్కా-
పెద్ద నారాయణప్ప
జన్మస్థలము ధర్మవరము
జిల్లా: అనంతపురం

ఆంధ్రరాష్ట్రమున సుప్రసిద్ధ జ్యోతిష్మార్తాండులుగా వాసికెక్కిన శ్రీమాన్ రాళ్లపల్లి గోపాల కృష్ణమాచార్యుల వారికెందరో ఏకలవ్య శిష్యులు

కలరు. శ్రీ ఆచార్యులవారి జ్యోతిశ్శాస్త్ర ప్రావీణ్యతను గూర్చి వేరుగా చెప్పపనిలేదు. అట్టివారిని గురువుగా భావించి జ్యోతిశ్శాస్త్రమున ప్రాచ్య, పాశ్చాత్య పద్ధతులలో అభ్యసించి గత ఐదారువర్షముల నుండి ప్రతిసంవత్సరము పన్నెండు రాశుల ఫలములు వ్రాసి, అచ్చువేయించి ఆంధ్రదేశమునకే కాదు, కర్ణాటక ప్రాంతమునకు కూడ అందించు ఘనతను శ్రీ జక్కా వేంకటరమణప్పగారు దక్కించుకొనిరి.

ధర్మవరమునందలి ఉన్నతపాఠశాలలో ఉన్నతవిద్యను ముగించి, అనంతపురం కళాశాలలో బి. ఏ, పట్టమును ప్రథమశ్రేణిలో ఉత్తీర్ణులై, 1961లో, ఆంధ్ర యూనివర్శిటీ నుండి యం. ఏ., పట్టమును, అనంతపురం పోస్టుగ్రాజుయేట్ సెంటర్ నుండి 'మహాభారతము—మహిళ' అను విషయముపై ఒకసిద్ధాంత గ్రంథమును తయారుచేసి, యం. ఫిల్ ను పొందిరి.

వీరి 'మహాభారతము — మహిళ'లో ఐదు ప్రధాన స్త్రీ పాత్రలు కలవు. అవి కుంతి, మాద్రి, ద్రౌపది, గాంధారి, సుదేష్ణలు. 'తినిన గారెలు తినవలె, వినిన మహాభారతము వినవలె' నన్నసామెత కొద్ది మహాభారతమును కథగా చదువవచ్చును, వినవచ్చునేగాని, అందలి పాత్రల స్వభావములను గూర్చి విశితముగా నాలోచించి నప్పుడెన్నియో సందిగ్ధ విషయములు, చదువరి మనసున పొడచూపగలవు. అందునను అబలల మనసు తెలియుట అతి కష్టముతో కూడినపని. 'ఇంతి మనసు తెలియ—నీశ్వరుని తరమె?' యన్న నానుడి యెల్లరెఱిగినదేయైనను, ఆ పూబంతుల మనసులెరిగిన వాడొక్కడులేడు. 'రవిగాంచనిచో కవిగాంచు నెయ్యెడన్' అను నార్యోక్తికూడ ఈ విషయమున దూరమే కావచ్చును. అటువంటిది శ్రీ జక్కా వేంకటరమణప్పగారు తమ మనసును మహాభారత మహిళలపై నిమగ్నముచేసి ఆ పాత్రల మంచి చెడుగుల నెత్తిచూపుట సాహసముతోకూడిన విషయము. వీరెక్కువగా ఆంధ్ర మహాభారతకర్తల కథాసంఘటనలలో ఆయాపాత్రలు కన్పించుతీరును బట్టియే వారిపై శిష్ట్యమును పేర్కొనిరి. అటనట సంస్కృత కర్తల యుద్దేశ్యములను కూడ తడివిరి.

మహాభారతకథలో ఐదుగురు పుత్రుల తల్లులు కుంతి, మాద్రి. వీరితో బాటు ఐదుగురు భర్తల సతి, శతసుతమాత. కీచకాది శతాధిక సోదరులుగల సోదరి, ముఖ్యమగు మహిళలు. ఇవన్నియు కీలకపాత్రలే. వీరిని విడిచిన కథలేదు; కథను విడిచి వీరులేరు. వీరందరి గుణవిశేషములు చెప్పుటకెంత కథ అవసరమో అంతేకథను శ్రీ జక్కావారు నుడివిరి. తొలుత స్త్రీ వైశిష్ట్యమును గూర్చి విపులీకరించి, తదుపరి మహాభారతమును కవిత్రియమును గూర్చి వ్రాసిరి. కవిత్రియ కవులు భగవత్ప్రార్థనలలో స్త్రీమూర్తుల కిచ్చిన మహోన్నత స్థానమును గూర్చి చర్చించిరి.

ద్రౌపది ఐదుగురు భర్తలకు భార్య-ఆమె మయసభలో దుర్యోధనుని చూచి నవ్వినది, మున్నగు విషయములందు పాఠకులకు వచ్చు కొన్ని సందేహములను నివృత్తిచేసి ఆ పాత్రయొక్క ఆంతరంగిక విషయములను మన ముందుంచిరి. 'ద్రౌపదినవ్వు'ను గూర్చి వ్రాయుచు 'ద్రౌపది రాగాది వికారములులేని రాతిబొమ్మకాదు. కావున మానవ సహజమైన వికార మా సన్నివేశమున ఆమెను పొందినది. ఇది అపరాధము మాత్రము కాదు' అని అభివ్యక్తముచేసిరి. ద్రౌపది 'పరమవివేకురాలు' అనుటకు సభలో ఆమె వేసిన ముఖ్యమైన ప్రశ్నకు జవాబు మొత్తము భారతమున లేదు. తుదకు భీష్ముడు కూడ ఆ సందేహము తీర్చలేదు. ఆమెకది యే విధముగ నుపకారము కాక పోయినను, మహాసామ్రాజ్య మేలదగిన రాజనీతి 'ద్రౌపదిసొమ్ము' అని నిరూపించుకొన్నది 'విరాటపర్వ కథా చక్రమునకు ద్రౌపది కేంద్రబిందువు' (ద్రౌపది సౌశీల్యమునకు విరాటపర్వమొక అగ్నిపరీక్ష) ఆమెను కీచకుడు సభకీడ్చినప్పుడును, ఉప కీచకు లామెను ముట్టడించినప్పుడును, ఆమె 'అజ్ఞాతవాస నిబంధన' మల్లంఘించలేదు. ఇట్టి సందిగ్ధ విరాటపర్వఘట్టమున ద్రౌపది, సుదేష్ణల గుణగణములను, ఆంతర్యములను చక్కగా విడమఱచి శ్రీ జక్కావారు విపులీకరించిరి.

గాంధారి తెలిసితెలిసి తననూర్గురు సుతులను పోగొట్టుకొన్నది. ఆ ఏడ్పు ఒకపర్వమైనది. ఈ విషయముగా ఆమె భర్తయెదుట భవిష్య

త్తను గూర్చి ఆలోచించినది. ఇందు తనభర్త కపట నాటకము కూడ దాగి యున్నదని ఆమె గ్రహించినది. ఆమెభర్త నీ విషయముగా ప్రశ్నించినది. ఆ మాటలలో ఆమె సమరసభావము ధార్మిక ప్రవృత్తి, అధర్మవర్తులపై ఏహ్యభావము కనబడుచున్నది' అని జక్కావారు విడమరచి తెల్పిరి. ఆమె పుత్రశోకము పాండవులనే దహించెడిది. కాని ఆమెధర్మముగ, తనకొడుకుల ప్రవర్తనము,తనతోబుట్టువు శకుని వడవడిని నిందించినదేకాని, అధర్మమునకు పాల్పడలేదు. ఇది ఆమె 'పతివ్రతాప్రభావ జనిత మనోబలము'నకు నిదర్శనముగా జక్కావారు నిరూపించిరి,

ఇట్టి ఉదాత్తపాత్రల సౌశీల్య మనోభావ ప్రవర్తనలు వివరముగా చదువు పాఠకులకు కొన్నిసందేహములు పొడచూపక మానవు. అట్టిసందేహములు కొన్నిచోట్ల నివృత్తికాగలవు. మరికొన్నిచోట్ల తటస్థముగా నుండగలవు. తెనుగు మహాభారత గ్రంథములో కవిత్రయము చిత్రించిన ఘట్టములందలి స్త్రీ పాత్రల ప్రవృత్తిని విపులముగా వివరించుటలో వీరుచేసిన కృషి గొప్పది. శ్రీ వేంకట రమణప్పగారు ఈ గ్రంథమును శ్రీ శలాక రఘునాథశర్మగారికి అంకితమిచ్చి గురుఋణము తీర్చుకొనిరి.

శ్రీ జక్కావారు ప్రస్తుతము హిందూపురము కళాశాలలో ఆంధ్రోపన్యాసకులుగా పనిచేయుచు, బి. ఏ., అద్యావన్న తెలుగులో లక్షణ గ్రంథములకు సంబంధించిన పరిశీలనతో ప్రథముడుగా వచ్చిన విద్యార్థికి రజత పతకముల నిచ్చి విద్యార్థులను ప్రోత్సహించు చున్నారు. వీరు Phd. పట్టమునకై ప్రయత్నించుచున్నారు. వీరు సౌమ్యులు, పండిత గోష్ఠులందు సభలందు విరివిగా పాల్గొనుచుందురు. మంచివక్తలు. సద్భావములు కలవారు. వీరు నిర్విరామముగా జ్యోతిష్య, సాహిత్య, వేదాంత గ్రంథములందు కృషి సల్పుచున్నారు, వీరికి భగవంతుడారోగ్యభాగ్యము లిచ్చుగాత.





విద్వాన్ - శిరోమణి
శ్రీ కలచవీడు
శ్రీనివాసాచార్యులు
జననము: 30_3_1911
తల్లి శ్రీమతి నరసమ్మ
తండ్రి శ్రీ వెంకటాచార్యులు
జన్మస్థలము. పొద్దుటూరు
జిల్లా: కడప
మతము. కులము హిందూ
బ్రాహ్మణ - శ్రీవైష్ణవులు

'కలచవీడు' అనంతపురం జిల్లాలో పేరెన్నిక గన్న పండిత కుటుంబము. ఈ కుటుంబీకులు స్వాతంత్ర్య సమరయోధులుగా, కవులుగా, పేరెన్నిక గన్నవారు. శ్రీ కలచవీడు వేంకట రమణాచార్యులు స్వాతంత్ర్య సమర యోధులుగా సుప్రసిద్ధులు. వీరి తమ్ములైన శ్రీ కలచవీడు శ్రీనివాసాచార్యులవారు కవులు, పండితులు. శ్రీనివాసాచార్యులవారు చాలాకాలము మదరాసు రాష్ట్రమునందు హిందూ ధర్మోపన్యాసములు గావించుచు కాలము గడిపినారు. 1955 నుండి ధర్మవరం జిల్లా పరిషత్ ఉన్నతపాఠశాలలో సంస్కృతోపాధ్యాయులుగాను, బుక్కరాయసముద్రములో ఆంధ్రోపన్యాస కులుగాను పనిచేసిరి ప్రస్తుతము శ్రీ సత్యసాయి మహిళా కళాశాలలో పని చేయుచున్నారు.

వీరు తిరుపతి సంస్కృత కళాశాలలో చదివి వ్యాకరణ శిరోమణి పరీక్షలయందుత్తీర్ణులగుటయే కాక స్వయంకృషితో విద్వాన్_మరియు పి. ఓ. యల్. పరీక్షల యందుత్తీర్ణులైరి. వీరికి సంస్కృతాంధ్ర ఆంగ్లములందు చక్కని పాండిత్యముకలదు. అనర్గళముగా ముపన్యసించగలరు. వీరి రచ

నలలో 'పరివర్తన' ఒకస్వతంత్ర ఖండకావ్యము. 'విరహి' సంస్కృతాను వాద కావ్యము. 'అసియాజ్యోతి' ఒకస్వతంత్రకావ్యము.

ఒక కలుషబుద్ధి తానుగావించిన యపరాధమునకు పశ్చాత్తప్తుడై ఒక యోగీశ్వరుని బోధామృతాస్వాదనమును పరమార్థముగా గ్రహించిన, కథా నికయే 'పరివర్తన' కావ్యముగా అవతరించినది. దీని మూలకథ ఆంగ్లములో కలదు. దానిని గొనివెంచి, సరళమైన, సులభమైన తేటగీతములలో వ్రాసిరి. పరివర్తన మందలి భావము లమోఘములు. ఇందు కథకంటెను భావములకే ప్రాధాన్యత నివ్వవలెను. ఇందలికొన్ని భావములను చూతము.

చేరుకొన్నది; మామూలు – చిత్తవృత్తి
కలిసికొన్నది; పాపసంతలన – రక్తి
కారుకొన్నది చోరసంఘ ప్రశక్తి
ప్రకృతి విడనాడ లేదయ్యె౽బామరుందు.
వెలిగిపోయిన వతని హృద్వీధియందు
తీవ్రతర ముఖవర్చః ప్రదీప్తరుచులు
తేరిపోయిన దజ్ఞాన తిమిరసంఘ
మొక్కత్రుటికాల మాతని యుల్లమందు

తదుపరి వీరు కాళిదాస ప్రణీతంబైన సంస్కృత 'మేఘసందేశ' కావ్యమును 'విరహి' యనుపేర ఆంధ్రానువాదము గావించిరి. ఈ మేఘ సందేశమును పెక్కుమంది తెనుగులోనికి పెక్కుక్రియలలో అనువాదము గావించినారు. శ్రీనివాసాచార్యుల యనువాదములోని గొప్పయేది? అను నదియే ఆలోచింపదగిన విషయము. ఆలోచించినచో ఇంతవరకును సీస పద్యములలో లలితశైలితో సులభగ్రాహ్యమగు రీతిని తెలిగించినవారు అరుదు. కాళిదాసు భావము లెక్కడను చెడలేదు. వీరి ఆంధ్రానువాదము వింత గమనింతము.

సీ॥ వడతిరో! భవదీయ భర్తృ సందేశము
 మది గొని వచ్చితి ముదముగూర్ప
నాప్తుడ, నీపతి కంబువాహుండ నేను
 జగముల నెల్లడ సంచరింతు
గంభీర మోహన గర్జా రవంబుల
 బ్రోషిత భర్తృకాలోల జటల
విడిపింప దలపోయు విభుల, బురంబుల
 కేగ నెప్పుడు బ్రోత్సహించు చుందు

గీ॥ ప్రణయ జనుల జేర్ప బాటుపడెడి వాడ,
నైజ మిద్ది ముదిత, నాకు కమక
నీ ప్రియుండు నన్ను నీ కడకంపెను,
కార్య సాధనమును గాంతుజేసి.

ఆచార్యులవారి 'ఆసియాజ్యోతి' సర్ ఎడ్విన్ ఆర్నాల్డు, ఇంగ్లీషులో రచించిన రచన కనువాదము, ఇది బుద్ధుని చరిత్ర. వృషభగతి వృత్తములలో వ్రాసినారు. మాయాదేవి గర్భముదాల్చినది. నవమాసములు నిండినవి. ఆమె ఒకనాటిరాత్రి సుందరమైన స్వప్నముగన్నది. స్వప్నవేత్తలా స్వప్న ఫలము విట్లుతెల్పిరి.

"కల మంచిదో—రాజ్ఞి! కల శుభ ప్రదమమ్మ!
కర్కాటకమ్ములో—గలసె భాస్కరు దీప్త
సుతుజన్మ తథ్యంబు—సుగుణాంచితుడతండు
లోకకారక మహాప్రజ్ఞతో సర్వాతి
కాయి, మహిమాన్వితుండౌచు—ప్రభవిల్లెడివి;
రాజ్యమే ఏలుచో—రాజాధి రాజౌను
లేదింత సందియం బిదియు—మా నిర్ణయము"

సంస్కృత భాషలో 'చక్రతీర్థ కోదండరామ సుప్రభాతము, లక్ష్మీ సుప్రభాతము' రచించిరి. ఇవి అముద్రితములు.

ఈ కవిగారికి నలుగురు కొమారులు, మగ్గురు పుత్రికలు గలరు. వీరందరును పరిపూర్ణ విద్యావంతులు. వీరిని, వీరి కుటుంబమును, సర్వదా సర్వేశ్వరుడు రక్షించుగాత!

# పుస్తక సమీక్ష

## రాయలసీమ రచయితల చరిత్రలు

## శ్రీ రావుల సూర్యనారాయణమూర్తి గారు

రెండు సంపుటాలలో వెలువడ్డ "రాయలసీమ రచయితల చరిత్ర"ను హిందూపురం శ్రీకృష్ణదేవరాయ గ్రంథమాలవారు ప్రచురించారు. శ్రీ కల్లూరి అహోబలరావుగారు వ్రాసిన ఈ గ్రంథం ప్రథమ సంపుటి వెల 8 రూపాయలు. ద్వితీయ సంపుటి వెల 6 రూపాయలు.

విజయనగర సామ్రాజ్యం విజయ ధ్వజమెత్తిన కాలంలో తెలుగు సరస్వతి తేజరిల్లింది. సాహితీ సమరాంగణ సార్వభౌముడైన శ్రీకృష్ణ దేవరాయల పరిపాలనలో రాయలసీమ రత్నాలసీమగా రాజిల్లి, దిగంత విశ్రాంతి గీర్తి గడించింది. అలాంటి రాయలసీమలోని రచయితలపై సాటిలేని అభిమానంతో శ్రీ కల్లూరు అహోబలరావుగారు వ్రాసిన ఈ చరిత్రలు ఆంధ్ర వాఙ్మయానికి చక్కని అలంకారాలు. ఇంతవరకూ మొదటిభాగంలో 20 మంది కవుల చరిత్రలు, రెండోభాగంలో 31 మంది కవుల చరిత్రలు ప్రకటించారు.

కవి పండితుల చరిత్రలను విలక్షణ రీతులలో సేకరించి ప్రజోప యోగార్థం ప్రచురించడమంటే శ్రీ కల్లూరు అహోబలరావుగారికి మిక్కిలి మక్కువ. ఆయన కృషిని మెచ్చుకొని ఎందరో సాహిత్యాభిమానులు

ఆర్థికంగా సాయపడి ప్రోత్సహించారు. జాతీయత ఆయనలో ముడిపడి ఈ జీవిత చిత్రణ లన్నిటిలోను తొంగిచూస్తూ తొణికిస లాడుతున్నది.

ప్రస్తుత శతాబ్దంలో ఋషిప్రాయులూ, రాగద్వేష రహితులూ అయిన కవులు బహుముఖాలుగా విస్తరిల్లిన విజ్ఞానవిశేషాలనూ, సాంఘిక రాజకీయాది పరిణామాలనూ, సాకల్యంగా సాహిత్యశిల్పంతో రూపొందిన, అనేక గ్రంథా లకు సంబంధించిన వివరాలను ఈ చరిత్రలు వెల్లడిస్తున్నాయి.

ప్రసిద్ధ వ్యక్తుల జీవిత చరిత్రలను గురించి తెలుసుకోవడం మనధర్మం. ఇందులో చేరవలసిన కవులు, రచయితలు మరెందరో ఉన్నప్పటికిన్నీ, చేసి నంతవరకూ చాలాచక్కని కృషియిది. రాయలసీమలోని రచయితల ప్రజ్ఞోవ ప్రజ్ఞలలో ఆధునికాంధ్ర సాహిత్యంలోని తీరుతెన్నులూ తెలుసు కోవడానికి వీటిద్వారా వీలవుతుంది.

ఈ చరిత్రలో దుర్భాక రాజశేఖర శతావధాని, వావిలికొలను సుబ్బా రావు, జనమంచి శేషాద్రిశర్మ, గడియారం వేంకటశేషశాస్త్రి, పూతలపట్టు శ్రీరాములురెడ్డి, పుట్టపర్తి నారాయణాచార్యులు, కట్టమంచి రామలింగారెడ్డి' చిలుకూరి నారాయణరావు, రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ వంటి ప్రసిద్ధులు. విద్వజ్జన లోకానికి సుపరిచితులులతోపాటు ఆంధ్రసాహిత్య లోకంలో ప్రచా రం లేకుండా అజ్ఞాతంగావున్న కొందరు కవులూ, మనోజ్ఞాలైకూడా రచ్చ కెక్కనివారి ఆధునిక ప్రబంధాలూ చోటుచేసుకోవడం సంతోషదాయం.

ఈ జీవిత చరిత్రలలో అనేక గ్రంథాలను సమీక్షించడమే కాకుండా ఉత్కంఠ కలిగించే ఎన్నో సంఘటనలు వివరించడం శ్రీ కల్లూరు అహో బలరావుగారి సాహితీ ప్రజ్ఞకు తార్కాణం. సహృదయ లోకానికి ఈ రాయల సీమ చరిత్రలు మోదం చేకూర్చగలదని విశ్వసించవచ్చును.

ఆకాశవాణి-హైదరాబాద్. (7–10–1977)